జాతీయ జీవిత చరిత్ర గ్రంథమాల

# సిస్టర్ నివేదిత

రచన

**బసుధా చక్రవర్తి**

అనువాదం

రాధా మనోహరన్




నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

# విషయ సూచిక

# 1

# కర్తవ్య నిర్వహణ కోసరమే జన్మ

''ఐరిష్ విషాద సాహిత్యములో మాత్రమే, మన ఆత్మ సమరూప్యత గోచరిస్తుంది. మనలాగే వారుకూడా చాలా కాలంగా ఓటమిని పొందినవారు. వారూ యుద్ధాలకు వెళ్ళారు. కానీ సర్వదా పరాజయమే వారికి దక్కింది.'' అని దశాబ్దాల క్రితం సమర్ధుడైన, ఒక సమీక్షకుడు వ్రాశాడు. ఐర్లెండ్ దేశపు స్వాతంత్ర్య పోరాటం, రెండు తరాల భారతీయులను గాఢంగా ప్రభావితుల్ని చేసిన సందర్భంలో అన్నమాటలివి. ఈ దేశపు స్వాతంత్ర్య సమరంలో, చురుకుగా, శక్తివంతంగా, భాగం పంచు కోవటంతో పాటుగా, భారతీయ సాంస్కృతిక ఆత్మను, వారసత్వాన్ని అవగాహన పరుచుకోవటానికి, మార్గరెట్ నోబెల్ అంకురార్పణ వేసిన సందర్భంలో కూడా ఈ మాటలు సరిగ్గా అన్వయిస్తాయి. భారతదేశంలో తన కర్తవ్యం నిర్వర్తించటానికే, ఆమె జన్మించిందా అనిపిస్తుంది.

ఆమె పితామహుడు, మాతామహుడు ఐరిష్ స్వాతంత్ర్య సమరంతో సంబంధం వున్నవారే. వారు ఆంగ్లేయుల పాలననుంచి విముక్తికి పోరటం చేసిన వారు. మార్గరెట్ తాతగారు, జాన్ నోబెల్ ఉత్తర ఐర్లెండ్‌లో వెస్‌లేమన్ చర్చిలో మతప్రచారంచేసే ఫాదరీ. అయితే తన దేశ స్వాతంత్ర్యం కోసరం ఇంగ్లండ్ చర్చి అదికారులతో పోరాడటానికి తన ఉద్యోగం అతనికి ప్రతిబంధంకం కాలేదు. నోబుల్ వంశస్థులు పధ్నాలుగవ శతాబ్దంలోనే స్కాట్‌లాండ్‌నుంచి, ఐర్లెండుకు వలసపోయారు.

జాన్ నోబెల్, మార్గరెట్ నియాలన్ ఎలిజబెత్‌ను వివాహంచేసుకున్నాడు. కాని అతను తన ముప్పై అయిదవ ఏట మరణించాడు. వారి నాలుగన సంతానం శామ్యూల్ రిఛ్‌మండ్. తన తల్లికి సహాయంగా ఉండటంకోసం రిఛ్‌మండ్ వ్యాపారంలో దిగవలిసి వచ్చింది. పక్కింటి అమ్మాయి మేరి ఇజబెల్ హామిల్‌టన్‌ను రిఛ్‌మండ్ పెళ్ళాడాడు. వారి మొదటి కూతురు మార్గరెట్. టైరోని కౌంటిలోని డంగానన్‌లో 1867లో అక్టోబర్ 28న జన్మించింది.

మార్గరెట్ పుట్టగానే తల్లి ఆమెను భగవంతుని సేవకు అంకితం చేసినట్లు అధికారికంగా తెలుస్తుంది.

ఒక సంవత్సరం తర్వాత శామ్యూల్, మేరీలు తమ జీవన విధానాన్ని మార్చు కొనటానికి నిర్ణయించుకొన్నారు. అధ్యయనం, సేవ వారు ధ్యేయంగా పెట్టుకున్నారు. పసిపాప మార్గరెట్‌ను, అమ్మమ్మ సంరక్షణలో వదిలిపెట్టి వారు ఇంగ్లండ్ వెళ్ళారు. మాన్‌చెస్టర్ నగరంలో నివాసం ఏర్పరచుకొన్నారు. శామ్యూల్ మత ధర్మశాస్త్రం అధ్యయనం చేస్తూవుండేవాడు. కర్మాగారాలలో పనిచేస్తున్న ఐరిష్ కార్మికులను, ఇతర ఐరిష్ దేశస్థులను సమీకరించి సభలు చేస్తుండేవాడు. మత ప్రచారకునిగా జీవితం వెళ్లబుచ్చటం ఆ రోజుల్లో చాలా కష్టంగా ఉండేది. ముప్పైనాలుగు ఏళ్ళ పిన్నవయస్సులోనే శామ్యూల్ చనిపోయాడు. ఇద్దరు కూతుళ్ళు..మార్గరెట్, మేరి, కొడుకు రిచ్‌మండ్‌లతో మేరి ఒంటరిగా మిగిలిపోయింది. తండ్రినుంచీ, స్వాతంత్ర్య పోరాటంలో ముఖ్యపాత్ర వహించిన తాతనుంచీ మార్గరెట్ సేవానిరతిని, మాతృదేశ అభిమానాన్ని పుణికి పుచ్చుకొంది.

విద్యాభ్యాసంకోసం మార్గరెట్, మేరీలు హాలీఫాక్స్ కాలేజీకి వెళ్లారు. వారు మిస్‌లారెట్, మిస్‌కోలెన్స్‌ల పర్యవేక్షణలో వుండేవారు. పర్యవేక్షకులు కఠినంగా వున్నా వీరిని జాగ్రత్తగా చూసుకొనేవారు. క్రైస్తవ మతానికి చెందిన కొన్ని మౌలికమైన ప్రశ్నలు మార్గరెట్‌ను ఆందోళన పరచసాగాయి. ఆ సమయంలో మిస్‌కాలెన్స్ ఆదర పూర్వకమైన పర్యవేక్షణలో మార్గరెట్ హేతు బద్ధంగా ప్రశ్నించటం, లోతుగా ఆలోచించటం అలవర్చుకొంది. కాలేజిలో వున్నపుడే మార్గరెట్ సంగీతం, చిత్రలేఖనం, జీవ శాస్త్రాలపై అభిరుచిని పెంపొందించుకొంది. 1884 లో తన పదిహేడవ ఏట ఆఖరి సంవత్సరం పరీక్షలో కృతార్థురాలైంది. ఆమె ఉపాధ్యాయ వృత్తి చేపట్టింది. రెక్స్‌హామ్ ఖనిజపు గనులకు కేంద్రస్థానం. ఉపాధ్యాయ వృత్తి చేస్తూనే మార్గరెట్ పేదవారైన గనికార్మికులకు, సాంఘిక సేవా కార్యక్రమాలలో తోడ్పడేది.

ఆ సమయంలో వేల్స్‌కు చెందిన ఒక యువకుడైన ఇంజనీర్‌తో ఆమెకు పరిచయము అయింది. వారిద్దరూ వివాహం చేసుకోవానుకున్నారు. కానీ విధి నిర్ణయం వేరుగా వుంది. ఆ యువకుడు ఒక భయంకరమైన వ్యాధివల్ల మరణించాడు. మార్గరెట్ ఒంటరిగా మిగిలిపోయింది.

తరువాత ఆమె చెస్టర్ వెళ్ళింది. ఆమె సోదరి మేరి లివర్‌పూల్‌లో ఉపాధ్యాయిని. సోదరుడు రిఛ్‌మండ్ కాలేజీలో వున్నాడు. వారి తల్లి ఐర్లెండ్‌నుంచి వచ్చి వారితోనే వుంటోంది. మార్గరెట్ కుటుంబ సభ్యుల దగ్గర వుంటూ విద్యా బోధనలో నూతన పద్ధతులపై అధ్యయనం చేయసాగింది. ఈ

నూతన విధానాలను రూపొందించిన మహనీయులు ఇద్దరున్నారు. స్విట్జర్లాండ్ దేశపు విద్యాసంస్కర్త పైస్టాలొజీ జర్మన్‌దేశపు విద్యావేత్త ఫ్రోయిబెల్. పాఠశాలలో చేరకముందే పిల్లలకు విద్యనేర్పే విధానాన్ని వారు రూపొందించారు. ఆటల ద్వారా, వ్యాయామం ద్వారా పరిశీలన ద్వారా, అనుకరణద్వారా, నిర్మాణాత్మకమైన, కార్యశీలత పిల్లలలో అలవర్చటమే ఆ విద్యావిధాన లక్ష్యం. ఈ పద్ధతులను అప్పటికే చాలామంది విద్యావేత్తలు ఆచరణలో పెట్టారు. ఈ విధానం మార్గరెట్‌ను బాగా ఆకర్షించింది.

లాగమైన్ దంపతులు మరియు శ్రీమతి లీయూ మార్గరెట్‌ను ''సన్‌డేక్లబ్'' కు పరిచయం చేశారు. అక్కడి సభ్యులు ఆమె ఉపన్యాసాలను, రచనలను ఎంతగానో మెచ్చుకొన్నారు. లండన్‌లో ప్రారంభించిన ఒక నూతన పాఠశాలో విద్యాబోధనకు శ్రీమతి డా॥ డీలీయు, మార్గరెట్‌ను ఆహ్వానించింది. ఆమె అందుకు అంగీకరించింది. తల్లితో పాటు వింబుల్‌డన్‌లో నివాసం ఏర్పరుచుకొంది. ఈ బడిలో పాత బోధనా విధానాలను అవలంబించవలసిన అవసరం ఆమెకు లేకపోయింది. ఆటలద్వారా, పాటల ద్వారా విద్యనేర్చు కునేందుకు పిల్లలను స్వేచ్ఛగా వదిలేస్తే చాలు. ఆవిధంగా ఆమెకు ఉపాధ్యాయ వృత్తి ఒక ఆనందదాయకమైన విషయం అయింది. కానీ ఆమె తన సాంస్కృతిక అన్వేషణను మాత్రం కొనసాగిస్తూనే వున్నది. సోదరులతో సంభాషిస్తూ వుండేది. బెట్టీ సోదరులలో ఒకరు కవి. ఒకరు పాత్రికేయుడు. ఆక్టేవియస్ బెట్టీకి ''వింబుల్‌డన్ న్యూస్'' అనే పత్రిక వుండేది. ఆ పత్రిక్కి మార్గరెట్ వ్యాసాలు వ్రాస్తూ వుండేది. ''డైలీ న్యూస్'',''రివ్యూ ఆఫ్ రివ్యూస్'' అనే పత్రికలకు రాజకీయ వ్యాసాలు కూడా వ్రాసేది. లబ్ధప్రతిష్టుడైన విలియమ్ స్టీయడ్, రివ్యూ ఆఫ్ రివ్యూస్‌కు సంపాదకుడు. మార్గరెట్‌కు స్టీయడ్‌తో పరిచయం కలిగింది. 'రీసెర్చి' అనే శాస్త్ర విజ్ఞానపత్రికకు కూడా వ్యాసాలు వ్రాస్తూ వుండేది.

లండన్ రాగానే 'ఫ్రీ ఐర్లెండ్' అనే విప్లవ సంస్థలో సభ్యురాలుగా చేరింది. అంతేకాక వారి సభల్లో ప్రసంగించేది. ఫ్రీ ఐర్లెండ్ సంస్థ తాలూకు విభాగాలను దక్షిణ ఇంగ్లండ్‌లో స్థాపించింది. ''మ్యూచువల్ ఎయిడ్'' అనే గ్రంథాన్ని వ్రాసిన ప్రపంచ ప్రఖ్యాత రచయిత ప్రిన్స్ క్రోపోట్కిన్ సాంఘిక విప్లవానికి మౌలిక సూత్రాలను ప్రతిపాదించిన మేధావి. అతను లండన్‌లో వుండగా ఫ్రీ ఐర్లెండ్ సంస్థ సభ్యులను కలుసుకోవాలనుకున్నాడు. మార్గరెట్‌కు ఆయనతో పరిచయమైంది. క్రమబద్ధమైన ఆయన మార్గదర్శకత్వం విప్లవ కార్యక్రమానికి లభించింది. అప్పట్లో రష్యా ఉద్రిక్త పరిస్థితిలో వున్నది. అయితే రష్యా

అనుభవాన్ని అనుసరించి పాఠాలు నేర్చు కునేముందు, ప్రతిదేశం తమ పరిస్థితులకు అనుగుణంగా తమకు తగిన విప్లవ మార్గాన్ని నిర్ణయించుకోవాలని క్రోపోట్కిన్ నొక్కిచెప్పారు.

విప్లవం దేశంలోంచే ఆవిర్భవించాలి. అంతేగాని విప్లవమనేది, ఎక్కడినుంచో ఆకాశంనుంచి వూడిపడదు. ఈ పాఠాలు మార్గరెట్ హృదయానికి తీవ్రంగా హత్తుకుపోయాయి.

మార్గరెట్, 1895 వ సంవత్సరం ఆఖరికి శ్రీమతి డిలీయూ సహచర్యాన్ని వదిలి తనే స్వయంగా ఒక పాఠశాల స్థాపించింది. దానిపేరు 'రస్కిన్ స్కూల్' ఇది కేవలం పిల్లలకు మాత్రమేకాదు. పరిశోధనా మనస్కులైన విద్యావేత్తలకు కూడా ఉపకరిస్తుంది. అటువంటి జిజ్ఞాసువుల్లో ఎబ్‌నజార్‌కుక్ ఒకడు. చిన్న పిల్లలకు చిత్రలేఖనం నేర్పడంలో, చేసిన ప్రయోగాలవల్ల అతనికి ఎంతో ఖ్యాతి లభించింది. మార్గరెట్ అతనివద్ద చిత్రకళను అభ్యసించంది. అతనివద్ద నేర్చుకొన్న చిత్రకళా విజ్ఞానము ఆమెకు ఆ తరువాత ఎంతో ఉపయోగించింది. భారతదేశంలో కళా విమర్శ–కళలను అభివృద్ధి చేయటానికి కావలసిన నేర్పును సంపాదించింది. ఆ విభాగాలలో మార్గరెట్ కృషికి అదే ప్రాతిపదిక అయింది. త్వరలోనే సాహిత్యపరంగా కూడా ఆమె కృషి విస్తరించటం మొదలుపెట్టింది.

లేడీ రిప్పన్‌తో మార్గరెట్‌కు పరిచయమైంది. లేడీ రిప్పన్ భవంతి కళాసాహిత్య చర్చలకు ఒక వేదికగా ఉండేది. తరువాత మార్గరెట్ సహాయంతో అదే 'సెసేమ్ క్లబ్' గా మారింది. ఆనాటి ప్రసిద్ధ సాహితీ వేత్తలకు, కళాకారులకు అది సమావేశ స్థలంగా ఉండేది. జార్జిబెర్నార్డ్‌షా, థామస్ హక్స్‌లీ వంటివారు అక్కడకు తరుచుగా వచ్చేవారు.

ఈ పరిస్థితుల్లో మార్గరెట్‌కు వ్యక్తిగతమైన నిరాశ ఆవరించింది. హలిఫాక్స్ కాలేజిలో తనకు చదువు చెప్పిన మిస్ కాలిన్స్ ఆదరణ, ఓదార్పు అధికంగా లభించటంతో ఆమె ఊరటపొందింది.

మార్గరెట్ ఇప్పుడు విద్యావేత్తగా, సంఘసేవికగా, కళాసాహిత్యాభిమానిగా, అంతిమ సత్యాన్వేషకురాలుగా, పరిణత చెంది చక్కని మార్గంపై నిలవ కలిగింది. దానివల్లనే ఆమె భావి జీవితంలో ఆమె ఆశయాలు సఫలీకృతం అయ్యాయి. తరువాత జరిగిన సంఘటన ఆమె జీవితాన్ని ఒక మంచి మలుపు తిప్పి, కొద్ది కాలంలోనే ఆమెను భారతదేశం తీసుకువెళ్లింది.

# 2

# గురు సమాగమం

మిస్టర్ ఎబెజనార్‌కుక్ 1895వ సంవత్సరం నవంబరులో ఒకరోజు మిస్ మార్గరెట్ నోబుల్‌ను లేడీ ఇజబెల్ మార్గసాన్ భవనానికి ఆహ్వానించాడు. అక్కడ ఒక హిందూ యోగి మతతత్వాన్ని గురించి చర్చలు జరపుతారు. అంతకుముందే సెసేమ్ క్లబ్‌కు చెందిన మిస్టర్ స్టర్డీ, హెన్రీయట్ మ్యుల్లర్, ఇంకా ఇతర సభ్యులద్వారా ఒక యోగి ఇంగ్లండ్‌లో వున్నాడని 1893లో చికాగోలో జరిగిన ప్రపంచ మత సభలలో అనర్గళంగా హిందూమతం గురించి ఉపన్యసించిన స్వామి వివేకానందుడే, ఆ యోగి అని తెలుసుకొంది. అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని ప్రజలను ఆయన ప్రసంగం తుఫాను వలె ఊపివేసింది. ఆయనే మిస్టర్ స్టర్డీ వద్ద ఉన్నారు. అప్పటికే లండన్ నగరంలో కొన్ని ప్రసంగాలు చేశాడు. మిస్ మార్గరెట్ నోబుల్, స్టర్డీ ఆహ్వానాన్ని అంగీకరించింది. ఆరోజు స్వామి ముందు వున్న 15, 16 మంది శ్రోతలలో ఆమె ఒకతె. వివిధ దేశాల మధ్య పరస్పర అభిప్రాయాల వినిమయం యొక్క ఆవశ్యకతను గురించి ఆ రోజు స్వామి మాట్లాడారు. సోదరి నివేదితగా పది ఏళ్ల తరువాత ఆమె వ్రాసిన గ్రంథం ''నా దృష్టిలో గురువు'' (ది మాస్టర్ యాజ్ ఐ సా హిమ్) లో ఇలా వ్రాసింది.

''ప్రాచ్య దేశంలోని అద్వైతం- అంటే సమస్తము నందు భగవంతుని చూసేమతం- రకరకాల అభిప్రాయముద్రల చిత్రీకరణ. భిన్నత్వంలో ఏకత్వం వంటిది'' అని స్వామి చెప్పారు. భగవద్గీతనుంచి ఒక శ్లోకాన్ని వుటంకించి దాన్ని ఇంగ్లీషులోకి అనువదించారు. '' ఇవన్నీ దండగా గుచ్చబడిన ముత్యాల్లాగ నా మీద వున్నాయి'' క్రైస్తవ మతంలో లాగానే హిందూమతంలో కూడా ప్రేమ పరమ ఉత్కృష్టమైన భక్తి భావావేశంగా గుర్తించబడింది'' అని కూడా స్వామి చెప్పారు.

''హిందువుల దృష్టిలో శరీరాన్ని బుద్ధిని కదిలించేది, ఆదేశించేది, మూడోది ఒకటి వుంది. అదే ఆత్మ,'' అని స్వామి చెప్పారు. ఆ మాటలు

నన్ను బాగా ఆకట్టుకున్నాయి. ఆ తరువాత స్వామి చెప్పిన విషయాలు నేను అనుభవం మీద తెలుసుకొన్నాను'' అంది మార్గరెట్.

ఆత్మ స్వాతంత్ర్యం అన్న ఆదర్శానికి, పాశ్చాత్యుల మానవ సేవకు వైరుధ్యం కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. అయితే మానవసేవే తన జీవిత ఆశయం అని చెప్పిన స్వామి మాటలు అక్కడి వారిలో సంశయాన్ని రేకెత్తించి ఆయన మాటల్లో సారూప్యత లేదనిపించాయి. పాశ్చాత్య శ్రోతల బుద్ధిని ప్రతిఘటించటానికి స్వామి కావాలని అట్లా చెప్పినట్లు అనిపించింది. మార్గరెట్‌కూడా స్వామి ఉపదేశాలను అవగాహన చేసుకోవటానికి ప్రయత్నిస్తోంది. స్వామినిపూర్తిగా అర్థంచేసుకోవటానికి లండన్‌లో స్వామి ప్రసంగాలు మరి రెండు శ్రద్ధగావింది.

''మామూలు ధోరణిలో అయితే ఏ మతంలో చెప్పేదీ సత్యం అనిపించదు. కాని నిజానికి లోతుగా పోతే ప్రతి మతంలో చెప్పేది సత్యమే- ''అన్న స్వామి మాటలు ఆమోదించటంలో తనకు ఏ విధమైన క్లిష్టత లేకపోయింది అని తరువాత మార్గరెట్ ''నా దృష్టిలోస్వామి'' అన్న పుస్తకంలో వ్రాసుకొంది. ''భగవంతుడు యదార్థానికి రూపరహితుడే...కాని ఇంద్రియాలనే పొగమంచు గుండా చూసినప్పుడు మాత్రం భగవంతుడు మూర్తిమంతుడు అనిపిస్తుంది-'' అన్న స్వామిమాటలు ఆమె హృదయాన్ని హత్తుకుపోయి, విభ్రాంతపరిచాయి. '' ఒకపని చేయటానికి వెనుక వున్న ప్రేరణ, ఆ పని కంటే చాలా గొప్పది'' అనే స్వామి పరిశీలన ఆమెకు తాత్కాలికంగా అంగీకారయోగ్యమైంది. కానీ స్వామియొక్క ఆలోచనా ధోరణిని మొత్తంగా అంగీకరించటానికి ఆమె సుముఖంగా లేదు. అయితే ఆయన తాను నమ్మి, బోధించిన, దానికి, భిన్నంగా వున్న సత్యం కోసం చూపే ఉత్సాహం, ఆయన వ్యక్తిత్వం, ఆమెను విపరీతంగా ఆకర్షించాయి. అప్పుడు, ఇంగ్లండ్ విడిచిపెట్టక మునుపే మొదటిసారిగా స్వామి వివేకానందను ఆమె గురువుగా సంబోధించింది.

''గురువును చేరుకోవటం కష్టతరమైన విషయం'' అని స్వామియే అంగీకరించారు. ''కానీ దానికి ఎవరూ విచారించవలసిన అవసరంలేదు. అందరూ గురువును అర్థంచేసుకోవటానికి అంత తొందరగా వున్ముఖులు కాలేరు. నేను నా గురువైన శ్రీరామకృష్ణపరమహంసతో ఆరు దీర్ఘసంవత్సరాలు హోరాహోరి పోరాడాను. దాని పర్యవసానం ఆయన మార్గంలో ప్రతిఅంగుళము నేను తెలుసుకోగలిగాను...ప్రతి అంగుళమూ... తెలుసు కొన్నాను''. అవి స్వామి మాటలు. ఎవరికైనా మానసికంగా ప్రభావితం

చేయటం ఆయనకు ఇష్టం వుండదు. స్వామి దృష్టిలో హేతువాదము, అవగాహన, వాస్తవాన్ని గ్రహించగలగటం... సత్యాన్వేషణకు మార్గాలు. విశ్వాసం అనే మాటకు ఆయన అభ్యంతరం చెప్పారు.

ఆలోచనల ధర్శనానికి తన మనో గవాక్షాన్ని తెరిపించిన వానిగా, స్వామిగురించి తన గ్రంథంలో సిస్టర్ నివేదిత వ్రాసింది. ఆమెను సంతృప్త పరచలేక పోయిన క్రైస్తవ మత మూఢ నమ్మకాలనుంచి ఆమె బయట పడగల్గింది. నూతన భావ ప్రపంచానికి ఆమె పరిచయం చేయబడింది. ఎడారిలో మృగతృష్ణ గురించి స్వామివివరించిన ఉదంతం దీనికి ఒక చక్కని ఉదాహరణ. ఎడారిలోని ఒక ఎండమావిని పదిహేను రోజులు స్వామి చూశారు. ఆయనకు అది ఒక నీటి పట్టులాగానే కనిపించింది. దాహమేసి నప్పుడు ఎండమావి నిజంగా నీరుకాదని తెలిసింది. అనుభవం మీద అది... మిధ్య అని నిజంగా నీటిమడుగు కాదని తెలిసింది. మార్గరేట్‌కు అటువంటి భావనలు సభోదకంగా గోచరించాయి.

ఆయన తనలోని విజ్ఞాన వికాశాన్ని ప్రదర్శించరు. సామాన్యులను, అమాయకులను ఉన్నతులుగా చేయటంలో ఆయన ఆడంబరత్వాన్ని చూపించరు. చిన్నచిన్న మాటలతో వారికి అర్థమయ్యే రీతిలో ఉన్నతమైన, ఉదాత్తమైన విశేషాలను చెప్పి వారంతటవారు స్వయంగా సత్యాన్ని దర్శించేటట్లు చేయగలరు. స్వామీజీలోని ఈ ప్రక్రియాంశము ఆమెకు బాగా నచ్చింది.

1896 ఏప్రియల్ నుంచి స్వామి కొన్ని యూరప్ దేశాలు తిరిగి, చర్చిలలో పాల్గొని డిశంబర్ నాటికి భారతదేశానికి చేరారు. అప్పటికి మార్గరెట్ స్వామి బోధలను బాగా అర్థంచేసుకొని జీర్ణించుకో గల్గింది. స్వామి ఎప్పుడూ ఒక నిర్ణీతమైన మతం గురించి చెప్పరు. అన్ని మతాలలోను అంతర్లీనంగా ఉన్న సత్యాన్ని తెలియ పరిచేవారు. వేదాలలో, ఉపనిషత్తులలో, భగవద్గీతలో ఉన్న ఉదాహరణలను ఉటంకించే వారు. అస్థిత్వం ఒక్కటే అని, అది వస్తుసంజ్యాతమైనదని అన్నారు. ఈ భౌతికవాద నిర్వచనాన్ని ఆయన ఆహ్వానించారు. అయితే ఆ శక్తినే స్వామి, భగవత్ స్వరూపంగా సంభావించారు. మాయ అనే పదాన్ని స్వామి వివరించారు.

''మాయ అనేది కేవలమైన భ్రాంతి కాదు. సత్యాన్ని పొగమంచు వలె కప్పి ఉంచేదే మాయ- మనం వ్యర్థంగా మాట్లాడుతాము... ఇంద్రియ వాంఛలతో... సంతృప్తి చెందుతాము... కోరికల వెంట పరుగులిడతాము... అందుచేత ప్రకృతినే మాయ అని తెలుసుకోండి...భగవంతుడు మనను పరిపాలించినట్లు బుద్ధి మాయను పరిపాలిస్తుంది'' అని స్వామీజీ చెప్పారు.

''వేదాంతంలోని ఈ మాయ, ఆధునిక పరిణామంలో, కేవలము నిత్యజీవన నిజాల జాబితా మాత్రమే. మనం ఎవరం? మనం ఏమిటి?... పరిసరాలలో మనం ఏం వీక్షిస్తూ వుంటాం?... ఇటువంటివి. ఈ మాయనుంచి స్వాతంత్ర్యం పొందుటమే ముక్తి. ప్రకృతికి మానవుడు బానిస కారాదు. ప్రకృతికోసం ఆత్మలేదు. ఆత్మ కోసం ప్రకృతి వుంది'' అన్నారు. స్వామి వివేకానంద వేదాంతం గురించి వివరిస్తూ.

కేవలం ఇంద్రియ జ్ఞానానికి పరిమితమైన ఈ ప్రపంచమే మాయకాదని జటిలమైన, లోపభూయిష్టమైన, స్వయం,విరుద్ధమైన, విజ్ఞానానికి వివరణ చెప్పే పదమే, మాయ అని మార్గరెట్ నోబుల్ తెలుసుకొంది. వివేకానందుని మాటలను ఆమె ఇలా ఉదహరించింది. ''మాయ అనేది ఒక ప్రకటన. అది ఒక వాద ప్రక్రియకాదు. ఈ ప్రపంచం ఒక భయంకరమైన శిక్షా నరకం. నిజానికి మనకి ఈ విశ్వాంతరాళం గురించి ఏమి తెలియదు. స్వప్నం మధ్యలో, సగం నిద్రలో, నడిచినట్లు, సగం నడకలో, నిద్రించినట్లు మన జీవితాలన్నీ మసకబారి పోతున్నాయి. మనలో ఏ ఒక్కరి పరిస్థితి యొక్క ఖర్మమైనా ఇట్లాగే ఉంటుంది. అదీ ప్రపంచ ప్రవృత్తి''. ఈ వాక్యాలను బట్టి మార్గరెట్ మాయ అనే పదానికి అర్థం వివరిస్తూ ఇట్లా ముగించింది.

'' ఈ విధంగా మాయ అంటే ఒక మిణుక్ మిణుక్‌మనే, మోసపుచ్చే, సగం... సత్యం, సగం అసత్యంగా వుండే సంక్లిష్టత. అందులో విశ్రాంతి లేదు...సంతృప్తి లేదు...పరమ పదమైన వాస్తవికత లేదు. మనం ఇంద్రియాలద్వారా ఒకానొక... స్పృహలో, ఈమాయలో వుంటాం. ఆ ఇంద్రియాలపై ఆధారపడిన మనస్సుపై ఆధారపడతాం''- ఆ విధంగా చెపుతూ వివేకానందుని మాటలలో ఇంకా ఇలా అంది. ''అదే సమయంలో ఈ జగత్తు అంతా ఆవరించుకొన్న శక్తినే భగవంతునిగా గుర్తించండి''. ఈ రెండు భావనలు ఒకదాని ప్రక్కన ఒకటి వుంచి హిందూమత వికాసాన్ని పాశ్చాత్యులకు స్వామి వివేకానంద సమర్పించిన విధానాన్ని ఆమె వివరంగా తెలియపర్చింది.

స్వామి వివేకానంద వేదాంత విధానం మార్గరెట్‌కు ఐహిక సుఖాలను పరిత్యజించే ప్రక్రియగా కనిపించింది. అంతేకాక ఆ మార్గం అతి కఠినమైనది. విశ్రాంతికి తావులేనిది. అంటే శ్రమతో కూడినది. కాని మాయ నుంచి తప్పించి ఆత్మను గురించి తెలుసుకొనేటట్లు చేయగల మార్గం అదే. అటువంటి స్వార్థత్యాగమే విజయానికి మారుపేరు. దీనిని గురించి వివరిస్తూ మార్గరేట్ మంచి ఉదాహరణ ఒకటి చెప్పింది. స్వార్థత్యాగంతో, కృషితో, కష్టపడి స్టీఫెన్‌సన్ ఆవిరి యంత్రాన్ని కనిపెట్టిన ఉదంతం ఆమె ఉదహరించింది.

శీలం అన్నిటికన్నా మహోన్నతమైనదని వివేకానందుడు చెప్పాడు. చెడ్డను నిరోధించటం పౌరుని భాధ్యత. ప్రతిఘటించకుండా ఉండటం సన్యాసి లక్షణం. బౌద్ధమతానికి, హిందూమతానికి ఒక బేధం వుంది. బౌద్ధమతంలో అహం నిజంకాదు. బహుత్వమే సత్యం. హిందూమతంలో అద్వైతం సత్యం, బహుత్వం అసత్యం, అన్న అభిప్రాయం మామూలుగా వాడుకలో వుంది. వివేకానందుడు దానిని... తేలికగా పరిష్కరించాడు.

నేను అనేదీ, బహత్వమనేదీ ఒకేవిధమైన సత్యాలని, ఒకే బుద్ధి వివిధ సమయాలలో వివిధ దృక్పధాలలో పొందే మానసిక అనుభూతి అని వివేకానందుడు వివరించాడు. నిజానికి స్వామిజీ వాస్తవమైన అస్థిత్వము గురించి చాలా లోతుగా ఆలోచిస్తారు. ఆత్మను దివ్యతేజోభరితంగా, శక్తి పూరితంగా చేయగల మహిమాన్వితుడు ఆయన.

''ప్రకృతి ఆత్మాశ్రయము, కాని ఆత్మ ప్రకృతిపై ఆధారపడదు.'' అని స్వామి ప్రవచించారు. బాధా తప్తమయి, దహించుకుపోతున్న ఈ ప్రపంచాన్ని ప్రేమతో సేవించటానికి ధైర్యంగా ముందుకు రమ్మనమని తన ఆశ్రితులకు స్వామీజీ సందేశం ఇచ్చారు.

స్వార్థ పరిత్యాగంతో కూడిన ఆత్మచైతన్యం వల్లనే మానవుడు ఔన్నత్యాన్ని పొందుతాడని, ఈ శరీరం అతీంద్రియతత్వం పొందుతుందని స్వామి ఉపదేశించారు. ఈ సత్యాన్ని గుర్తించటానికి మార్గరెట్‌కు చాలాకాలం పట్టింది. కాని ఆ అనుభూతి అప్పటికి ఆమె మనసులో ఉదయించటం మొదలెట్టింది.

ప్రేమ అంటే స్వచ్ఛమైన పరమానంద స్థితి... స్వయం వ్యక్తమగు అనుతాపము, ప్రేమ అనే ఆ పరమానంద స్థితియొక్క విలువలను తగ్గించి వేస్తుంది. నాది ఇతరులది అన్న తారతమ్య భావమే... ద్వేషం.

దానికి సమ్మతించినట్లయితే ఇంకా కొన్ని విషయాలు తెలుస్తాయి. ఇతరులకు సహాయం చేయ్యటం మాత్రమే ఒక ఉన్నతమైన అంతిమ విషయము కాదనీ, ఆధ్యాత్మిక చింతనము కూడా ముఖ్యమైనది అనీ, దాని తర్వాతనే ప్రజ్ఞావంతమయిన విజ్ఞానమనీ, తెలుస్తుంది. శారీరకమయిన, భౌతికమయిన సహాయాలు అవసరాలు ఆ విజ్ఞానాన్ని అనుసరిస్తాయి.

పాశ్చాత్య దేశస్తులు పరిశుభ్రతను, ఆరోగ్య సూత్రాలను, గట్టిగా కాంక్షిస్తారు. ప్రాచ్య దేశాల మహర్షులు సౌందర్యాన్ని ప్రేమించారు. కాని అన్నిటికంటె మహోన్నతమయిన ''ఆధ్యాత్మికత'' అసలీ ప్రపంచాన్నే వహించలేకపోయింది.

పాశ్చాత్య మతాశ్రమ వాసులు ఒక క్రమమయిన పద్ధతిని విధానాన్ని ప్రోత్సహిస్తూంటే, ప్రాచ్యసన్యాసాశ్రమం కాషాయ వస్త్రాలకు మాత్రమే

పరిమితమయి పోయింది. అక్కడ బీదరికము కూడ, అసంబద్ధమయిన సంగతి మాత్రము కాదు.

మానవసేవ కొరకు, అవసరమయితే మాధవ సేవ కొరకు అన్ని బంధాలను త్రెంచుకొన్న మహనీయుల ఉదాహరణలు ప్రాచ్య సన్యాసాశ్రమంలో ఎన్నో ఉన్నాయి.

స్వామి వివేకానంద ఎప్పుడూ అవ్యక్తంగా తామరాకుపై నీటి బొట్టులా ఉండేవారు కాదు. కొన్ని కొన్ని సమయాల్లో తన గురువయిన రామకృష్ణ పరమహంస గురించి ఆయన సహధర్మచారిణి గురించి ఆమె తన భర్త కిచ్చిన స్వేచ్ఛ గురించి స్వామి చెబుతూ ఉండేవారు.

మనదేశంలో స్త్రీ విద్యకు స్వామివద్ద కొన్ని ప్రణాళికలు ఉన్నాయి. ఆ విభాగంలో మార్గరెట్ తనకు సహాయపడగలదని స్వామి తరుచు చెప్పేవారు. ఆ పిలుపును తన జీవితాన్ని నూతనంగా రూపకల్పన చెయ్యటానికి స్వామి ఇచ్చిన ప్రథమ సూచనగా ఆమె గ్రహించింది. లండన్ నగరాన్ని ఇంకా అందంగా చేయటం గూర్చి మార్గరెట్ స్వామితో మాట్లాడింది. లండన్‌ని అందంగా చేయటానికి ఇతర దేశాల నగరాలు ఎంత ధనాన్ని కోల్పోతున్నాయో స్వామి ఆమెకు జ్ఞాపకం చేశారు. ఆ సంభాషణ వలన ఇతరుల దృక్పథం నుంచి ఒక సమస్యను ఆలోచించటం గురించి మార్గరెట్ పూర్తిగా అవగాహన చేసుకొంది.

మార్గరేట్ తనకు సహాయ భూతురాలుగా ఉండకోరుతోందని తెలియగానే స్వామి ఇలా అన్నారు. ప్రజలకు సేవ చెయ్యటానికి తాను అంకితమయినాననీ తనకు చేదోడు వాదోడుగా ఉండేందుకు ఎవ్వరయినా ముందుకు వస్తే, వారికి పూర్తి సహకారము అందించగలమని స్వామి చెప్పుతూ ఉండేవారు. ఆయన దృష్టిలో శిష్యులందరూ సమానమే. వారు ఎవరయినా కానివ్వండి, భారతీయులయినా, పరదేశీయులయినా అందరూ సమానమే!

తన్కై నిర్దేశింపబడిన చారిత్ర్యాత్మక కర్తవ్య నిర్వహణలో స్వామి చాలా నిబ్బరమయిన సంసిద్ధతతో ఉన్నట్లు, ఆసయంలో కనిపించేవారు. ఇంక మార్గరెట్ విషయం చెప్పాలంటే అప్పటికే ఆమెలో ఆధ్యాత్మిక శిష్యరికం ప్రారంభమయింది. అభివృద్ధి చెందటం కూడ మొదలు అయింది. చేరుకోవలసిన గమ్యం కూడా నిర్దేశింపబడింది. కాని కార్యరంగంలోకి నిమగ్న మవటానికి ఆమెకు సమయం ఇంకా ఆసన్నమవలేదు.

స్వామి వివేకానంద బారతదేశానికి తిరిగి వచ్చాక మార్గరేట్ మిస్టర్ స్టర్డీలు లండన్ లోని వేదాంత కేంద్రం యొక్క బరువు బాధ్యతలను స్వీకరించారు. ఈలోపల భారతీయ సంస్కృతిని గురించి విదేశాలలోని అభిమానులతో

చర్చించటానికి స్వామి అబేధానందను స్వామిజీ లండన్ పంపారు. భారత దేశంలో వివేకానంద స్వామి ఆగమన వార్త హార్దికమైన స్వాగతంగా ఆనందమయ మయిన అంశంగా స్వీకరించ బడింది. రామకృష్ణుని అనుయాయుల కార్యకలాపాలకు పునర్ రూపకల్పన కల్పించే బృహత్కార్యాన్ని స్వామి చేపట్టారు. రామకృష్ణుని శిష్యులయిన ఆరుగురు యూరోపియన్ దేశస్తులను తనతోపాటు స్వదేశానికి తీసుక వచ్చారు. తోటి సన్యాసులకు స్వామి వారిని పరిచయం చేశారు. ఆ విధంగా ఆయన హిందూ మత సనాతన ఆచార పరాయణత్వపు సంప్రదాయాన్ని అధిగమించారు.

కులతత్వ భూయిష్టమయిన, మూఢాచారాల రుగ్మతతో బాధపడు తున్న భారతీయ సమాజాన్ని ఒక శక్తివంతమయిన ఐక్య సంఘటనగా పొందుపరచటం ఆయన అంతిమ ఆశయం. ఆ ఉద్దేశంతోనే తన సహచరులతో ఒక మఠం వ్యవస్థీకరించారు. అది చాలా కొద్దిపాటి ప్రారంభ ప్రయత్నమే అయినా, సరైన ఆర్థిక వనరులు లేకపోవటం వల్ల ఆ పనికి ప్రతి బంధకాలు ఏర్పడ్డాయి. స్టర్డీ మహాశయుడు ఆ మఠానికి విరాళాలు పంపాడు.

ఇక్కడ మఠానికి, అక్కడ పాశ్చాత్య దేశాల్లోని హిందూమత సానుభూతి పరులకు అనుసంధానం చేసి ఆర్థిక వనరులేర్పరచటంలో మార్గరేట్ కృషి చేసింది. రామకృష్ణ మఠం యొక్క కార్యకలాపాలను సామాన్య ప్రజల శ్రేయస్సు కొరకు వినియోగ పరచటమే రామకృష్ణ సమితిని స్థాపించటంలో స్వామి ముఖ్యోద్దేశము. స్వీయ మతాభివృద్ధి. ఏకాంతవాసము, ఆధ్యాత్మిక ప్రస్థానము, మొదలయిన విషయాలతో తలమునకలయిన భారతీయ సన్యాసులకు, సామాన్య ప్రజల శ్రేయస్సుని కాంక్షించాలనే సునిశితమయిన అంకిత భావాన్ని వారిలో ఏర్పరచటం, ఆ మార్పుని వారిలో తేవటం స్వామిజీకి అంత తేలికయిన పనిగా మాత్రం కనిపించలేదు.

రామకృష్ణ సమితిలోని సన్యాసులకు, సన్యాసులుగాని సాధారణ అనుయాయులకు మధ్య నిర్మాణాత్మకమయిన ప్రభావ పూరితమయిన ఒక అవినాబావ సంబంధమేర్పరచాలని స్వామి వాంఛించారు. ఆ అనుయాయులు సమితి యొక్క ప్రజాహిత కార్యక్రమాల్ని నిర్వహిస్తారు.

ఈ విషయాలను గూర్చి స్వామి మార్గరెట్‌తో నిరంతరం ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూ ఉండేవారు. రామకృష్ణ మఠం యొక్క కార్యకలాపాల వివరాలు, నివేదికలు మార్గరేట్‌కి తెలుస్తూ ఉండేవి. ఎప్పటికయినా ఒక రోజుకి రామకృష్ణ మఠం వారు స్త్రీల పాఠశాలను నెలకొల్ప గలుగుతారని మార్గరేట్ కలలు కన్నది. లండన్‌లో ఉంటూనే, బీద భారత దేశానికి సేవ చేయమని 1897

జూలై 23న వ్రాసిన ఉత్తరంలో స్వామి ఆమెకు తెలియ జేశారు. భారతదేశానికి రావాలనే ఆలోచన ఫలించే అవకాశం ఆమెకు రాలేదు.

సేవా నిరతి ద్వారా ఆత్మ సంతృప్తి పొందటానికి బారత దేశానికి రావాలని ఉందనీ, మార్గరేట్ స్వామికి ఉత్తరం రాసింది. అప్పటి వరకు విరాళాలు ఇవ్వటం మాత్రమే నిర్వహిస్తున్న మార్గరేట్‌లోని మార్పు... అంటే సత్యాన్వేషణ చేయాలనే ఆమె కోర్కెను, ఆమె ఉత్తరంలో సూచన ప్రాయంగా స్వామి గ్రహించారు. ఆలేఖను స్వామి ఆమోదించి ఆమె భారతదేశానికి అవశ్యం రావచ్చునని స్వాగతం చెప్పారు. ఆమె తనలోని అహంకారాన్ని పూర్తిగా త్యజించి వేసింది. కాబట్టి ఆమె భారతదేశం రావటానికి అది సరి అయిన తరుణమే.

మూఢ నమ్మకాల మధ్య, పేదరికం మధ్య దాస్య భావం ప్రదర్శించే ప్రజల మధ్య, తనకు విదేశీయము, అననుకూలమయిన, విలక్షణమయిన, పరిసరాల్లో ఆమె ఉండవలసి వస్తుందని స్వామి అతి తీవ్రంగా తన జవాబులో హెచ్చరించారు. అంతేకాదు వాతావరణం కూడా అనుకూలమయినదికాదు. ఎండ, వాన, చలి అన్నీ విపరీతంగా ఎక్కువగా ఉంటాయి. ఒక తిరుగు లేని నిర్ణయం తీసుకొనే ముందు బాగా తీవ్రంగా ఆలోచించ వలసిందని స్వామి ఆమెకు నచ్చ చెప్పారు. కాని ఆమె నిర్ణయం తీసుకొంటే స్వామి సహాయ సహకారాలు ఆమెకి పూర్తిగా ఉంటాయి.

వ్యక్తిగత విచక్షణ బట్టి కాక, కేవలం ప్రేమద్వారానే జీవించిన ఆదర్శవంతమయిన మార్గ దర్శకుల ఆశయాలను గూర్చి తరువాత ఉత్తరంలో స్వామి మార్గరేట్‌కి వివరించారు. ఆ ఉత్తరాల సారాంశాన్ని, మార్గరెట్ పూర్తిగా అవగాహన పరచుకుని మననం చేసుకొంది. తన భవిష్యత్ కార్య నిర్వాహణ మార్గాన్ని నిశ్చయించుకొంది.

తన ప్రయాణం గురించి తల్లికి ఎరుకపరచటం క్లిష్ట తరమయిన విషయమే. కానీ అప్పటికే మార్గరెట్ ఊహలను తల్లి అవగతం చేసుకొని ప్రార్ధనా పూర్వకంగా శుభాశీస్సులను అందించింది. ప్రయాణ సన్నాహాల కొరకు కొన్ని నెలలు వ్యవధి కావాలి. చెల్లెలు మేరికి రస్కిన్ స్కూలు బాధ్యతలను అప్పగించింది. స్నేహితులు నీల్‌హామ్మాండ్, ఆక్టేవియస్ బెట్టీల వద్ద వీడ్కోలు తీసుకొంది. ఒకరోజు వర్షం కురుస్తుండగా ఆమె ఓడ ప్రయాణం ప్రారంభమయింది. తల్లి సోదరి సోదరుడు, ఆక్టేవియస్ బెట్టి, ఎబ్‌జనార్‌కుక్ వీడ్కోలు చెప్పారు. ప్రాప్తమున్న చోటికే పడవ సాగి పోయింది. భారతదేశపు పిలుపు అందుకోమని విధి ఆమెనుహెచ్చరిస్తూన్నట్లనిపించింది.

# 3

# గురు సన్నిధిలో

వివేకానందస్వామి శిష్యుడు, ఆయన కార్యదర్శి మిస్టర్ గుడ్‌విన్ మద్రాసులో మార్గరేట్ నోబుల్‌కి స్వాగతంపలికాడు. 1898 జనవరి 18 న కలకత్తాలో ఆమెకు ఉత్సాహంగా స్వాగతం చెప్పిన వారిలో స్వామిజీ కూడ ఉన్నారు. రామకృష్ణ సమితి సభ్యులయిన కొందరు మిత్రులతో పాటు, ఆమె పార్క్‌స్ట్రీట్‌లో ఒక ఇంట్లో ఉండేది. మార్గరెట్ వచ్చిన మర్నాడే ఆమెకు బెంగాలీ నేర్పటానికి గాను స్వామి ఒక సాధువును పంపారు.

బేలూరులో ఒక దేవాలయాన్ని నిర్మించటానికి మఠాన్ని స్థాపించటానికి శ్రీమతి సారాబుల్, కుమారి మాక్‌లియడ్‌లు అమెరికానుంచి వచ్చారు. వారు కూడా స్వామికి సన్నిహితులు. బేలూర్‌లో మఠం కొరకు స్థలం కొనటం కూడ జరిగిపోయింది. దాని కయ్యేఖర్చు వారే భరిస్తామని చెప్పారు. వారు ఇద్దరు ఒక పాత ఇంటిలోకి నివాసం మార్చుకొన్నారు. మార్గరెట్ వచ్చిందని స్వామి ద్వారా తెలుసుకొని ఆమెని తమతో కలిసి ఉండమన్నారు. దృఢసంకల్పంతో స్థిరనిశ్చయంతో భారతదేశపరిసరాలకు అనుగుణంగా అలవాటు పడుతున్న మార్గరెట్ వారితో కలిసి నివసించటానికి అంగీకరించింది. స్వామి తరుచుగా అక్కడికే వచ్చి వారితో సంభాషిస్తూ ఉండేవారు.

అప్పట్లో స్వామి స్వయంగా రెండు ముఖ్యకార్యక్రమాల్ని ఎన్నుకొన్నారు. సమాజసేవకొరకు ఎక్కువ సంఖ్యలో బ్రహ్మచారులను తయారు చేయటం, ఇది మొదటిది చాలా ముఖ్యమయినది. ఎందుకంటే మాములుగా సన్యాసాశ్రమం అన్నప్రక్రియలో వారు నిరాడంబర యతీ జీవితం గడుపుతూ, అన్వేషణా మార్గంలో ఒకరై, ఎక్కువగా వ్యక్తి గతమయిన విమోచనకు పాటు పడతారు. కాని సమితి బ్రహ్మచారులు యత్యాశ్రమము తీసుకొని ప్రజాహిత కార్యక్రమాల్లో కూడ పాల్గొంటారు. రెండవది, రామకృష్ణ సమితి నుంచి జాతి కులం అనేఅడ్డు గోడల్ని నిర్మూలించటం. దురాచారభూయిష్టమయిన కఠినమైన సనాతన ఆచారాలని ఎదుర్కొనటానికి, ఈ రెండూ అవసరమని స్వామి భావించారు. బేలూరులో శ్రీరామకృష్ణుని జయంతి ప్రారంభించారు. ఆరోజు

జరిగిన ఉత్సవంలో అన్ని వర్గాలవారు అన్ని కులాలవారు పాల్గొన్నారు. ఒక నెల రోజుల తరువాత మార్గరెట్ నోబుల్‌కు స్వామి బ్రహ్మచర్యాదీక్షను ఇచ్చి విదేశీయులకు కూడ రామకృష్ణ సమితిలో ఉపదేశ దీక్షపొందే అవకాశం కల్పించారు. మార్గరెట్‌కు నివేదిత అని పునః నామకరణం చేశారు.

ఏమయినప్పటికి వ్యక్తిగత దృక్పథం నుంచి చూస్తే సంఘర్షణ శ్రమ లేకుండా, లక్ష్యప్రాప్తి, పరిపూర్ణత సిద్ధించవు. తన వ్యక్తిత్వాన్ని త్యాగం చెయ్యకుండా హైందవ జీవన విధానాన్ని ఆకళింపు చేసుకోమని స్వామి నివేదితకు గట్టిగా చెప్పారు. అది ఏమంత తేలికగా చెయ్యగలిగిన పనిగా ఆమెకు తోచలేదు. మార్గరెట్ రావటం లోని ముఖ్య ఉద్దేశం, స్త్రీవిద్యాభివృద్ధి కోసం పాటుపడటము. నిజానికి స్వామి ఆమెను అదే పనికే నిర్దేశించారు. ఆకార్యకలాపాలను ఆమెకు అప్పగించటానికి స్వామి ఎంతో వ్యవధిని తీసుకొన్నారు. అందువల్ల మార్గరెట్ తన ఓర్పును కోల్పోవటం ప్రారంభించింది. యదార్థానికి ఆమెను ఒంటరిగా వదలివేయటంలో స్వామి ఉద్దేశం సరి అయినదే. ఆత్మాంకిత దృష్టితో కార్యరంగానికి సంసిద్ధం కావటం అన్న భారతీయ ఆశయానికి అనుగుణంగా, ఆమె క్రమక్రమంగా మార్పు చెందటానికి ఆ అవకాశం కల్పించారు. విభ్రమం కలుగజేసే పారవశ్య తత్పరతతో పాటుగ మార్గరెట్-నివేదిత గా పరిణామం చెందుతున్న తరుణం లో, స్త్రీవిద్యాభివృద్ధి కార్యక్రమాన్ని ఆమె చేపట్టాల్సిన ఘడియ వచ్చిందని స్వామి సూచించారు. నివేదితను బెంగాలీ యువతి అని పొరబాటు పడ్డ ఒకకార్యకర్తకు, నాలుగు రోజుల తర్వాత స్వామి సన్యాసం ఇచ్చారు. ఆయనకు స్వరూపానందస్వామి అని నామకరణం చేశారు. మానవుల బాధలను అధిక సానుభూతితో చూడటం తనకు అలవడటానికి స్వరూపానంద జీవితం తన మనస్సు మీద వేసిన ముద్రయేనని నివేదిత వ్రాసుకొంది. నివేదిత మౌనధ్యానాన్ని స్వరూపానంద వద్ద నుంచే నేర్చుకొంది.

స్వామి వివేకానంద దృష్టిలో నివేదిత ఎట్లా ఉండాలని ఊహించారో ఆ విధంగా తనని తాను మలచుకోవటంలో ఆమె కృతకృత్యురాలు కాలేదు. స్వామి అడిగిన ఒక ప్రశ్నకు సమాధానంగా నివేదిత ''నేను బ్రిటిష్ దేశస్థురాలను'' అని చెప్పింది. దాని వల్ల ఆమె ఈ దేశంతో ఇంకా ఐక్యత పొందలేదనీ, అటు వంటి తాదాత్మ్యత ఇంకా ఆమెలో రాలేదనీ స్వామి తెలుసుకున్నారు. అయినప్పటికి కావలిసినంత పరిపూర్ణతను ఆమె చేరు కోగలిగింది. బేలూరిలో రామకృష్ణ మఠం ప్రారంభించిన సందర్భంలో, కలకత్తాలోని స్టార్ థియేటర్‌లో ఒక మహాసభ జరిగింది. ఆ సభలో

ప్రసంగించమని నివేదితను స్వామి ఆదేశించారు. భారతీయ సాంస్కృతిక వారసత్వపు అర్థతత్వాన్ని లోతుగా అవగాహన చేసుకున్నట్లు బాగా కనిపించిన ఆమె ప్రసంగం అందరి ప్రశంసలు అందుకొన్నది. భారతదేశ అభివృద్ధిని గురించి, పాశ్చాత్య శాస్త్ర విజ్ఞానం మన దేశంలోని ప్రజల మంచికి ఉపయోగించటం గురించి మన విధానాలను ప్రపంచానికి తెలియపరచటం గురించి స్వామి ఆ సభలో మాట్లాడారు. ఆ విధంగా నివేదిత భాదతీయులకు పరిచయం చేయబడింది.

రామకృష్ణుని సహధర్మచారిణి శారదాదేవిని కలుసుకోవటం నివేదిత జీవితంలో మరో మైలురాయి. ఆమె మొదట శారదాదేవిని దర్శించినపుడు శ్రీమతి బుల్, కుమారి మెక్‌లియడ్ కూడ ప్రక్కనే ఉన్నారు. ఆ రోజుల్లో విదేశీయులు శారదామాతను కలిసి కోవటమే ఒక అపురూపమయిన అసాధారణ సంఘటన. కాని మాత వారిని దయతో ఆహ్వానించింది. గొపాలారమా, రామకృష్ణుని సహోద్యాయి, రామకృష్ణ కూడా ఆమెను మాతా అనే పిలిచేవారు. ఆమె, శ్రీమతి బుల్ కుమారి మెక్‌లియడ్‌లతో కలసి బేలూర్ వెళ్ళింది. ఆ విధంగా నివేదిత హైందవ సమాజంలో రామకృష్ణ సోదర వర్గంలో చోటు చేసుకొంది.

కాని ఆమెలో ఆత్మ సంయమనం ఇంకా జరగవలసి ఉంది. స్వామి వివేకానందతో కలిసి అమర్‌నాథ్ యాత్ర చేసేటప్పుడు ఆ ఆత్మసంయమనం ఆమెలో జరిగింది. ''ది మాస్టర్ యాజ్ ఐ సా హిమ్'' గ్రంథంలో ఆనంద భరితమయిన అనుభూతులను స్వామి సహచర్యాన్ని ఆమె వర్ణించింది. అవి తన్పై ఒక నిర్ణయాత్మకమయిన ముద్రను వేశాయని పేర్కొంది. ఆ తీర్థయాత్రా బృందం నైనితాల్‌లో కొద్ది రోజులాగి ఆల్మోరా చేరారు. వారు అక్కడ సేవియర్స్ దంపతుల వద్ద ఆతిథ్యం పొందారు. స్వామి వివేకానంద, స్వామి తురీయానంద, నిరంజనానంద, సదానంద, స్వరూపానంద, శ్రీమతి బుల్, కువారి మెక్‌లియడ్, శ్రీమతి పాటర్‌సన్,(అమెరికన్ దౌత్య ఉద్యోగి భార్య) నివేదిత వీరందరు ఆ బృందంలో ఉన్నారు. భారతీయ జీవన స్రవంతితో సంపూర్ణ సంలీనం చెందటానికి తను ఇంకా చాలా దూరంలో ఉందనే భావన ఆమెకు అధికమయిన మానసిక ఒత్తిడిని ఇచ్చిన సమయం అది.

నిజానికి ఆమెకు కలిగిన మనోవేదన ఎంత బృహద్రూపంలో ఉందంటే, శ్రీమతి బుల్ కల్పించుకొని ఆమెకు ధైర్యం చెప్పవలసి వచ్చింది. విశ్రాంతి కోసం కొన్నాళ్ళు యాత్రను విరమించాలని స్వామి అభిప్రాయం ప్రకటించారు. ఆ ప్రకటనతో స్వామి ఇష్టానుసారంగా నివేదిత కొంత వరకు రాజీపడింది.

స్వామీజీ ప్రశాంత వాతావరణంలోకి వెళ్ళిపోయారు. అయితే అమరనాథయాత్ర ఆమె హైందవజీవనసరళికి అనుగుణంగా మలచబడటానికి తోడ్పడింది. శివతత్వం నుంచి మాతృత్వతత్వం లోకి స్వామి పరివర్తన చెందటం ఆమె దర్శించింది. ఆ దివ్యమాత యిష్టానుసారమే అన్నీ జరుగుతున్నాయని ఆయన పూర్తిగా నమ్మారు. ఆత్మత్యాగంలో స్వామి పరిపూర్ణత్వాన్ని ,పొందగలిగారు. తనకు తానుగా ఏమీ చేయగల శక్తి లేదనీ, విశ్వాత్మతో తనకు తాను సంపూర్ణసమైక్యం పొందటానికి, అతీంద్రియ జ్ఞానాన్ని సంపాదిస్తున్నట్లు స్వామి వివరించారు. వీటి ప్రభావము నివేదిత మీద ప్రగాఢంగా ఉంది.

కాశ్మీర్‌లో జరిగిన ఒక సంఘటన ఆమెలో ఒక బాధాకరమయిన అనుభవంగా నిలిచి పోయింది. మఠం సంస్కృత కళాశాల నిర్మాణానికి కొంత స్థలాన్ని కాశ్మీర్ మహారాజా స్వామికి కానుకగా యివ్వదలిచారు. కానీ అక్కడ ఉన్న స్థానిక బ్రిటీష్ అధికారి (రెసిడెంట్)దానికి అంగీకరించ లేదు. ఈ సంఘటనతో బ్రిటీష్‌వారు భారతదేశాన్ని ఎంత చులకనగా చూస్తున్నారో నివేదితకు అవగతము అయింది.

1898 నవంబరు ఒకటిన నివేదిత కలకత్తా, తిరిగి వెళ్ళింది. స్వామి ఆమెకంటె ముందుగానే అక్కడకు చేరుకొన్నారు. నివేదిత హిందూ ఆచారాల్నీ సంప్రదాయాల్నీ అలవరుచు కొని ఆచరణలో పెట్టటం మొదలు పెట్టింది. మాత శారదామణి అంగీకారము కూడ ఆమెకు ఉంది. నివేదిత పట్ల మాత ఎల్లపుడు చాలా దయాపూరిత భావంతో ఉండేది. అమాతతో పాటు నివసించే సనాతన స్త్రీ జనం, భర్తృ విహీనలు వీరంతా కూడ నివేదితకు తమ ఒప్పందాలను తెలియ జేశారు. తను కోరుకున్న పని చెయ్యటానికి అదే సరి అయిన సమయం. స్వామి ప్రేరణకు లోబడి ఆమె, తన పరిసరాల లోని ప్రజల అలవాట్లను. మానసిక విధానాలను అవగతం చేసుకొవటం ప్రారంభించింది. ఆ పరిశీలన ఆమె ప్రారంభించబోయే విద్యా విధాన కార్యక్రమానికి ఎంతో అవసరమయింది.

బాగ్‌బజారులో బలరామ్ బోసు ఇంట్లో, పాఠశాల స్థాపనకు చేయవలసిన ప్రాథమిక కృషి గురించి సమావేశాలు జరిగాయి. స్కూలుకు విద్యార్థులను ప్రోగు చేయటంలో స్వామియే స్వయంగా సహాయపడ్డారు. నవంబర్ 13వ తేది ఆదివారం ఖోసేపారా వీధిలో 16వ నవంబరు ఇంట్లో మాత చేతులు మీదుగా పాఠశాల తెరువబడింది. చుట్టుప్రక్కల వున్న కొద్దిమంది బాలికలు నివేదితకు శిష్యులయారు. ఆ బాలికల తల్లిదండ్రులతో కొద్ది కాలంలోనే నివేదితకు నిర్మలమయిన ప్రేమవాత్సల్య బంధాలు పెనవేసుకు పోయాయి. చిత్రలేఖనం, మట్టితో బొమ్మలు చేయటం, కుట్టుపని కూడా సిస్టర్ నివేదిత పాఠ్యాంశాలుగా

ప్రవేశపెట్టింది. నివేదిత, పాఠశాల పనిని తన దినచర్య కార్య కార్యక్రమాలో ముఖ్య భాగంగా చేసుకొన్న సమయమది. ఆమె కార్యకలాపాలను బహు ముఖంగా విస్తృతపరచమని మఠం వారు కోరారు.

డిశంబరు 9వ తేదీన బేలూర్‌లో స్థాపించిన మఠంలో రామకృష్ణుని చిత్రపటం ఆవిష్కరించబడింది. అక్కడ మఠం సక్రమమయిన పద్ధతిలో పని చేయటం ప్రారంభించింది.

అక్కడి బ్రహ్మచారులకి కొత్తగా చేరిన వారికి, నివేదిత పాఠాలు చేప్పేది. వృక్షశాస్త్రం, చిత్రలేఖనం, కుట్టుపని, శారీరకశాస్త్రం నేర్పటం ఆమెకు అభిమాన విషయాలు. వారం వారం మఠంలో జరిగే సభల్లో ఆమె ప్రసంగించేది. బ్రహ్మో సమాజంలో విద్యాబోధనా విధానాల గురించి ఉపన్యాసాలిచ్చింది. ఉపాధ్యాయ శిక్షణా తరగతులను కూడ ప్రారంభించింది. పేరు ప్రఖ్యాతులు కల మహిళలెందరో ఆ తరగతులకు హాజరు అయ్యేవారు. అంతేకాక, ఒక అమెరికను మిషన్ స్కూలులో కూడ ఆమె పాఠాలు చెప్పేది.

1899 ఫిబ్రవరి 13న ఆల్బర్ట్ హాలులో ''కాళీమాత'' పై నివేదిత చేసిన ఉపన్యాసం వివాదాస్పదంగా తయారయింది. నివేదిత ప్రసంగం మధ్యలో ఆమె జ్ఞాన సంపదను శంకిస్తూ, డాక్టర్ మహేంద్ర లాల్ సర్కార్ అనే పండితుడు ఆమెను ప్రశ్నించాడు. శాక్తేయం గురించి మాట్లాడటానికి ఆమెకు అధికారం లేదని; ఆయన సవాల్ చేశారు. ముందు మూఢ నమ్మకాలను తొలగించటం అవసరం అని ఆయన గట్టిగా చెప్పారు. మరో శ్రోత సర్కార్‌కు తీవ్రంగా సమాధానం చెప్పాడు. గందర గోళం తొక్కిసలాట జరిగింది. అయినా, కాళీఘాట్ గుడిలో కాళీమాతను గురించి మాట్లాడటానికి నివేదితనే ఆహ్వానించారు. అక్కడ ప్రసంగించే ముందు ''యంగ్ ఇండియా'' ఉద్యమం గురించి మినర్వా థియేటర్‌లో ఆమె చేసిన ఉపన్యాసం చాలా ఉత్తేజకరంగా ఉంది. స్వామి వివేకానంద ఇతర సన్యాసులు ఆ సభకు హాజరు అయారు.

కాళీఘాట్ గుడిలో నివేదిత చేసిన ప్రసంగం, కాళీపూజ యొక్క ప్రాముఖ్యత గురించి, అతి సరళమైన వివరణ అని చెప్పవచ్చు. ఆల్బర్ట్ హాలులో తనని అడిగిన ప్రశ్నలన్నింటికిని ఆమె తగిన సమాధానాలను ఈసభలో చెప్పింది. కాళీమాతను తల్లిగా సృష్టికర్తగా, వినాశకారిగా, విలయరూపిణిగా, విశదీకరించింది. నివేదిత వ్రాసిన ''కాళీ ది మదర్'' గ్రంథానికి ఈ ఉపన్యాసాలే ప్రాతిపదికలు అయ్యాయి. కాని ఆమె అటువంటి కార్యకలాపాలతో సంతృప్తి చెందలేదు.

1899లో ప్లేగు వ్యాధి విజృంభించినప్పుడు బాధా శాపగ్రస్తులను ఉద్ధరించటం ఆమె ఒక పనిగా పెట్టుకొంది. నివేదిత సేవలను సమకాలికులందరు మెచ్చుకొన్నారు. కలకత్తాలో ఆర్.జి. కార్ వైద్యకళాశాలను స్థాపించిన డాక్టర్ కార్ ఆమె సేవలను ఎంతగానో కొనియాడాడు. ప్లేగు బాధితులకు ఆమె చేసిన సేవ ధైర్యసాహసాలతో కూడినది, నిస్స్వార్థమయినది. ఆ ప్రశంసలు వృద్ధి చెందుతున్న ఆమె మానసిక దృఢత్వాన్ని మరింత బలపరచాయి.

ఈలోగా స్వామి మార్గదర్శకత్వంలో భారతీయ ఆశయాలకు తగ్గట్టుగానే మరింత మహోన్నతంగా ఆమె రూపొందింపబడుతోంది, ప్రతిభావంతమయిన మఠాశ్రమవర్గము అనే స్వామి ఆశ్రమము ఆమెను బాగా ప్రభావితము చేసింది. తనను పూర్తిగా సేవకు పునరంకితం చేసుకోవాలన్న ఆకాంక్షను ఆమె వ్యక్తపరిచింది. మార్చి 25న నివేదిత నైష్ఠిక బ్రహ్మచారిణిగా- అంటే సనాతనమయిన సన్యాసాశ్రమ విధానంలో నిజమయిన బ్రహ్మచారిణిగా నియమితురాలయింది.

అన్ని తరగతుల ప్రజలతోను నివేదిత కలసిమెలసి ఉండేది. స్వామిజీ ఆమెకు పూర్తిస్వేచ్ఛను ప్రసాదించారు. అయితే హిందూమత సంప్రదాయాన్ని అవలంబించమని ఆమెను కోరారు. విదేశీయులను గురించి నివేదిత హైందవ సమాజంలో చేరటం గురించి ప్రజలలో ఉన్న దురభిప్రాయపు పరిధులను తొలగించటానికి స్వామి చురుకైన కొన్ని చర్యలను కూడ ప్రారంభించారు. నివేదితతో కలసి సహ పంక్తిన భోజనం చేయటం వాటిలో ఒకటి. సన్యాసులు నివేదిత చేతి మీదుగా భోజనం, తేనీరు తీసికొనేటట్లు స్వామి ఏర్పాటుచేశారు.

హిందూ సమాజంలో సంయమనం చెందటానికి మాత శారదామణి కూడ తనకు సహాయపడిందని నివేదిత స్వయంగా రాసుకొంది. సంపూర్ణమయిన సన్యాసినిగా మారాలనే తన కోరికను స్వామి అంగీకరించలేదు. అయితే ఆమె స్త్రీ విద్య కోసము చేసే కృషిని స్వామిజీ బహుదా ప్రశంసించారు. ఆర్థిక వనరులు లేక పోవటం వల్ల స్త్రీ విద్యాభివృద్ధి కార్యక్రమం కుంటు పడుతోంది. విద్యాభీష్టసిద్ధి పొందకుండానే విద్యార్థినులు వివాహం చేసుకొని వెళ్ళి పోవటం వల్ల పాఠశాల సుస్థిరతను పొంద లేక పోతోంది. మహిళా కార్యకర్తలు లేక పోవటం మరొక పెద్ద ఇబ్బంది. వితంతువుల్లోనే సేవాపరాయణులయిన మహిళాకార్యకర్తలు లభ్యమవుతారని ఆమె కనిపించింది. వారు నివసించటానికి శిక్షణ పొందటానికి మహిళా వసతి గృహాలు అవసరమవుతాయి. ఏది ఏమయినా ఆ పాఠశాల మూత పడటం నివేదితను చాలా వ్యాకుల పరచింది.

1898 జూన్ 20న స్వామి పాశ్చాత్యదేశాలు తిరిగి దర్శించటానికి నిర్ణయించుకొన్నారు. ఆయనతో పాటు తురీయానంద కూడ వెళ్ళవలసి ఉంది. అమెరికాలో ప్రసంగించటానికి నివేదిత అక్కడకు వెళ్ళటానికి నిశ్చయమయింది. ఆ ప్రసంగాల వల్ల కొంత ధనం సమకూడుతుంది. అమెరికాలోను యూరప్ లోను సమితులను ప్రారంభించి ఆ సభ్యులిచ్చే నెలసరి చందాలను సమితికి ఉపయోగకరంగా వ్యయం చేయవచ్చునని భావించారు. ప్రయాణం ముందు రోజున ప్రాతఃకాలము నివేదిత మాతతో గడిపింది. సాయంత్రం తన గౌరవార్థము బేలూరు మఠం వారు ఇచ్చిన విందులో పాల్గొంది. తరువాత దక్షిణేశ్వర్‌లోని దేవాలయానికి వెళ్ళి గంటల తరబడి ప్రార్థనలతోను మౌనం తోను గడిపింది. ఆమె ఇంటికి చేరుకొనేటప్పటికి కుండపోతగా వర్షం కురుస్తోంది. సందేహాలు, నిరాశలు తొలగి పోయిన తర్వాత ఆమెకిప్పుడు చాల మనశ్శాంతిగా ఉంది.

20వ తేదీ ఉదయం మాతా శారదామణిని, స్వామిని ఇతర సన్యాసులను తన యింటికి ఆహ్వానించింది. అదే రోజు సాయంత్రం స్వామి వివేకానంద, స్వామి తురీయానంద, సిస్టర్ నివేదిత, పశ్చిమ దేశాలకు వెళ్ళే ప్రయాణం ప్రారంభమయింది. వారికి వీడ్కోలు చెప్పిన అసంఖ్యాకుల్లో మాత కూడ ఉంది.

# 4

# ఆత్మావలోకనము

ఆ విదేశ యాత్ర విధి నిర్ణయము లాంటిది. ఈ ప్రపంచంలో తనదయిన ఒక ప్రత్యేక మార్గాన్ని ఏర్పరచుకోవటానికి నివేదితకు ఆ ప్రస్థానము ఎంతో ఉపకరించింది. ఆమె ఒక్క క్షణం కూడ వివేకానంద స్వామి మార్గదర్శకత్వాన్ని కాదనుకోలేదు. తనంతట తానే స్వయంసిద్ధగా మారమని స్వామి నివేదితకు చెప్పారు. ఆమె చేసే అన్వేషణలో తన ప్రమేయం ఎక్కువగా ఉండటం స్వామికి ఇష్టం లేదు. దానికి ముఖ్య కారణం ఆయన అనారోగ్యము. ప్రాపంచిక విషయాలపై ఆయనకు విముఖత ఏర్పడింది. కాళీమాత సాన్నిధ్యంలో ప్రశాంతత పొందటంలో స్వామి ఆసక్తి అధికం అయింది. స్వామిలో కలుగుతున్న ఈ మార్పుకు ఇష్టం లేక పోయింది. అయితే స్వామి విముఖతకు ఆమె అయిష్టత మరింత దోహదం చేసింది. ఏది ఏమయినప్పటికి లండన్ ప్రయాణంలో స్వామిజీ నివేదితపై ఎంతో శ్రద్ధాసక్తులను కనపరిచారు.

హిందూ మతంలోని నమ్మకాలను గురించి హిందూమత ప్రముఖుల జీవిత విశేషాల గురించి భారతీయులయిన ఇతర మహానుభావుల గురించి స్వామి నివేదితకు వివరంగా చెప్పారు. ఆ విధంగా హైందవ జీవన విధానంలోకి ఆమె ప్రవేశించటమే కాక హైందవ మత సంప్రదాయాలవల్ల ఉత్తేజితురాలయింది. ఆ భావాలు ఆ అలోచనలు తరువాత ఆమె రచనల్లో చోటుచేసుకొన్నాయి. స్వామి వివేకానంద సందేశాన్ని క్రియా రూపకంగా ప్రజలకు అందజేయటం తన గురుతరమయిన బాధ్యతగా ఆమె సంభావించింది. వారు, జూలై 31 నాటికి లండన్ చేరుకొన్నారు. కుమారి క్రిస్టినీ గ్రీన్ స్టైడేల్ శ్రీమతి ఫంకే అమెరికానుంచి వచ్చి స్వామికి స్వాగతం చెప్పారు. నివేదితకు సహాయం చేయటానికి క్రిస్టినీ భారతదేశానికి వచ్చింది. స్వామిజీ బృందం లండన్‌లో నివేదిత వసతి గృహంలోనే నివసించారు. నివేదిత కుటుంబ సభ్యులు స్వామిని వారి బృందాన్ని అధిక స్నేహ సృహృద్భావంతో ఆదరించారు. ముఖ్యంగా నివేదిత సోదరుడు స్వామిని ప్రత్యేకంగా అభిమానించాడు.

అయితే కొన్ని అసంతృప్తి కరమయిన విచారకరమయిన సంఘటనలు సంభవించాయి. స్వామికి అంతకు ముందు స్నేహితుడే అయిన స్టర్డీ, లండన్‌లోని మరికొంత మంది సమితి సభ్యులు స్వామిని బహిష్కరించారు. ఆగష్టు 16న బయలు దేరి స్వామి అమెరికా వెళ్ళిపోయారు. నివేదిత తన చెల్లెలి పెళ్ళికోసము ఆగిపోయింది. సెప్టెంబరులో స్వామిజీని అమెరికాలో కలుసుకొంది, లెగ్గెట్ దంపతుల ఆహ్వానాన్ని పురస్కరించుకొని స్వామిజీ రిడ్జిలీ మానర్‌లో ఉన్నారు. స్వామిజీ సహచరులకు ఆ ప్రదేశం ఎంతో ఆహ్లాదకరంగా ఉంది.

కార్యనిర్వహణ కొరకు ఆతృత పడుతున్న నివేదిత ఏకాంతాన్ని కోరుకుంది. కాషాయ అంగరభాను ధరించిన నివేదితను స్వామి దీవించారు. ''ప్రశాంతి'' అనే గేయాన్ని వ్రాసి ఆమెకు బహూకరించారు. ఏకాంతం కోసం నివేదిత వెనుకగా ఉన్న ఒకచిన్న ఇంటికి మారింది. ''కాళీ దిమదర్'' అన్న గ్రంథాన్ని అక్కడే పూర్తి చేసి వీరేశ్వరునకు అంకితమిచ్చింది.

ఆ సమయంలో స్వామి నివేదితకు నిష్కామకర్మ గురించి బోధించారు. ప్రతిఫలాపేక్ష లేకుండా నిస్వార్థంగా తనముందున్న కర్తవ్యాన్ని నిర్వర్తించటమే నిష్కామకర్మ. అది ఒక కఠినమైన ప్రక్రియ, స్వామిజీ నివేదితకు శివజ్ఞానం గురించి అత్యున్నత ఆత్మావగాహన కల శుక మహర్షి గురించి వివరించి చెప్పారు. నివేదిత చేయ వలసిన భవిష్యత్ కార్యము బహుకష్ట తరమయినది.

తను చెయ్యవలసిన క్రియా కలాపాలకి కావలసిన ధనము సమకూర్చుకోవాలి. భారతీయ స్త్రీత్వం గురించి అమెరికన్ ప్రజలకు ఎరుక పరచాలి. స్వామిజీ కొన్నేళ్ళ క్రితం చేసిన పనిని అంది పుచ్చుకొని ఇప్పుడు తాను చెయ్యాలి.

స్వామిజీ న్యూయార్క్ వెళ్ళారు. నివేదిత చికాగో వెళ్ళింది. అక్కడ ఆమె మొదటి పని ప్రాథమిక పాఠశాలలోని పిల్లలకు భారతదేశం గురించి బోధించటం. పురాణ కథల్లోని ధృవుడు, ప్రహ్లాదుడు, గోపాలుడు మొదలయిన వారి గురించి వారికి చెప్పింది. బాల క్రీస్తు గురించి కూడ మాట్లాడింది. వాళ్ళకు బాగా తెలిసిన బాల క్రీస్తు గురించి చెప్పి హైందవ పురాణాల్లో బాల దైవస్వరూపాలను గురించి కూడ చెప్పింది. భారతీయ నైసర్గిక స్వరూపం గురించి వారికి బోధించింది. భారత దేశపు ప్రాచీన కళలు, మున్నగు అంశాలపై వివిధ ప్రదేశాల్లో ప్రసంగించి ధనం పోగుచేయాలని ఆమె సంకల్పించింది. అదే సమయంలో స్వామి వివేకానంద చికాగో నగరానికి వచ్చారు. మిత్రుడయిన జార్జిహేలీ ఇంట్లో ఉన్నారు. నివేదిత ఎన్నుకొన్న ప్రసంగాంశాలకు ఆయన

సహాయపడ్డారు. నివేదిత ఉపన్యాసాలు చాలా విజయవంతమయాయి. ఏబదిడాలర్లు అక్కడ సమకూడాయి.

నివేదిత ఎన్నో సాధారణ చర్చల్లో పాల్గొన వలసి వచ్చింది. చాలా ప్రశ్నలకు జవాబులు చెప్పవలసి వచ్చేది. ఆ ప్రశ్నలు చాలవరకు వివాదాస్పదమయినవి. సంభాషణ పోట్లాటలకు దారితీసేదిగా ఉండేది. ఆమె చాలా సున్నితమయిన మనస్సు కలది కనుక ఈ పరిస్థితుల వల్ల తరుచు నిరుత్సాహపడేది. ఆమె మనస్సుకి పట్టేటట్టు ధైర్యము ఓరిమి నిచ్చేసలహాలను స్వామి ఆమెకు చెప్పేవారు. వ్యక్తి గతమయిన ఉదాహరణలు కూడ చెప్పేవారు. స్వామి స్వయంగా ఎన్నో విచారకరమయిన సంఘటనలు కష్టాలు ఎదుర్కొన వలసి వచ్చింది. తను చెయ్యవలసిన పని చాలాపెద్దది. కాని ఎక్కువ కాలం జీవించనేమో అనే భావం స్వామికి కలిగింది. అమెరికాలో మరికొన్ని వేదాంత కేంద్రాలను స్థాపించాలనే ఉద్దేశం, స్వదేశంలోని పనులకుధనం సమకూర్చుకోవటం వంటి ఆలోచనలు కార్యరూపం దాల్చలేదు.

నివేదితకు కూడ తన ముందున్న పని తేలికగా కనిపించలేదు. హైందవ జీవన విధానాన్ని ప్రచారం చేయుటానికి, సమితులను స్థాపించటం, భారతదేశంలోని పనులకు ధనం సమకూర్చుకోవటం తనకు కూడా అంత తేలికయిన పనులు కావు. కుమారి మేరీహేల్‌ను (జార్జిహేల్ కూతురు) డెట్రాయిట్‌లోని వేదాంత సమితికి కార్యదర్శిగా ఉండమని నివేదిత కోరింది. మిస్‌హేల్ ఆ కోరికను నిరాకరించటమే కాక తాను ఇదివరకు ఇస్తున్న సహకారాన్ని కూడా అందించటం మానివేసింది. ఇటువంటి అనుభవాలు నివేదితకు కొత్త పాఠాలు నేర్పాయి. బాధ్యతను తన భుజ స్కంధాలపై వేసుకొని, స్వయంగానే ముందుకు సాగాలని అనుకొంది. గురువయిన వివేకానంద స్వామి సందేశాన్ని అందించే దూతగా మాత్రమే తనను తాను అంచనా వేసుకోవటం అంత మంచిది కాదని భావించింది. ఆ సమయంలో కుమారి మేక్‌లియడ్ లేఖ నివేదితకు ఊరట కలిగించింది.

స్వయం శక్తిపై ఆధారపడమని, కాళీమాత నుంచి స్ఫూర్తిని ఉత్సాహాన్ని పొందమని మిస్ మేక్ లియడ్ వ్రాసింది. నివేదిత నిష్కామ కర్మ స్వార్థరహిత కార్యనిర్వహణము, యొక్క, పరమ సత్యాన్ని అవగాహన చేసుకొంది. స్వామి ఇలా అన్నారు ''మరణం మనగమ్యం కాదు... మన గమ్యం విజయం.''

ఆ ఆకళింపుతో దృఢనిశ్చయంతో నివేదిత కార్య నిర్వహణకు ఉపక్రమించింది. యానీ ఆర్బర్, జాక్సన్ నగరాలను దర్శించింది. అక్కడ

మహిళలు చందాలు కడతామని వాగ్దానం చేశారు. అయితే డెట్రాయిట్‌లో నివేదిత కొందరు మహిళలను ఎదుర్కొన వలసి వచ్చింది.

భారత దేశ జీవన విధానం గురించి, హిందూ మత సంప్రదాయాల గురించి వారు విమర్శనా పూర్వకంగా ప్రశ్నల వర్షం కురిపించారు. వాటికన్నింటికి నివేదిత సున్నితంగా జవాబులు ఇచ్చింది. హిందూ సంప్రదాయాలను గురించి సమర్థిస్తూ వాదించటం తన కర్తవ్యంగా భావించింది. ఒక్కొక్కప్పుడు ఆమె వాదనలు ఆధునిక దృక్పథంతో చాలా వింతగా కనిపించినా, ఆమె అందుకు విచారించలేదు. అట్లాంటి ఒక సందర్భంలో విడాకులకు ప్రత్యామ్నాయమయిన ప్రక్రియ బహుభార్యాత్వము అని వాదించింది.

యదార్థానికి ఇటువంటి కొన్ని సందర్భాల్లో తరుచుగా ఆమెకు కోపం రావటం, దానికి స్వామి ధైర్యం చెప్పి ఆమెకు ఊరట కలిగించటం కొనసాగుతూనే ఉంది. నివేదిత చికాగో తిరిగి వచ్చిన తర్వాత చాలా పాఠశాలలను సందర్శించింది. మిస్టర్ పార్కర్ స్థాపించిన ఉపాధ్యాయుల శిక్షణా కళాశాలకు ఒక హైందవ బాలికను పంపాలని నివేదిత సంకల్పించింది. ఆ బాలిక సంతోషిణికి వివాహం అవటం వల్ల ఆ ప్రయత్నం ఆగి పోయింది.

నివేదిత కాన్‌సాస్, మిన్నియాపొలిస్, బోస్టన్, కేంబ్రిడ్జి నగరాలను దర్శించింది. అక్కడ శ్రీమతి సారాబుల్‌తో కలిసి ఉండేది. అక్కడ భారత జాతీయ నాయకుడయిన బిపిన్ చంద్రపాల్‌ని కూడ కలుసుకొంది. ఆయన అమెరికా సందర్శించటానికి వచ్చారు. శ్రీమతి ఫ్రాన్సిస్ లెగ్గెటీ అధ్యక్షురాలుగా, శ్రీమతి సారాబుల్ గౌరవజాతీయ కార్యదర్శినిగా రామకృష్ణ సమితిని స్థాపించుటలో నివేదిత కృతకృత్యురాలయింది. నార్వేదేశపు ప్రఖ్యాత వయొలినీ విద్వాంసుడయిన ఓల్‌బులీ మరణంతో శ్రీమతి సారాభర్తృహీన అయింది. కుమారి క్రిస్టిన్ గ్రీన్ స్టైడిల్ నివేదితను స్వామి వివేకానందను లండన్‌లో కలుసుకుంది. ఆమె డెట్రాయిట్‌లోని రామకృష్ణ సమితికి కార్యదర్శిని అయింది. రామకృష్ణ బాలికా పాఠశాల ప్రణాళికను గురించి నివేదిత వ్రాసిన పుస్తకాన్ని డెట్రాయిట్ శాఖ వారే ప్రచురించారు. మిస్టర్ లెగ్గెటీ ఈ ప్రచురణకు సహాయం చేశారు. భారత దేశంలో జరగవలసిన స్త్రీ విద్యాభివృద్ధికి వేయిడాలర్లు విరాళము కూడ యిచ్చారు. స్త్రీ విద్యపై, ఆ పుస్తకం నివేదిత, మనస్సులోని చక్కని అభిప్రాయాల అభివర్ణన. ఆ అభిప్రాయాల ప్రకారం స్త్రీ విద్య భారతదేశంలో కార్యరూపం ధరిస్తే ఎలా ఉంటుందో వ్రాసింది. స్త్రీ విద్యా ప్రణాళికపై నివేదిత యిచ్చిన కొన్ని సమాధానాలను ఆ పుస్తకానికి అనుబంధంగా ప్రచురించారు.

ఆ సమయంలోనే నివేదిత ''కాళి ది మదర్'' అన్న గ్రంథం ప్రచురించే ప్రయత్నంలో ఉంది. పౌరాణిక చారిత్రాత్మిక పాత్రలను గూర్చి అమెరికన్ పాఠశాల ప్రసంగాలలో చెప్పిన విశేషాలను కూడా వ్రాసింది. ఆ సమయంలోనే స్వామిజీ కూడ కొన్ని వ్యాసాలు వ్రాశారు. ''ప్రాచ్య ప్రపంచానికి మనబాధ్యత'' అన్న అంశంపై మెస్సాచుసెట్స్‌లోని జమైకాలో నివేదిత ప్రసంగించింది. ప్రపంచ స్వేచ్ఛా మత సమితి వారు ఆ సభను నిర్వహించారు.

ప్రతిఘటన, విమర్శ ఆమెను వెంబడిస్తూనే ఉన్నాయి. కాని ఆమెకు స్వామిజీ ప్రోత్సాహము ఉంటూనే ఉంది. స్వామిజీతో పాటు నివేదిత న్యూయార్కు వెళ్ళింది. ఆయన ప్రసంగించిన సభలకు తాను కూడ హాజరు అయింది. ఆ ప్రసంగాలు విన్నప్పుడు ఆమెకు ఒక విధమయిన పురాతన మయిన ఆవేశము వచ్చింది. చాలా సంవత్సరాల క్రితం లండన్‌లో స్వామీజీ ప్రసంగాలు విన్నప్పుడు అటువంటి అనుభూతినే ఆమె పొందింది.

''హైందవ వనితల ఆదర్శాలు'' – ''భారత దేశ ప్రాచీన కళలు'' అన్న అంశాలపై నివేదిత ప్రసంగాలు అక్కడ వారిపై గొప్ప ప్రభావము చూపాయి. ప్రొఫెసర్ పాట్రిక్ గెడ్డెస్ బ్రిటన్ దేశపు సామాజిక శాస్త్రవేత్త– గొప్ప ఆలోచనా పరుడు. మత చరిత్రల సమావేశంలో వివిధ అంశాలను నిర్వహించటానికి ప్రొఫెసరు గెడ్డెస్ నివేదిత సహాయాన్ని అర్థించారు. పారిస్‌లో జరిగే ఒక సదస్సులో ఆ సభ ఒక భాగం. స్వామి వివేకానందుని కూడా అక్కడకు ఆహ్వానించారు.

చరిత్రలో సామాజిక విధానము అన్న అంశముపై ప్రొఫెసరు గెడ్డెస్ ప్రసంగం నివేదిత న్యూయార్కులో లోగడ వింది. మానవత యొక్క స్థానము, దాని ప్రభావము గూర్చి గెడ్డెస్ వర్ణించిన విధానము ఆమెకు ఎంతగానో నచ్చాయి. ప్రసంగాలలో నివేదిత లీనమై పోయిందని తెలుసుకొని గెడ్డెస్ ఆనందించారు. గెడ్డెస్‌కు నివేదిత వల్ల కావలసిన సహాయం యాంత్రికంగా చేసేదే కాని మేధస్సు ఉపయోగించి చేయవలసిన పనికాదు. అందువల్ల గెడ్డెస్ చేసే ప్రయత్నాల్లో తాను పాల్గొనటం అంత ఉపయోగకారి కాదని బావించి నివేదిత ఆయన అభ్యర్థనను అంగీకరించలేదు. కానీ వారివురికి ఒకరిపై ఒకరికున్న అభిమాన గౌరవాలు కొనసాగుతూనే ఉన్నాయి. ''ది వెబ్ ఆఫ్ ఇండియన్ లైఫ్'' అన్న గ్రంథం వ్రాయటానికి ప్రొఫెసర్ గెడ్డెస్ చేసిన సహాయానికి నివేదిత తన ధన్యవాదాలు తెలిపింది. ఆమె రచనా చాతుర్యాని ప్రొఫెసరు కొని యాడారు.

అదే సమయంలో డాక్టర్ జగదీశ చంద్రబోసు, శ్రీమతి అమలాబోసు పారిస్‌లో ఉన్నారు. వృక్ష జీవశాస్త్రం. పైతను చేసిన గొప్ప కృషికి గుర్తింపు

కొరకు బోసు సతమతమవుతున్నారు. బోసు చేసిన పరిశోధనలపై నివేదిత ఎక్కువ శ్రద్ధ చూపింది. ఆనాటి నుంచి వారిద్దరు అత్యంత సన్నిహితులయారు.

మత చరిత్రల సమావేశంలో స్వామి వివేదకానంద ఇచ్చిన ఉపన్యాసాలు చాలా విలువయినవే. కానీ ఆ సయంలో ఆయనలో చాలా అలసత్వము ఉదాసీనత కనిపించాయి. తను ఇంక ఎక్కువ కాలం జీవించనని అధికంగా పనిచేయలేనని మాతలో ఐక్యమై పోవాలని ఉందనీ, ఆయన నివేదితకు చెప్పారు. ఉత్సాహంతో ఉన్న నివేదితకు స్వామిజీ అన్న ఈ మాటలు భంగపాటు కలిగించాయి. ప్రొఫెసరు గెడ్డెస్‌తో వచ్చిన బేధాభిప్రాయలు ఆమెకు దుఃఖాన్ని కలిగించాయి. ఆమె శరీర ఆరోగ్యం మానసిక బలం తగ్గాయి. శ్రీమతి బుల్ ఆహ్వానం పై బ్రిటన్‌లోని లానియానీ వద్ద పెర్రోస్ - గుయిరెక్‌లో కొంతకాలం గడిపింది.

తిరిగి మనశ్శాంతిని పొందినా, స్వామియొక్క విముఖత ఆమెను కలవరపరుస్తూనే ఉంది. స్వామి యొక్క మార్గదర్శకత్వ సలహాకోసరం ఆమె లేఖ వ్రాసింది. నివేదిత అంటే తనకు ప్రత్యేకమయిన వ్యతిరేక భావము లేదనీ, ఆమె స్వేచ్ఛగా స్వతంత్ర మార్గంలో పయనించటమే తనకు అభిలషణీయమనీ, స్వామి పేర్కొన్నారు. స్పష్టంగా కనిపిస్తున్న ఈ నిర్లిప్తతా వ్యక్తీకరణ నివేదితను మరింత క్రుంగ తీసింది. నివేదితను శ్రీమతి బుల్ స్వంత కూతురుగా ప్రేమిస్తుంది. శ్రీమతి బుల్ వివేకానంద స్వామిని వారింటికి ఆహ్వానించింది. స్వామిజీ వాత్సల్యంతో శ్రీమతి బుల్‌ని ధీరమాత అని పిలిచేవారు. శ్రీమతి బుల్ ఆహ్వానాన్ని స్వామి అంగీకరించారు.

శ్రీమతి ఏర్పాటు చేసిన ఆ సమావేశంలో నివేదిత అనుమానాలు తొలగిపోయాయి. తనపై ఆధారపడకుండా స్వతంత్రంగా కర్తవ్యాలను నిర్వహించటమే స్వామి ఉద్దేశమని నివేదిత గ్రహించింది. తను బాగా అలసిపోయానని, భారత దేశానికి తిరిగి వెళ్ళిపోవాలని అనుకుంటున్నట్లు స్వామి చెప్పారు. స్వామి ఆమెకు ''దీవెన'' అన్న కవితను బహుమతిగా యిచ్చారు. ఆ కవిత నాటినుంచి బారతీయుల కర్ణపుటాల్లో రింగుమంటూనే ఉంది.

''మాతృహృదయం వీరుని సంకల్పం,
పిల్ల తెమ్మెర పరిమిళం,
ఆర్యుల దైవ పీఠాలపై,
స్వేచ్ఛగా జ్వలించే పవిత్రమైన
ఆకర్షణ శక్తి... ఇవి... ఇవికాక ఇంకా ఎన్నో
ఏ ప్రాచీన ఆత్మ అయినా స్వప్నంలో కూడా
దర్శించని యింకా ఎన్నో గుణాలు నీలో రూపొందాలి.
భావి భారత పుత్రిగా, నేత్రిగా, సేవికగా

స్నేహితురాలుగా, అన్నీ కలిసి ఒకటిగా
నువ్వు రూపొందాలి.''

నివేదిత ఇంగ్లండు వెళ్ళి భారత దేశానికి తిరిగ వెళ్ళి పోదామని అనుకొంది. ఆఖరి రోజు సాయంత్రం స్వామిజీ ఆమెను తోటలోకి పిలిచి యిలా చెప్పారు. ''ప్రపంచంలోకి వెళ్ళు అక్కడ నీవు నా చేత రూపొందించ బడిన దానివయితే నశిస్తావు. మాత నిన్ను రూపొందించినట్లయితే జీవిస్తావు.'' ఆ మర్నాడు ఉదయం నివేదితకు వీడ్కోలు చెప్పటానికి స్వామిజి వచ్చారు. ఆ సంఘటన గురించి నివేదిత యిలా వ్రాసింది.

''నాకు జ్ఞాపకం ఉన్నంత వరకు - యూరప్‌లో స్వామిని గూర్చి - నేను గుర్రపు బగ్గీలోంచి వెనక్కి తిరిగి చూస్తున్నాను. స్వామిజీ మూర్తి నాకు కనిపిస్తోంది. నేపథ్యంలో ప్రభాత ఆకాశం. లండన్‌లో ఆయన మాపర్ణశాల వద్ద వున్న మార్గం ప్రక్కన నిలుచుని ఉన్నారు. చేతులెత్తి నమస్కరిస్తున్నారు. అందులో ఆశీర్వచనం కూడా ఉంది.'' ఆవిధంగా స్వామి నివేదితను దృఢ నిశ్చయంతో ఒంటరిగా జీవన ప్రస్థానంలోనికి పంపించారు.

నిజానికి నివేదిత విధి నిర్ణీతమైన లక్ష్యసంబంధమయిన మార్గంలో పయనించ ప్రారంభించింది. స్వామీజీ భారతదేశానికి వెళ్ళిపోయినా, తాను మాత్రం ఇంగ్లండులోనే ఉండిపోయింది. ఆ పని సరి అయినది అవునా కాదా అన్న సందేహం తోచింది. అయినా ఆమె ఇంగ్లండులోనే ఉండిపోయింది. ఒక కార్యక్రమాన్ని చేపడదామన్న ప్రేరణను ఆధ్యాత్మిక మయిన గాఢవాంఛతో సమన్వయం చేసుకోవటం వల్ల, ఆమెకు సందేహాలు కలిగాయి. పితృ సమానులయిన వివేకానందులు నిర్దేశించిన ఆదర్శాలకు ఇంగ్లండులోనే ఉండి పోవటం స్కాట్లండుకి వెళ్ళటం భారతదేశంలోని తన భవిష్యత్ కార్యకలాపాలకి అనుకూలించాయి.

డాక్టరు బోసు లండన్‌లో శస్త్ర చికిత్స పొందుతున్నారు. బోసు, ఆయన సతీమణి కొన్ని చిక్కుల్లో పడ్డారు. సిస్టర్ నివేదిత శ్రీమతి బుల్ వారిద్దర్నీ స్నేహితులుగా భావించి సహాయం అందించారు.

సిస్టర్ నివేదిత భారతీయ జీవన స్రవంతిని సమర్థిస్తుంది. అంతే కాక భారతీయత ఉట్టిపడుతున్న అభిరుచుల్నీ అనుసరణాల్నీ సంపూర్ణంగా సమర్థించ గల మహావ్యక్తిగా పరిణతి చెందింది. జనవరి ఫిబ్రవరి నెలల్లో (1901), ''భారత దేశంలో ఆధ్యాత్మిక జీవనం'', ''భారత మహిళల ఆశయాలు'', ''ఇండియాలో ఇంగ్లండు వైఫల్యం'' అనే విషయాలపై లండన్‌లో వారానికి మూడుమాట్లు ఉపన్యాసాలిచ్చింది. స్కాట్లండులో కూడా ఉపన్యాసాలిచ్చింది.

మత ప్రచారకులు భారతజీవన విధానాలపై అబద్ధ కథనాలు చేసేవారు. వీటిని నివేదిత ఖండించేది. అందువల్ల వీరు ఆమె మీద తీవ్రంగా ఆగ్రహం చెందేవారు. వీరిని గురించి ఒక గ్రంథం వ్రాయ నిశ్చయించుకొంది.

లండన్‌లో మరొక ఉపన్యాసం ఇచ్చింది. దాని పరిణామంగా ఆమె వ్యాకులపడి భారతదేశానికి పోదామనుకొంది. కుమారి మెక్‌లియడ్ భారతదేశానికి వెళ్ళింది. ఆమె ద్వారా మాత అనుమతిని పొందింది. కాని చేపట్టిన కృషి యికా ఎంతో మిగిలిఉంది. అందువల్ల ఇంగ్లాండులోనే ఉండిపోయింది. ప్రముఖ విద్యావేత్త హాక్స్ మహాశయుని ప్రేరపణతో భారతీయ విద్యావిధానం గురించి ప్రత్యేక వ్యాసం వ్రాసింది. ''రెవ్యూ అఫ్ రెవ్యూస్'' ప్రఖ్యాత సంపాదకుడు విలియమ్ స్టెడ్ మహాశయుడు డాక్టరు బోసు జీవిత వివరాలను వ్రాయమని నివేదితను కోరాడు. ఆమె వ్రాసిన ''కాళి ది మదర్'' (విశ్వమాత కాళి) గ్రంథ రూపంలో వెలువడింది.

ఇండియన్ సివిల్ సర్వీసునకు చెందిన దత్ మాహాశయుడు ఆమెను భారత జీవన విధానంపై తన కవగాహన అయి గోచరించిన రీతిన రచించమని ప్రోత్సాహించాడు. ఆయన గొప్ప విద్వాంసుడు, ఆయన రచించిన ''భారత ఆర్థిక చరిత్ర'' సర్వకాలిక మయిన ఉద్గ్రంథం. ''బారత జీవన విధానం'' అన్న గ్రంథం మొదటి ప్రకరణాలు రాసింది. ఆయన ప్రేరణ మూలంగానే. ఈ రచనకు విషయ పరిజ్ఞానం సంపాదించటానికి ఆమె సునిశిత దృష్టితో శ్రమ పడి అధ్యయనం చేసింది. ఆచార్య గెడ్డెస్ ఆహ్వానం పురస్కరించుకొని నెలపదిహేను రోజులు ఆయనతో గడిపింది. గ్లాస్కో ప్రదర్శనలోని విభాగంలో ప్రసంగించింది. మత ప్రచారకులు భారతీయులపై చేసే ఆరోపణలను ఖండిస్తూ వ్యాసం రాసింది.

భారత దేశానికి వెళ్ళిపోదామని ఆత్రుతగా ఉంది. కాని ఈ శేషకృషి మూలంగా ఆమె అక్కడే ఉండి పోవలసివచ్చింది. నార్వే దేశస్థురాలు శ్రీమతి బుల్ ఆహ్వానంపై, వారి నివాస గృహంలో బుల్ మహాశయుని విగ్రహం ఆవిష్కరించింది. తర్వాత మూడు నెలల పాటు అక్కడే ఉండిపోయింది. ఆరోగ్యం కోసరం అక్కడ విశ్రాంతి తీసుకొంది. స్నేహితులు ఆమెను చూడ్డానికి వచ్చేవారు. అయినా తన కృషిని ఎక్కువగా చేస్తూనే ఉండేది. ఆమె వ్యాసం వెస్ట్‌మినిస్టర్ గెజట్‌లో ''తోడేళ్ళ మధ్య గొర్రె పిల్లలు'' అన్న శీర్షికతో ప్రచురింపబడింది. అది మత ప్రచారకులు చేసిన ఆరోపణలకు సమాధానం. 1901 సెప్టెంబర్ నాలుగున ఆమె ఇంగ్లండుకి తిరిగి వచ్చింది.

ఆరోజుల్లోనే ఆమె చింతనా పరంపర అతి నవ్యమయిన ముఖ్యపరిణతిని అందుకొంది. భారతదేశం ప్రపంచానికి సందేశం అందించగలదు. అయితేనేమి,

ఆదేశ దాస్య పరిస్థితి అందుకు అవరోధంగా నిలిచి పోతోందని తన అనుభవం దృష్ట్యా ఆమె గట్టిగా విశ్వసించింది. ఆంగ్ల పాలకులు, ఆంగ్లేయులు భారత దేశంలో ఎంత క్రూరంగా ప్రవర్తిస్తున్నారో తాను కళ్ళార చూసింది. వివేకానంద స్వామి అమెరికాలో విమర్శక ప్రాతికూల్యానికి గురి అయ్యారు. అది ఆమెకు మానసికంగా వ్యథను కలిగించింది. జగదీశ చంద్ర బోసు పారిస్ నగరంలో గొప్ప గౌరవాన్ని పొందాడు. ఆ జగదీశ్ చంద్రబోసే ఇంగ్లండ్‌లో ప్రత్యేకంగా నీచంగా పరిగణింపబడి తిరస్కరింపబడ్డాడు.

ఈ అనుభవాల వల్ల భారత దేశం ప్రపథమంగా స్వాతంత్ర్యం పొందవలసిన ఆవశ్యకతను ఆమె గుర్తించింది. ఆ గుర్తింపు ఆమెను మేల్కొలిపింది. బారత దేశం అంటే నిజమయిన సానుభూతి పరులు ఇంగ్లండులో ఏ కొద్దిమంది మాత్రమే ఉంటారని ఆమె తెలిసికొంది. ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ కార్యక్రమాల గురించి, భారత దేశ రాజకీయాల గురించి ఆర్థిక సమస్యల గురించి, ఆర్. సి. దత్ మహాశయుని వద్ద నుంచి ఆమె తెలుసుకుంది. జెమ్ షెడ్జీ టాటా భారతదేశంలో ఒక విశ్వవిద్యాలయాన్ని స్థాపిద్దామని పూనుకొంటే ఆ పథకాన్ని త్రోసి పుచ్చారు. శ్రీమతి అనీ బిసెంటుకి బెనారెస్‌లో హిందూ కళాశాల నెలకొల్పటానికి అనుమతి నిరాకరించారు. ఈ వివరాలు నివేదితకు తెలిసాయి.

క్రాపోట్కిన్ రాకుమారునితో బారతదేశ పరిస్థితిని గురించి చర్చించింది. తత్ఫలితంగా ఈదేశ గ్రామీణ వ్యవస్థ స్థిరమయిన సామూహిక జీవన వ్యవస్థగా పరిణతి చెందటానికి ఒక ప్రచలిత భావ పూరితమయిన ప్రాతిపదిక అన్న విశ్వాసం ఆమెలో దృఢపడింది. అట్టి వ్యవస్థ మీద ఆధారపడి ఒక వ్యవస్థీ కృత ముదాయంగా బారతదేశం పరిణతి చెందే దృశ్యం ఆమెకు దృగ్గోచరం కాసాగింది. దాని పరిణామంగా – ''యుద్ధమూ అవసరం లేదు రక్తపాతమూ అవసరంలేదు. మేమే ఒకానొక రోజున చిరునవ్వులు చిందించుకొంటూ, వైస్రాయి దగ్గరకు వెళ్ళి వేచిఉండి, ఆయన చేసే ఔద్యోగిక సేవలు మాకింక అవసరం లేదని విన్నవించుకొంటాము. ఏ సాధన మార్గాల్లో ఈ కలాపం నడిపించాలో గెడ్డెస్ మహాశయుడు రాసిన ''శాంతియుత జీవన ప్రతిపాదనం'' లో ఉటంకించ బడి ఉంది. ఆ తీరులు తెన్నులు జాగ్రత్తగా క్రమక్రమంగా వివరించబడుతాయి.'' ఈ వివరణ భవితవ్యంలో, కొన్ని దశాబ్దాల తర్వాత మహాత్మాగాంధి అనుసరించిన నిర్మాణాత్మకమయిన కార్యశీలత, సహాయనిరాకరణం అనుకార్యకలాపాల పోకడలను దూరదృష్టితో మున్ముందే సూచించినట్లుంది. భారతదేశం ఆ విధంగా స్వాతంత్ర్య పొందనే పొందింది!

భారతదేశంలో ఇంగ్లండు ప్రవర్తించే తీరులు సిస్టర్ నివేదితకు ఎంతో దుస్సహ వేదనని కలిగించాయో ఆమె పలుకుల వల్ల తేటతెల్లం అవుతుంది. ''భారతదేశం విషయ పరిజ్ఞాన సేకరణలో లీనమై ఉంది. ఆసమయంలో దోపిడీగాండ్రు జట్టుగా వచ్చి భారత దేశంపై బడి ఆ భూమిని నాశనం చేశారు. దాంతో ఆమె మానసికస్థితి భంగ పడింది. దోపిడీగాళ్ళు ఆమె కేదయినా నేర్పగలరా? నేర్పలేరు!! ఆమే వాళ్ళని బయటకు తరిమి పారేసి తన పూర్వస్థితికి చేరుకోవాలి. భారతదేశం అనుసరించ వలసిన ఒకే ఒక నిజమయిన కార్యవిధానం ఈ విధంగా ఉండాలని నేను భావిస్తున్నాను'' అని ఆమె రాసింది.

భారతదేశ ప్రతినిధులు కొందరు ఇంగ్లాండ్ వచ్చి ఇక్కడి ప్రజా బాహుళ్యానికి ఆదేశం గురించి తెలియ జెప్పాలని ఆమె కోరిక. ''మా దేశపు ధూళి, మాకు ప్రత్యామ్నాయంగా మా సందేశాలను వహించి ఇతర మానవాళికి తెలియ జెప్పాలి. మనం చేయవలసింది - అలతో పాటు మనం కూడా అలపై తేలిపోవాలి. అట్లా తేలుతూ అల ఎక్కడికి పోతే అక్కడికి చేరుకోవాలి. చేరుకొని మన కెదురయ్యే జనబాహుళ్యానికి మన సందేశం నివేదించాలి. ఆ వేడి మీదనే దెబ్బకొట్టాలి.''

''జాతీయతా పరంగా పురుష కారక వ్యక్తిత్వ ఉద్ధరణ విషయమై స్వామీజీ అధికారిక ఆజ్ఞా రూపం, దాని ప్రాముఖ్యాన్ని ఆమె మననం చేసుకుని గోచరింప చేసికొంది. నిజానికి స్వామీజీ తప్ప ఇంకెవరూ ఆ రూప స్వరూపాల్ని వీక్షించనే లేదు. ''ఆయన అంతర్దృష్టి నా అంతర్దృష్టిని అశక్తం చేయదు. కాగా నా దృష్టిని ఇంకా ఎక్కువ ఆవశ్యకమయిన సంకల్పంగా వ్యక్తపరుస్తుంది.'' మానసికంగా ఈ భావపరంపలు ఆమెలో రేకెత్తి విస్తరిస్తున్నాయి. ఈ భావ పరంపరలకు స్వామీజీ ఆమోదం ఉందో లేదో అన్న భయ సందేహాలు ఆమెలో చెలరేగాయి. స్వామీజీ తనకై నిర్దేశించిన కార్యక్రమానికి ఇవి స్పష్టంగా భిన్నమయిన భావ పరంపరలు, కాని స్వామిజీ ఆదేశాలు ఆమె ఏనాడూ త్యజించలేదు కదా!

ఇంక భారతదేశానికి తిరిగి వెళ్ళిపోదామని ఆమెకు ఆతురతగా ఉంది. ఉన్న పనులన్నింటినీ పూర్తి చేసింది. లండన్ బెతనీ సిస్టర్స్ హోమ్ అఫ్‌ది రిట్రీట్ సదనంలో వారం రోజుల పాటు కాలక్షేపం చేసింది. ఈ గృహవాతావరణం శారదామణి గృహవాతావరణంలా ఉంది. అది ఆమెపై చెరగని ముద్ర వేసింది. ఆచార్య గెడ్డెస్ మహాశయునితో కొన్నాళ్ళు గడిపింది. బోస్ మహాశయుని ''దిలివింగ్ అండ్ ది నాన్ లివింగ్'' గ్రంథాన్ని ప్రచురణకి తగిన క్రమంలో సరిదిద్దింది, తర్వాత నౌకలో భారతదేశానికి బయలు దేరింది. శ్రీమతి ఓల్ బుల్, దత్ మహాశయుడు ఆ ప్రయాణంలో ఆమెతో కూడా ఉన్నారు.

1902 ఫిబ్రవరి 3 నాటికి మద్రాసు చేరుకోగానే వారికి ఘనమైన ప్రజా స్వాగతం లభించింది. ఆమె సమాధానం చెబుతూ అందర్నీ ప్రభావితం చేసింది. భారతదేశంలోనే జన్మించిన వ్యక్తిగా మాట్లాడింది. మాతృభూమిగా తానెంచుకొన్న భారతావనిని శ్లాఘించింది. ఆమె భాషితాలను అన్ని పత్రికలు బహుళంగా ప్రచురించాయి. ఆ సమయంలో వివేకానంద స్వామి బెనారెస్‌లో ఉన్నారు. ఆయన ఆమెను ఎంతో మెచ్చుకున్నారు. ప్రముఖ భారతీయులు ఆమెను కలుసుకొని పరిచయం చేసుకొనేవారు. ఇట్లా జరగటం వల్ల భారత ప్రభుత్వం కలవర పడింది. ఆమె రాకపోకల మీద నిఘా విధించారు. ఉత్తర ప్రత్యుత్తరాల మీద అజమాయిషీ ప్రారంభించారు. ఈ సమయానికే గాంధీజీ కాంగ్రెసు సమావేశానికి హాజరయి కలకత్తా వచ్చి ఉన్నారు. ఆ సందర్భంలో గాంధీజీ నివేదితను కలిసికొన్నారు.

భారత మహిళలకు విద్య నేర్పించటానికి ఒక పాఠశాలను స్థాపించాలని ఆమె ఉద్దేశం. వివేకానంద స్వామి అనుమతిని పొంది సరస్వతీ పూజ రోజున ప్రారంభోత్సవం జరిపింది. సరస్వతీ పూజాకలాపాన్ని యథావిధిగా నిర్వహించింది. కుమారి బెట్ చాలా రోజులనుంచి తన సంరక్షకురాలు. ఆమెతనతో కూడ వచ్చింది. ఆమె నివేదితకు ఎంతో చేదోడుగా ఉండేది. జర్మన్ దేశస్తురాలు క్రిస్టిన్ గ్రీన్‌స్టైడెల్ ఏప్రిల్ నెలలో నివేదిత వద్దకు వచ్చింది. ఆ తర్వాత ఈమె పాఠశాల నడిపే బాధ్యతల్ని చేపట్టింది. (ఈమె తల్లిదండ్రులు అమెరికాలో స్థిరపడ్డారు.)

1894లోనే ఈమె డెట్రాయిట్‌లో వివేకానంద స్వామిని కలిసికొంది. రెండేళ్ళ తర్వాత, స్వామీజీ తౌజండ్ ఐలండ్ పార్కులో ఉండగా, కష్ట భూయిష్టమయిన ప్రయాణం చెయ్యటానికి వెనకాడక, శ్రీమతి షింక్‌తో కలిసి స్వామిజీని సందర్శించింది. స్వామిజీ అమెరికా రెండవ ప్రయాణంలో కూడ క్రిస్టినీ డెట్రాయిట్‌లో ఆయన్ని కలుసుకొంది. నిధులు వసూలు చేయటానికి నివేదితకి ఈమె సహాయంగా ఉండేది. డెట్రాయిట్ కమిటీకి కార్యదర్శినిగా పనిచేసింది. ఉత్సాహ పూరితమయిన క్రిస్టీన్ సేవానిరతిని, స్వార్థత్యాగాన్ని స్వామీజీ గుర్తించి అభినందించారు. ఆమె కలకత్తా రాగానే ఘనంగా ఆహ్వానించారు. ఆమె సుమధుర సహన స్వభావాన్ని నివేదిత కూడా గుర్తించింది. పాఠశాల కార్యక్రమ విధుల నిర్వహణలో క్రిస్టిన్ నివేదితకు చేదోడువాదోడుగా ఉంది.

''ఆధునిక శాస్త్ర విజ్ఞానంలో హిందూ మనస్సు'' అన్న అంశంపై నివేదిత నవంబర్ 23న క్లాసిక్ థియేటర్‌లో ప్రసంగించింది.

1902 వేసవిలో నివేదిత క్రిస్టిన్ మాయవటికి ప్రయాణమయి వెళ్ళారు. వారితో కూడ జపాన్ విద్యాంసుడు, కళాకారుడు, కౌంట్ ఓక కూర ఉన్నారు. ఈయన ఆదేశ పురావస్తు శాఖా సంస్కరణ సంఘం అధ్యక్షుడు. భారత సంస్కృతి, కళల పట్ల ఆయనకు బహుప్రీతి. జపాన్‌లో జరగబోయే మత విషయక సర్వోన్నత సభకు స్వామీజీని ఆహ్వానించటానికి జపాన్ బౌద్ధమతం యొక్క ఉన్నత మత గురువు ఓడా మహాశయునితో కూడా ఓకకూర భారతదేశం వచ్చాడు. అస్వస్థత కారణంగా ఈ ఆహ్వానాన్ని స్వామిజీ నిరాకరించాడు. కానీ వారిని ఆనందంతో పలకరించి సంభాషించారు. ఓకకూర బోధ్‌గయుకు, బెనారెస్‌కు, స్వామిజీతో కూడా వెళ్ళి తీర్థయాత్రల్లో పాల్గొన్నారు. ఓకకూర భారత దేశంలో చాలాకాలం ఉండి ప్రాశ్చ్య ప్రాంత ఆదర్శాలు ''ఐడియల్స్ అఫ్ ది యీస్ట్'' అనే అమూల్యమయిన గ్రంథాన్ని వ్రాశారు. నివేదిత సరిదిద్ది తొలిపలుకులు రాసింది.

రబీంద్రనాథ టాగూర్ సోదరుని కుమారుడు సురేంద్ర నాథ్ టాగూర్ అతని నాయకత్వం కింద మరికొందరు యువకుల సహాయంతో ఓకకూర రాజకీయంగా శక్తివంతమైన పాత్ర వహించేవారు. ఉత్తర భారతంలో గుప్తంగా కొన్ని సంఘాల్ని సమకూర్చటంలో ఆయన చేయూత ఇచ్చేవారని విశ్వసనీయ వర్గాల ద్వారా తెలియ వచ్చింది.

ఆలోచనా ప్రక్రియల గురించి మాత్రమే బోధలు చేస్తూ సంతృప్తి చెందే ఒక వ్యక్తిగా ఆమె ఉండి పోకుండా, ఆ ఆలోచన పరంపరల్ని భారత జాతీయ జీవన స్రవంతిలో, కార్యరూపంలో, అనుభవానికి తెచ్చే ఉత్సుకతను, ప్రేరణను నివేదితలో కలిగించగల ప్రభావంతుల్లో ఓకకూర మహాశయులు ఒకరని చెప్పవచ్చు. నివేదిత బృందం హిమాలయా ప్రాంగణంలో ప్రశాంతంగా నిశ్చలంగా నెలరోజులు గడిపి కలకత్తాకు తిరిగి వచ్చారు.

గురు సన్నిధి నుంచి ఎడబాటు కలుగబోయే సమయ మాసన్నమయింది.

యూరప్ నుంచి తిరిగి వచ్చిన తర్వాత బేలూర్ మఠంలో నివేదిత స్వామిజీని కలిసికొంది. కాని ఆయన అప్పుడు అస్వస్తతగా ఉన్నారు. మార్చి పదవ తారీఖున రామకృష్ణ జయంత్యుత్సవాలు జరుగుతున్నాయి. అయినా స్వామీజీ బయటకు రాలేదు. లోపలే ఉన్నారు. కొందరు ఆంగ్ల స్నేహితులతో కలిసి నివేదిత కొద్దిసేపు దర్శించ గలిగింది. మఠ ప్రాగణంలో ఆటల పోటీలు జరిగాయి. వాటిని స్వామిజీ కిటికీలోంచే తిలకించారు. శ్రీమతి బుల్, కుమారి మేక్‌లియడ్ అప్పుడు మాత్రమే ఆయన్ని చూడగలిగారు.

జూన్ 26న నివేదిత మాయావతి నుంచి తిరిగి వచ్చింది. ఆ మర్నాడు

స్వామిజీ ఆమెను చూశారు. 29వ తారీఖున బేలూర్ మఠంలో స్వామిజీ ఉపవాసదీక్షలో ఉన్నారు. అయినా స్వామిజీ నివేదితకు భోజనం వడ్డించారు. భోజనం అయిన తర్వాత స్వామిజీ ఆమె చేతుల్ని కడిగారు. ఈ సన్ని వేశానికి ఒక ప్రాధాన్యత ఉంది. జీసస్ క్రైస్ట్ శిలువ మీద బాధలకు లోనయి మరణించేముందు శిష్యులతో సాయం సమయ భోజనం చేసి వారి పాదాల్ని కడిగారని బైబిల్ గాథ ఉంది కదా. ఆనాడు. నివేదిత స్వామిజీ సన్నిధిలో మూడు గంటల సేపు ఉంది. ఆరోజు గడిస్తే తనని మరి చూడలేనని స్వామిజీ భావిస్తోన్నట్లు నివేదితకు తోచింది. ఈ విషయం ఆమె శ్రీమతి హామ్మాండ్‌కి రాసిన ఉత్తరంలో కూడా పేర్కొంది.

జూలై నాలుగున ఆయన బాగానే ఉన్నారు. అట్లా అని ఆయన దగ్గరనుంచి కబురు కూడా వచ్చింది. మఠం నుంచి ఆమరునాడు ఉదయమే పరమ పదించారన్న వార్త వచ్చింది. దహన సంస్కారం ప్రారంభం అయేదాక ఆయన దేహాన్ని నివేదిత వింజామర పట్టుకొని విసురు తోనే ఉంది. స్వామిజీ తల్పం పై వైపున ఉన్న వస్త్ర భాగం ఒకటి మండుతోన్న చితిలోంచి గాలి కెగిరి ఆమె పాదాల వద్దకు వచ్చి పడింది. ఆమె వంగి దాన్ని చేతుల్లోకి పూజ్యభావంతో తీసికొంది. స్వామీజీ అంతిమ దినాల్లో ఆయన దీవనలను తానిలాగా పొందింది. ఈ వస్త్ర భాగాన్ని కుమారి జొసెఫీన్ మెక్‌లియడ్‌కి అర్పించటం బాగుంటుందని ఆమె భావించింది.

## 5

# కర్తవ్య నిర్వహణా మార్గంలో

గురువు తన మీదుంచిన గాఢ నమ్మకాన్ని అమలు పరచటం నివేదిత లక్ష్యం. కాని ఆ లక్ష్య సాధన విధులు కర్తవ్యాలు కొత్త పరిమితిని రూపొందించు కొంటున్నాయి. భారతావని అభివృద్ధి చెందటానికి రాజకీయంగా దేశ స్వాతంత్ర్యం అత్యావశ్యకమన్న ఆమె అచంచల విశ్వాసం ఇంకా దృఢ పడింది. కాని రామకృష్ణ మఠానికి చెందిన సభ్యులెవ్వరూ రాజకీయాల్లో పాల్గొనటానికి వీల్లేదు.

వివేకానంద స్వామి తాను నిర్ణయించుకొన్న విధులు రామ కృష్ణుని పరంగా కాదు. వేదాంతం పరంగా కాదు- స్వజాతీయుల్ని పౌరుష వంతులుగా మలచటం అని ఇది వరకే స్వామీజీ నిస్సంకోచంగా చెప్పారు. ఈ విషయంలో చేయూత నివ్వటానికి తాను సంసిద్ధురాలే. అందుకు స్వామిజీ ఒప్పుకున్నారు కూడాను. అంతమాత్రాన తను తీవ్ర రాజకీయాల్లో ప్రవేశించటం స్వామిజీ దృష్ట్యా యోగ్యమని సంభావించటానికి వీల్లేదు.

వివేకానందుల అనంతరం రామకృష్ణ మఠం అధ్యక్షులయిన స్వామి బ్రహ్మానంద ఆమె నిర్ణయమేమిటో తెలియజేయమని రాశారు. పూర్తి స్వేచ్ఛ కలగటానికి మఠంతో తనకున్న అనుబంధం ముగించుకొన్నట్లు ఆమె జవాబు రాసింది. తన కార్య కలాపాలన్నింటికి మఠం అనుమతి కాని అధికారికం కాని అవసరం లేదని పత్రికల్లో ప్రకటించింది. మహిళల జీవన స్రవంతి ఎలాగా సమతూకంగా సాగిపోతోందని అభిప్రాయం తెలియజేస్తూ, అందువల్ల స్త్రీ ప్రయోజనాల కోసరం మాత్రమే తాను పనిచేసే ప్రసక్తి ఇక ఉండదని కుమారి మెక్‌లియడ్‌కి ఉత్తరం రాసింది. దేశం ఎదుర్కొంటున్న బాధ్యతల గురించి సమస్యల గురించి ప్రజా బాహుళ్యానికి తెలియ జెప్పాలి. వారిలో స్పందన కలిగించి చైతన్య వంతుల్ని చేయాలి. స్వచ్ఛందంగా చేపట్టిన తన కార్యకలాపాలు ఇంక యివేనని ఆమె దృఢ నిశ్చయం.

ఆ దృష్ట్యా తన శక్తి సామర్థ్యాలను వినియోగించి దేశ పరిస్థితుల్ని ఎరుక చేసుకోవాలి. స్వామిజీ సందేశాన్ని జనబాహుళ్యానికి అందేజేయాలి.

వివేకానందులు పరమ పదించిన అనంతరం ఒక సంస్మరణ సభలో ప్రసంగించటానికి జెస్సూరీ వెళ్ళింది. విద్యాసాగర్ వార్షికోత్సవ సందర్భంగా దత్ మహాశయుల అధ్యక్షతన జరిగిన సభలో మాట్లాడింది.

అనంతరం ఆమెకు సుస్తీ చేయటంతో బేలూర్ మఠం నుంచి వచ్చిన బ్రహ్మచారులు ఆమెకు పరిచర్యలు చేశారు. ఆర్థికంగా తాను కష్టాలకు లోనవుతున్నా, పొరుగు స్త్రీలకు డబ్బు యిచ్చి వారిని ఆదుకొంది. ''ది వెబ్ ఆఫ్ ఇండియన్ లైఫ్'' గ్రంథం పూర్తి చేయటానికి పూనుకొంది. అదృష్టవశాత్తు ఈ గ్రంథం బాగా అమ్ముడు పోవటం వల్ల ఆమె కృతకృత్యురాలయింది.

ఆహ్వానాలని పురస్కరించుకొని సెప్టెంబర్ 22న స్వామి సదానందతో కలిసి బొంబాయి వెళ్ళింది. అక్కడ చాలా సబాకార్యకలాపాల్లో విస్తృతంగా పాల్గొంది. ''స్వామి వివేకానంద'' ''ఆధునిక శాస్త్రీయ పరిజ్ఞానంలో హైందవ మనస్సు'', ''భారతీయ స్త్రీ జనావళి'', ''భక్తి, విద్య'', ''ఆసియా ఐక్యత'', ''మాతృపూజ'' అనే విషయాల మీద అభిభాషించింది.

హైందవ ఆలోచనా ప్రక్రియలో ఆమెకున్న గాఢ విశ్వాసాన్ని ''ఆధునిక శాస్త్రీయ పరిజ్ఞానంలో హైందవ మనస్సు'' ప్రసంగంలో ఆమె భాషితాలు స్పష్టం చేశాయి. ''యూరప్ దేశాల శాస్త్రీయ పరిజ్ఞానం ఎంతో ఎక్కువగా అభివృద్ధి చెందవచ్చు గాక! కాని సత్యాన్వేషణలో రూఢైన పంథాల కోసరం హైందవ మనస్సు తన సహజ జ్ఞాపకశక్తి ద్వారామ, అంతర్దృష్టి ప్రక్రియలతోను అవలంభించ వలసిన మార్గాలని ఎట్లా క్రమ బద్ధం చేసికొందో పోల్చి చూస్తే యూరప్ వారి శాస్త్రీయు పరిజ్ఞానం ఏ మాత్రం సరిపోదు.'' ఈ ప్రసంగాన్ని అందరు వేనోళ్ళకొనియాడారు.

నివేదిత వాక్సరస్వతి భారతదేశం నలుమూలలా ప్రసారిస్తుందని వివేకానంద స్వామి ఏనాడో అన్నారని కుమారి మెక్లియడ్ చెప్పనే చెప్పింది. స్వామిజీ మాటలు నిజం అవుతున్నాయని అబ్బురపడుతూ నివేదిత కుమారి మెక్లియడ్కి ఉత్తరం రాసింది.

నాగపూర్, వార్ధా, బరోడానగరాల్లో నివేదిత ప్రసంగాలు విజయవంతంగా ముగిశాయి. బరోడాలో అరవిందోఘోష్ని కలిసికొంది. ఆయన్ని ముఖాముఖి కలిసికోటం అది మొదటి సారి. ఆకలయిక వారిద్దరి రాజకీయ ప్రయోజనాల సన్నాహాలకి సహకారాలకి నాంది పలికింది.

అనంతరం అహ్మదాబాదులో సభలు క్షేరి ఎల్లోరా గుహల సందర్శనం. నివేదిత ఎల్లోరా గురించి యిట్లా వ్రాసింది. ''మానవాళి వారివారి మానసిక సంబంధాలు వారి వారి మతాభిప్రాయాలు ఏవయినా అవవచ్చుగాక ఈ నేల తల్లి

యధాతథంగా మనేంతకాలం ఎల్లోరా వారి జీవాత్మల మీద అధికారికంగా ప్రభవిస్తూ భావాలకు అందని ఆ పరమాత్ముని అతీత శక్తిని దృగ్గోచరింప జేసే ప్రదేశాల్లో ఒక విశిష్ట ప్రాంతంగా అనంతకాలం నిలిచి పోతుంది.''

ఆమె ఎక్కువగా బడలిక చెందటం వల్ల పర్యటనలు ముగించుకొని కలకత్తాకు తిరిగి వచ్చింది. అనంతరం చంద్రనాగూర్‌లో ఒకటి కలకత్తాలో రెండు ఉపన్యాసాలిచ్చింది.

డిశంబరు 8న స్వామి సదానందతో మద్రాసు వెళ్ళింది. వీరితో బ్రహ్మచారి అమూల్య కూడా ఉన్నారు. ఆ తరువాత బ్రహ్మచారి అమూల్య సన్యాసాశ్రమం తీసుకొని శంకరానంద స్వామి అయి రామకృష్ణ మిషన్ అధ్యక్ష పదవి చేపట్టారు.

క్రిస్మస్ పండగ సందర్భంగా వారంతా దోవలో ఒరిస్సాలోని ఖండగిరిలో ఆగారు. నివేదిత పారమార్థికమయిన సంయోగం సాధింగలిగిందో వీరు తలపెట్టిన ప్రక్రియ ఉదాహరణం – ఆ ఇద్దరు బ్రహ్మ చారులు గొర్రె కాపరుల వేషాల్లో కొంకికర్రల్ని పట్టుకొని ''సెయింట్ లూక్ సువార్త'' బోధ సుభాషితాల్ని చదివారు. ''ప్రాచ్య దివ్యజ్ఞానుల గాథ'' లోంచి దేవదూతలు పొలాల్లో ఇళ్ళు కట్టుకొన్న గొర్రెల కాపరులకి రాత్రిపూట ఎలా కనపడ్డారో వివరించారు. ఏసుక్రీస్తు జీవిత చరిత్ర భాగం ''మరణం నుంచి సమాధి పునరుద్ధానం'' ఖండగిరి నగరం బుద్ధ దేవుని సందేశాన్ని మొదటి సారిగా ఆలకించింది. ఆనాటి ఆ బౌద్ధ బోధ జీసను ప్రభువు జీవిత సందేశ ప్రాభవాన్ని ఇనుమడింపజేసి సంపన్నం చేసినట్లుగా నివేదిత భావించుకొంది.

డిశంబరు 19న మద్రాసు చేరుకొన్నారు.

ఈ పట్టణ స్నేహితులే స్వామిజీ అమెరికా ప్రయాణానికి ముఖ్య సహాయాన్ని అందించారు. స్వామిజీ అమెరికా నుంచి తిరిగి వచ్చిన రోజున కూడ వీరు గొప్ప స్వాగతం యిచ్చారని నివేదిత ప్రత్యేకంగా సంతోష పడింది.

ఆ సవంత్సరం మొదట్లో యూరప్ నుంచి వచ్చిన తరువాత ఇక్కడే ప్రజలు తనకు కూడ ఘనంగా స్వాగతం పలికారు. స్వామిజీ పంపించగా స్వామి రామకృష్ణానంద మద్రాసు వచ్చారు. వచ్చి స్థానిక భక్తుడొకాయన కైర్నానీ కోటలో ఆయత్త పరిచిన భవనాన్ని మఠంగా తీర్చిదిద్దారు. ఆమఠాన్ని ఇప్పుడు తనకి నివాసంగా ఏర్పాటు చేశారు. నివేదిత ఆ మఠంలోనే ఉంటూ చాలా సభల్లో ఉపన్యాసాలిచ్చింది.

''యంగ్ మెన్స్ హిందూ అసోసియేషన్'' అధ్వర్యాన ''భారత దేశ సమైక్యత'' గురించి ఆమె ఎలుగెత్తి మాట్లాడింది. ''భారతదేశ సమైక్యత ఏ

విదేశీయులో ఇచ్చిన బహుమానం కాదు. స్వతస్సిద్ధంగా భారతావనిలో సమైక్యత లేకపోతే ఆ సమైక్యతను ఎవ్వరూ ఇవ్వగల శక్తివంతులు కారు. ఏ మాత్రం సందేహం లేకుండా ఆ సమైక్యత దేశీయపరంగా సంతరించుకొన్న స్వయంభువు. ఆ సమైక్యతకు పూర్వనిర్దిష్టాలున్నాయి. అదృష్టాలున్నాయి. ప్రయోజనాలు న్నాయి. స్వకీయమయిన అఖండ అధికారాలున్నాయి. కాని ఆ సమైక్యత ఎవ్వరి దానాధర్మం మాత్రం కాదు'' అని చాటి చెప్పింది.

అస్వస్థత కారణాల వల్ల మహిళల సభకొకదానికి నివేదిత వెళ్ళలేకపోయింది. ఆ సభకి ఒక సందేశం పంపించింది. సంఘ వ్యవస్థ సమతూకంలో నిలబడేట్టు స్త్రీలే పర్యవేక్షిస్తూ ఉండాలి. ఆ బాధ్యతలు హక్కులు ప్రత్యేకంగా స్త్రీలకే చెందుతాయి. వాటిని వారు సగర్వంగా నిర్వహించి సమాజాన్ని బలిష్టపరిచి ధైర్యాశాలురైన యువతరాన్ని తయారు చేయాలి. అని ఆసందేశంలో ఆమె పేర్కొంది.

''భారతదేశ సమైక్యత'', ''జాతీయత'', ''స్వామిజీ ఆదర్శవాదము'', ''హిందూ మతము'' అన్న విషయాలపై విద్యార్థులతో చర్చలు జరిపింది. పర్యవసానంగా వారిలో చాలమంది పూనుకొని రాష్ట్రమంతటా తిరిగి వివేకానంద, సమితుల్ని స్థాపించారు. ఈ సమితులు వేదాంత మత ఆదేశాల్ని ప్రచారం చేశాయి. ఇవి సామాజిక, విద్యావిషయక కార్యకలాపాల్ని కూడా చేపట్టాయి. ఈ ప్రచారకులు సరైన పంథాల్లో నడవటానికి మార్గదర్శక సూత్రాల్ని ప్రతిపాదిస్తూ నివేదిత ఒక పుస్తకం రాసింది.

ఒకరితో ఒకరు సంభాషించుకొంటూ చర్చలు చేసుకొంటూ సమావేశాలు జరపటం ఆమె చేపట్టిన కార్యకలాపాల్లో ఒక పెద్ద అంశం, కాంచీపురం రైల్వే స్టేషన్‌లో బండి దిగ్గానే ఆవిధంగా ఒక సభ జరిపారు. అనంతరం చాలా సమావేశాల్లో ప్రసంగాలు చేసి మద్రాసు తిరిగి వచ్చింది. ఆహ్వానాల మీద ఆహ్వానాలు వచ్చాయి. కాని కాలాభావం చేత ఒప్పుకోలేక పోయింది. ఆసంవత్సరం (1903) సంప్రదాయ పూర్వకంగా జరిగిన స్వామి వివేకానంద జన్మ దినోత్సవాల్లో పాల్గొంది. ఆమరునాడు బయలు దేరి నివేదిత బృందం కలకత్తా వెళ్ళారు. రామకృష్ణ వివేకానందుల సందేశాన్ని దక్షిణ భారతీయులు ఏ తీరుల్లో అందుకొని అవగాహన చేసుకొన్నారో చూసి, ఆమె చాలా సంతోష పడింది. కానీ మఠ భవనాన్ని యజమానులు అమ్మివేసిన కారణంగా, మఠ కార్యకలాపాలు తాత్కాలికంగా ఆగి పోయాయి.

పాఠశాల వ్యవహారాల్ని మళ్ళీ చేపట్టటానికి యిప్పుడు నివేదితకు సమయం సావకాశం లభించాయి. ఆమె మనస్సులో పాఠాశాల కార్యకలాపాలు ఎప్పుడూ

మెదులుతూనే ఉండేవి. నివేదిత ఊళ్ళోలేని రోజుల్లో మాత్రం కుమారి బెట్ శ్రద్ధ తీసికొనేది. క్రిస్టిన్ గ్రీన్ స్టైడెల్ భారతదేశం వచ్చి 1903 మార్చిలో ఆమెను కలుసుకుంది.

పాఠశాలలో అప్పుడు నలభై అయిదుమంది విద్యార్థినులు ఉండేవారు. పుస్తకాలు చదివి విజ్ఞానంలోకి వస్తూన్న అధునాతన విధానాల్ని ప్రయోగాభ్యాసాలతో అనుబంధం చేసి వారికి నేర్పటం జరిగేది. వారి వారి వ్యక్తిత్వాలు పెంపొందజేసే ఉద్దేశంతో ఒక్కొక్క విద్యార్థిని యొక్క వివరాలు సేకరించి నివేదిత ప్రత్యేకంగా భద్రపరిచేది. ప్రక్కనే నివసిస్తున్న స్నేహవర్గంలో వాళ్ళయిన స్త్రీలకి మహిళా విభాగం ప్రారంభించారు. వారికి, స్వామి శారదానంద, స్వామి బోధానంద గీతాధ్యయనం చేసి, బోధనలు చేసేవారు. బోసు సోదరి లావణ్య ప్రోవబోసు చదవను వ్రాయను నేర్పేది. శారదామణి మాత సహచారిణి జోగీన్మా మత విషయాలు బోధించేది. క్రిస్టనీ కుట్టుపని అల్లికలు నేర్పేది. ఈ స్త్రీలందరూ గృహిణులుగా బాధ్యతలు ఉన్నవారే. ఈ విధంగా పాఠశాలకు హాజరయి పాల్గొనటంతో వారి మనోవికాస పరిధి త్వరత్వరగా విస్తరించింది.

చండీపురాణ కథని వినిపించటం పాఠశాల ఆవరణలో ఏర్పాటు చేశారు. నిరక్షరాస్యులయిన ఆ ప్రాంతం స్త్రీలు చాలామంది వచ్చారు. ఆ స్త్రీల పూర్వాచారాలు నమ్మకాలకి అనుగుణంగా మాత్రమే నివేదిత క్రిస్టనీలు తను కార్యకలాపాల్ని అమలులో పెట్టేవారు. ఆ స్త్రీ జనావళి భావ సంచలనం చూసి వారిద్దరూ ముగ్ధులై సంతృప్తి చెందటమే కాక స్టేట్స్ మన్ సంపాదకుడు రాట్‌క్లిఫ్ మహాశయుడు గొప్పగా అభినందించాడు. ఈ కార్యకలాపం విజయం చెందిందంటే ముఖ్యంగా క్రిస్టనీ వల్లనే అని నివేదిత హృదయపూర్వకంగా గుర్తించింది.

నివేదిత కుట్టుపని అల్లిక పని నేర్పేది. పై తరగతుల వారికి ఉపాధ్యాయ బోధనా పద్ధతుల్లో శిక్షణ ఇచ్చేది. రోజు పాఠశాల కార్యక్రమం ప్రారంభంలో ''వందే మాతరం'' ఆలాపించేవారు. అలంకరింపబడిన రామకృష్ణుల చిత్ర పటం ముందు నిత్యవిధిగా సంస్కృత భాషలోని ప్రార్థనలు చదివేవారు. పాఠశాలను సందర్శించటానికి శారదామణి మాత అప్పుడప్పుడు వచ్చేది. ఆమె రాక అద్భుతమైన స్ఫూర్తిని ఉత్తేజాన్ని కలిగించేది. పాఠశాల క్రమంగా విస్తరించటం వల్ల నివేదిత అదనపు వసతుల్ని కల్పించింది. అప్పటి ఆ పెరుగుదల, నిరాడంబరమయినదే అయినా, అది ఒక పవిత్రంగా అంకితమయిన ప్రారంభం

అని చెప్పవచ్చు). ఆ పాఠశాల కాలక్రమేణ తీర్చిదిద్దిన రామకృష్ణ శారదా మిషన్ సిస్టర్ నివేదిత బాలికా పాఠశాలగా విరాజిల్లింది.

తాను మాతృ దేశంగా ఎంపిక చేసికున్న భారతావని భవిష్యత్తు పటిష్టంగా సరి అయిన తీరుల్లో నిర్మాణం అవటానికి ఒ విశ్వ విద్యాలయాన్ని స్థాపించాలని ఆమె ఉద్దేశపడింది. ఆ విద్యాపీఠ సముదాయ ప్రాంగణంలో, పురుషలు స్త్రీలు, దేశీయులు విదేశీయులు, జాతీయ విద్యా విషయాల్లో సుశిక్షితులవుతారు. ఒక బాలల భవనం కూడా ఏర్పాటు అవుతుంది. దీన్లో విద్యార్థులు ఆరు నెలలు చదువు కొని మరి ఆరు నెలల పాటు విశాల భారతం లోకి తరలి వెళుతారు. అయితే ఈ కార్యక్రమాన్ని నివేదిత అమలు జరపలేకపోయింది. కాని 1903లో వివేకానంద భవనానికి చెందిన ఒక బాల బృందాన్ని స్వామి సదానంద పిండారి హిమనదికి విహార యాత్ర తీసుకెళ్ళారు. రవీంద్రనాథ్ టాగోర్ తన కుమారుడు రతీంద్రనాథ్ని ఆ యాత్రలో పాల్గొనటానికి పంపారు.

నివేదిత నిరాఘాటంగా ప్రసంగ రచనా వ్యాసంగంలో నిమగ్న అయి ఉండేది. కలకత్తాలోనూ ఇతర పట్టణాల్లోను ఏర్పాటయిన సభల్లో మాట్లాడేది. ప్రముఖ పత్రికలకి తనరచనలని ఎక్కువగా పంపేది.

పాట్నా లక్నో నగరాల్లో ఉపన్యాసాలివ్వటానికి నిశ్చయమయింది.

1904 జనవరి 9న బేలూర్ మఠంలో స్వామి వివేకానంద జన్మ దినోత్సవ వేడుకల్లో పాల్గొంది. వివేకాన్ద స్మారక భవనంలో వివేకానంద స్వామి గురించి ప్రసంగించింది.

అనంతరం పాట్నా వెళ్ళింది. స్వామి సదానంద స్వామి శంకరానంద ఆమెతో కూడ వెళ్ళారు. స్వామి శంకరానంద తన జపాన్ పర్యటన అనుభవాల్ని మాజిక్ లాంతరు ద్వారా స్త్రీల సభలో చూపించి అర్థం చెప్పారు. శ్రోతలెంతో అబ్బురపడ్డారు. ఆ తర్వాత నివేదిత మూడు ప్రసంగాలు చేసింది. చర్చా సభల్లో పాల్గొంది.

సరస్వతీ పూజరోజున, హిందూ బాలల సంఘం వారి వార్షికోత్సవాల సభలో మాట్లాడమని ఆమెను కోరారు. ప్రఖ్యాత చరిత్ర కారుడు ఆచార్య జదునాథ సర్కార్ సభాసదులకు ఆమెను ఉత్తేజ పరిచే వాక్కుల్లో పరిచయం చేశారు. బాలలు దేశ సేవకు అంకితమయి పౌరుష వంతులయిన ప్రౌఢులుగా ఉన్నత శ్రేణులనందుకో వలసిన ఆవశ్యతకను గురించి నివేదిత నొక్కి వక్కాణించింది. ఆమె ప్రసంగం వారి నెంతో ఉత్సాహపరిచింది. ''భారత దేశంలో విద్యావిషయక సమస్యలు'' అన్న విషయం గురించి మాట్లాడుతూ భారత స్త్రీ జనా వళిలో నిద్రాణమై ఉన్న మానవీయ భౌతిక శక్తిని వెలికి తీసి

విద్యాబోధ ద్వారా విశిష్ట పరచవలసిన ఆవశ్యకతను ఆమె నిరూపించింది. విద్యార్థుల స్మృతి పథంలో భారతదేశ గమ్యం స్వాతంత్ర్యం అని ఎప్పుడూ మెదలుతూ ఉండాలని వారిని ఉత్తేజ పరిచింది. బాలురకు విద్యాబోధ జాతీయతా దృక్పథపరంగా ఉంటుంది. బాలికలకు విద్యాబోధ, సామాజిక అవగాహన, పౌరసత్వతా దృక్పథ పరంగా ఉంటుంది. ఆమె మూడవ ప్రసంగంలో స్వామి వివేకానందుని ''మత ప్రచారకా ప్రస్థానం'' గురించి మాట్లాడింది. ఆ ప్రంగాలు ప్రజానీకయంలో ఆమోఘమయిన సంచలనం కలుగచేశాయి. చెరగని ముద్రవేశాయి.

ఆనాడు కాలినడకన తిరుగుతూ బుద్ధ దేవులు పవిత్రం చేసిన విహార స్థలాల్ని నేడామె సందర్శించింది. బుద్ధుని జీవితము, ఆయన బోధలు, పసితనం నుంచి తన్నెంతో ప్రభావితం చేశాయి. ఆతర్వాత స్వామి వివేకానందులు వివరించిన విశేషాలు ముగ్గురాల్ని చేసి బుద్ధ దేవునిపై పూజ్య గౌరవ భావాన్ని ఇనుమడింపచేశాయి. బుద్ధ భగవానునికి తన్నంకితం చేసి కొన్ని కార్యక్రమం అనంతరం ప్రతిమ పాదాల వద్ద పుష్ప చయాలనర్పించింది. పురాతన పాటలీపుత్ర నివేశన స్థలాల మీద నిర్మాణం అయిన బంకిపూర్ నగరాన్నించి రాజ్‌గిర్ వెళ్ళింది. రాజ్‌గిర్ కొండ ప్రాంతాల్లో తోటి వారితో కాలినడకన తిరుగుతూ తిల్యా మీదుగా బోధగయు చేరుకొంది. ఆ పారవశ్యంలో తిరుగుంతూ తన్ను తానే మరిచిపోయింది. అక్కడ ఉన్న దేవాలయం విషయమై బౌద్ధులకి హిందువులకి మధ్య యాజమాన్య వివాదంలో కల్పించుకొంది. బౌద్ధులు హిందువులకు ఇతరులయిన సముదాయలు వారు కాదని వారి యిద్దరి మధ్య ఏతగాదాలు లేవని ప్రసంగాల్లో వారిని వారించి ప్రత్యేక ప్రకటన చేసింది. బోధగయలో చరిత్రాధ్యయున పాఠశాలను నెలకొల్పటానికి సంకల్పించింది కాని అది నెరవేరలేదు. బోధ్‌గయ చూసిన తర్వాత, బెనారెస్ సారనాథ్ దర్శించి లక్నో చేరుకొంది. లక్నోలో ఆమె విస్తృతంగా పనులు నిర్వహించింది. ఆగోజాల్లో హిందూముస్లిమ్ సఖ్యత సమస్యలు ప్రజావళిని వత్తిడికి లోనుచేసి చికాకు పరుస్తున్నాయి. వాటి పరిష్కార మార్గాల కోసరం నివేదిత శాయశక్తులా శ్రమించింది.

కలకత్తా తిరిగి వచ్చిన తర్వాత ''బ్రహ్మచర్యము వైవాహిక వ్యవస్థ'', ''బోధ్ గయు'', ''శక్త్యుత్పాదక మతము'' గురించి ప్రసంగాలు చేసింది. హిందూ వివాహ తతంగం సమాజపరంగా సంస్థాపింపబడిన ఒక ధర్మ నిబంధనే కాక, మత ధర్మాచరణ సంబంధమయిన గొప్ప వ్యవస్థ అని తన క్లుప్త ప్రసంగంలో నిరూపించి శ్రోతల్ని సమ్మోహితుల్ని చేసింది.

''శక్త్యుత్పాదక మతము'' గురించి మాట్లాడుతూ భారతదేశంలో బ్రహ్మ జిజ్ఞాసువులై మత పురోగతికై వారు అవలంబించిన కార్యకలాపాలు ఎంత శక్తి వంతంగా ప్రజల్లో సంచలనం కలుగచేసేవో ఆమె విస్తరించి చెప్పింది. కలకత్తా మద్రాసా వారి ఆధ్వర్యాన ''ఆసియాలో ఇస్లామ్'' గురించి మాట్లాడింది. ఆ సభలో శ్రోతలు ఎక్కువమంది ముస్లిమ్‌లే. ఆ ప్రసంగంలో ఆనాటి భారతీయ ముస్లిమ్‌ల ధర్మాలు విధులు ఏమిటి అని ప్రశ్నించింది. అరేబియాతో తమ సంబంధాల గురించి పదే పదే మననం చేసుకోవటం కాదని నొక్కి వక్కాణించింది. అట్లా మననం చేసికో నవసరం లేనేలేదని చెప్పింది. అరేబియా దేశీయ పరమైన రక్త సంబంధంగా దర్మ శక్తులు ఎట్లాగా తమ జీవనాళాల్లో ప్రవహిస్తోనే ఉన్నాయి. అట్లాగ వారితో రక్త సంబంధం పెట్టుకో నవసరం లేనేలేదు. ఆ సంబంధ ధర్మ శక్తుల్ని, తమ పూర్వ తరాల వారే, నమ్మకంతో శ్రమించి, ఓరిమితో సాధించి, రూపొందించి పరంపరగా తమకందించారు. ఇదికాదు వారు అవలంబించ వలసిన ఆనాటి ధర్మం. తమ ధర్మాల్ని, విధుల్ని, భావాల్ని, భారతదేశంతోనే ముడి పెట్టుకొని, భారత జాతీయతా దృక్పథంతో మెలగి, శక్తితో సాద్ధర్మాలను, విధులను నిర్వహించి, భావాలను సిద్ధించుకోవాలి. రక్తసంబంధంగా అయితే ఏమి, మాతృదేశంగా ఎంపిక చేసుకొన్నందు వల్ల అయితే ఏమి, ఆదరంతో ఆతిధ్యం పొందినందు వల్ల నయితే ఏమి, ముస్లిమ్‌లు ఈ గడ్డపై పుట్టి భారతీయతను సంతరించుకొని బారతీయ మహోన్నత ఆత్మ శక్తికి పూర్తి వారసులయారు'' అని ఎలుగెత్తి చాటి చెప్పింది.

ముస్లిమ్‌లు భారత జాతీయ జీవన స్రంవతిలో లీనమై సమగ్రంగా తాదాప్యం చెందుట యొక్కటే వారి ఉన్నతి మార్గమని 1904 సంవత్సరంలోనే నివేదిత సూచించటం గమనార్హమయిన విషయం. ఆ తరువాత సంవత్సరాల్లో హిందూ ముస్లిమ్ సమస్యా పరిష్కార ప్రసక్తి ఎడతెగకుండా రాజకీయ సంక్షోభాన్ని పదే పదే సృష్టిస్తూనే ఉండేది కదా!

బెనారస్‌లో ఉపన్యాసాల కలాపం మార్చి నెలలో చేపట్టింది. శ్రీమతి సేవియర్స్ ఆహ్వానం మీద క్రిస్టిన్‌తో కూడ నివేదిత మాయావతి వెళ్ళింది. డాక్టరు బోసు, బోసు సతి బోసు సోదరి కూడ వారితో ఉన్నారు. (డాక్టరు బోసు 1904 మే 17న ''ప్లాంట్ రెస్పాన్స్'' అన్న గ్రంథం రాయటానికి మొదలు పెట్టారు.)

కలకత్తాలో చాలా సమావేశాల్లో పాల్గొంది. ''భారతీయ లలిత కళాలహరి'' మీద ఆమె చేసిన ప్రసంగాలు ప్రత్యేకంగా చెప్పుకోతగ్గవి. భారతీయ లలిత కళలపై ఆమెకున్న అవగాహన, ఆమె చేసిన వ్యాఖ్యానాలు అభివర్ణనలు,

తరువాతి తరాలవారు పూర్తిగా ఫలం సిద్ధించుకోవటానికి మార్గదర్శకాలై, తామెంచుకొన్న పంథాలను సుగమం చేసి, భారతీయ కళాత్మక జీవనాన్ని పునరుద్ధీ పింప చేశాయి. విహార యాత్రా సమయాల్లో, నిర్విరామ కృషి పూర్వకంగా, ఆమె చేసిన ప్రసంగాలు, అభిభాషణలు, భారత సామాన్య ప్రజానీకంలో ఆత్మ చైతన్యం కలిగించి వారి స్వీయ అస్తిత్వాన్ని పునరుద్ధీపింప చేశాయి.

అక్టోబరు మాసంలో బోధ్‌గయకు యాత్ర వెళ్ళినప్పుడు, బృంద సభ్యుల దృష్ట్యా ఆ సమావేశం ఒక విశిష్టతను సంతరించుకొంది. డాక్టరు జగదీశ చంద్రబోసు, రవీంద్రనాథ టాగూర్, స్వామి శంకరానంద. జదునాథ సర్కార్, సుప్రసిద్ధ పాట్నా నగర పౌరుడూ, మధురానాద్ సిన్హా ఆ బృందంలో ఉన్నారు. వారందరూ నివేదిత సాన్నిధ్యాన, ఆమెతో కలిసి, ఆకార్య కలాపాల్లో పాల్గొని భారతీయ నైతిక, మానసిక శక్తియుత వారసత్వాన్ని దోసిళ్ళతో అందుకొన్నారు. ప్రతిరోజూ నివేదిత వారన్ మహాశయుని ''బుధిజమ్ ఇన్ ట్రాన్స్ లేషన్'' గ్రంథ భాగాల్ని, ఎడ్విన్ ఆర్నాల్డ్ ''లైట్ అఫ్ ఏషియా'' పుస్తక భాగాలను చదివి వినిపించేది. తమ పఠనలతోను, గీతాలాపనతోను, రవీంద్ర నాథటాగూరు బృంద సభ్యుల్ని ముగ్ధుల్ని చేసి పరవశింప చేసేవారు.

వారందరూ పగటి సమయాల్లో దేవాలయ ప్రదేశాల్లో వాహ్యాళిగా నడిచే వారు. లేక దగ్గర గ్రామాల్ని సందర్శించేవారు. సాయం సమయాల్లో బోధి వృ క్షం క్రింద కూర్చొని దైవ చింతనలో నిమగ్నులయే వారు. ఒక బీద జపాన్ బెస్తవాని భక్తి గీతాలాపనలు ఆ గంభీర వాతావరణాన్ని ఇనుమడించాయి.

ఒక సాయం సమయాన బౌద్ధమత ప్రాబల్య యుగమునాటి విశేషాల్ని నివేదిత వివరించింది. ఆమె సహచరులందరు ఆమె వివరణల్ని విని ఆయుగము నాటి వైజ్ఞానిక స్రవంతిలో మునిగి అంతర్లీనమయారు. మరొక సాయం సమయాన బుద్ధుని కాలంలోనే పేరొందిన బుద్ధుని పత్ని సుజాత నివసించిన ప్రాంతం ఊర్వేలూరు భవనం దర్శించినప్పుడు, సుజాత జీవిత ప్రాధాన్యాన్ని నివేదిత వారికి వివరించింది. భారత సామాజిక వ్యవస్థ దేశంలో వ్యర్థులయిన లక్షలాది సాధువుల్ని ఆవిర్భవింప చేసేదనీ, కాని ఆ ఆవిర్భావం వల్ల ఉపయోగం లేకపోలేదనీ, కతిపయసమయాల్లో ప్రయోజనకారి అయి, రామకృష్ణ వంటి మహాపురుషులు ఉద్భవించారనీ వివేకానంద స్వామి తనకు చెప్పటం గుర్తు చేసుకొని, నివేదిత బృంద సభ్యులకు చెప్పింది. ఇంకా అభిభాషిస్తూ తరాలు తరాలుగా అంతర్లీనమై ధారావాహికంగా ప్రవహిస్తున్న భారత జాతీయతా జీవన స్రవంతిలోని విశేష శక్తుల్ని సాకర్యంగా ఉదహరించింది.

ఆ కృషి కలాపాలు అతనితో ఆయిపోలేదు. భారత జనావళి స్పృహతో ఆత్మ చైతన్యం కలిగించు కొని వారి వారి అస్తిత్వాన్ని పునరుద్ధీపింప చేసుకోనే యుక్త జ్ఞానం వారికింకా కలిగినట్టు కనపడదు. సర్వ మానవ జీవన స్రంవతిలోను, నాగరికతా ప్రపంచంలోను, పోగొట్టుకొన్న తమ స్థానాన్ని కృషితో తిరిగి పొందటానికి వారింకా సమాయత్తంగా లేరు. ఈ భావాలు ఆమెలో చెలరేగడం వల్ల అక్కడ నుంచి బయలు దేరే ముందు ఆమె స్థైర్యం చిక్కబట్టుకోలేక పోయింది. భారత దేశ సామాన్య ప్రజలను నిద్రాణం నుంచి మేలుకొలిపే కలాపంలో, తాను తన సహచరులు చేసిన కృషి విఫలమైనదన్న మనోభావం నివేదిత నెంతగానో ఉద్వేగ పరిచింది. ఆ ఉద్వేగం ప్రభావం వల్లనే ఆమె జీవితం ఒక నూతన దిశగా సాహసోపేతమయిన అవతారికగా పరిణమించింది. ఆ పరిణామమే రాజకీయ స్వాతంత్ర్య సముపార్జన కోసరం ఆమెకూడ నడుము కట్టి శాయశక్తుల పాల్గొనటానికి ప్రాతిపదిక అయింది.

# 6

# స్వాతంత్ర్య సముపార్జన కోసరం

రామకృష్ణ మఠ నియమావళి ప్రకారం సభ్యులెవరూ రాజకీయాల్లో పాల్గొన కూడదు. కనక నివేదిత తాను స్వతంత్రంగా ఉండ దలిచింది. ఏదో యధాలాపంగా కాక, ఉత్తరోత్ర తన కార్యకలాపాలకి మఠ సంబంధ మేమీ అడ్డురాకుండా పూర్తి స్వాతంత్ర్యం ఉండేటట్టు చూసుకొంది. భారతీయులు తమ హక్కులు ఏవో పూర్తిగా అకళింపు చేసుకొంటున్నారు. వాటిని ఏ విధంగా కోల్పోతున్నారో బుద్ధి ఎరిగి గ్రహించటం 20వ శతాబ్దపు ప్రధమ భాగంలోనే వారు నూతనోత్సాహ స్ఫూర్తితో ఆత్మ చైతన్య వంతులవటం క్రమక్రమంగా వెల్లడవుతోంది. రాబోయే ఏబది సంవత్సరాల కాలంలో వారి ఏకైక ఆరాధ్య దైవం భారత మాత యేనని, ఆ తర్వాతనే ఇతర దేవుళ్ళని ఆరాధించటం జరుగుతుందనీ వివేకానందులు ఏనాడో చెప్పారు. అప్పుడప్పుడే మొలకలెత్తున్న జాతీయోద్యమానికి కలకత్తా ఒక ముఖ్య క్షేత్రంగా వెలిసింది. ఆ నగరంలోనే నివేదిత నివాసం. స్వామీజీ ఆదేశాలకి, ఉద్యమ ప్రగతికి అనుకూలంగా తన జీవితాన్ని మలచుకొంటూ నివేదత జాతీయతా భావాల్లో నిండుగా తాదాత్యం చెందింది.

దానికి తగ్గట్టుగా కొన్ని సంఘటనలు ఒక దాని తర్వాత ఒకటి జరగటం ప్రారంభమయ్యాయి. ఆంగ్లేయ పాలకులు 1902లో ఢిల్లీలో ఒక పెద్ద దర్బారు ఏర్పాటు చేశారు. అది భారతీయ నాయకులకు అనుమానాస్పదంగా కనపడింది. అంతకు ముందు అహమ్మదాబాదులో సభలు జరిపి ఈ దర్బారు నిర్వహణకి అకారణంగా చాలాదనం దుర్వ్యయం అవుతోందని వారు ఖండించారు. భారత సంస్థానాధిపతుల ఆత్మ గౌరవానికి ఆదర్బారు ఏ రీతిన భంగపాటు కలుగజేసిందో నివేదితకు వార్తలందాయి. ఆ దర్బారు విశేషాలు భారతీయులపై ఏ విధంగా ప్రతి పరిణామాలు కలుగ జేసిందో, వారి రాజకీయ దృష్టి, శక్తి ఎట్లా గంభీరతను చెందాయో స్ఫూర్తితో గమనించి వెల్లడించింది.

అప్పటి వైస్రాయి కర్జన్ ప్రభువు కలకత్తా విశ్వవిద్యాలయాన్ని పూర్తి ఆంగ్లేయ పాలిత సంస్థగా మార్పు చేయటానికి సన్నాగాలు పన్నుతున్నాడని

తెలిసిన భారతీయులు ఆ ప్రయత్నాల్ని తీవ్రంగా గర్హించారు. నివేదిత కూడ నిశితంగా విమర్శించింది. విద్యావిధానాల మీద ఆమె చేసిన ప్రసంగాల్లో, భారతీయమే అయిన విధానాన్ని భారతీయులు తామే రూపొందించుకోవాలని చాలాసార్లు ఉద్బోధించింది. అది ప్రాప్తించుకోవటానికి మార్గాల్ని, పద్ధతుల్ని వారే అన్వేషించుకోవాలని ఆమె వారికి సలహాలనిచ్చింది. ఈ ప్రబోధాలు ప్రజలను ప్రోత్సాహ పరచి వారి మనస్సులపై చెరగని ముద్ర వేశాయి. వారిలో రాజకీయ స్ఫూర్తి. రసార్ద్రత పెంపొందుతున్న ఫలితంగా జాతీయోద్యమ కార్యక్రమాన్ని దక్షతతో నిర్వహించగల యువకులకు శిక్షణ ఇచ్చి సంఘటిత పరచటానికి కొన్ని సమితులు స్థాపితం అయ్యాయి. సతీష్ చంద్ర ముఖర్జీ ఏర్పాటు చేసిన డాన్ సొసైటీ, సతీష్ చంద్రబోసు, బారిష్టరు మిత్ర దక్షతన ఏర్పాటయిన అనుశీలన సమితి రెండూ ముఖ్యమయినవి. యంగ్ మెన్స్ హిందూ యూనియన్ కమిటీ, గీతా సొసైటీ, వివేకానంద సొసైటీ అనునవి మరికొన్ని సమితులు.

ఈ అన్ని సమితుల్లోను నివేదిత భాగస్వామినిగా ఉండేది. వాటితో సంబంధాలు ఏర్పరచుకొని సభ్యులకి గీత మీద బోధలు, వివేకానందుని సందేశం హిందూమతం గురించి ప్రసంగాలు చేసి వారిని ఉత్తేజ పరిచేది. ''జాతి'', ''జాతీయత'', ''జాతీయతా స్ఫూర్తి, ఆత్మ చైతన్యము'' గురించి మాట్లాడేది. ఈ అభిభాషణల ద్వారా ఆమె ఒక గొప్ప జాతీయ ప్రబోధకురాలిగా అలరారింది. ఆమె అందించిన ఉత్తేజకర బావాల పరిణామంగా, ఆటల పోటీలు, పఠనలు, ఉపన్యాస పోటీలు, యువకుల శిక్షణ, సృజనాత్మక కార్యక్రమాల్లో ఒక భాగం అయ్యాయి. వారందరికి ఆమె మార్గ దర్శకురాలయినగురువు. వారి వారి అర్హతల్ని గుర్తించి వివేకానంద పతకాలను వారికి బహూకరించేది.

డాన్ సొసైటీ జాతీయ విద్యావిషయక సమితిని స్థాపించి, సమితి ఆధ్వర్యాన ఒక జాతీయ కళాశాలను రూపొందించింది. బ్రోజేంద్ర నాథ్ సీల్, రవీంద్ర నాథ్ టాగూర్, సురేంద్ర నాథ్ బెనర్జీ. బిపిన్ చంద్ర పాల్, అబ్దుల్ రసూల్. ప్రొఫెసరు బినయు సర్కార్ ప్రభృతులకు నివేదిత సహకారమందించి భాగస్వామినిగా అన్నికార్య రంగాల్లోను పాల్గొనేది.

బినయుసర్కార్ మహాశయుడే ఆతర్వాత ప్రఖ్యాత అర్థిక వేత్తగా నిర్మాణాత్మక దృక్పథంకల మేధావిగా పెంపొందాడు. అంతేకాక డాన్ సొసైటీకై నివేదిత చేసిన కృషిని. ఆ కృషి ఫలితంగా సభ్యులు ఏవిధంగా ప్రభావితమయారో తెలిపే వివరాలు సేకరించి పొందుపరిచాడు.

రాజకీయ కలాపాల్ని అధికారికంగా చేపట్టిన అనుశీలన సమితిలో సి. ఆర్. దాస్, రాస్ బిహారి ఘోష్, సిస్టర్ నివేదిత ఇంకా, ఇతర ప్రముఖులు పాల్గొనేవారు

యువతీ యువకులకు శారీరక, మానసిక, నైతిక క్రమ శిక్షణ గరపటం ఈ సమితుల లక్ష్యం, శారీరకంగా వికాస సిద్ధికై వ్యాయామ మండలులు, మహా పురుషుల జీవిత విశేషాలు, స్వాతంత్ర్య సిద్ధికై అమలు జరుపుకుంటూన్న ఇతర దేశ ఉద్యమ రీతులు. రాజకీయ ఆర్థికాభ్యున్నతికై వనరుల్ని ఏర్పాటు చేసుకోవలసిన తీరులు తెన్నులు మొదలయిన విషయాలమీద చర్చలు జరుపుకోవటానికి, మానసిక వికాస సిద్ధికై అధ్యయన కేంద్రాలు రామాయణం, బారతం, భగవద్గీత, చండి, వివేకానందుని రచనలు పఠించటం, స్వామి సదానంద, సత్యాచరన్ శాస్త్రి, బ్రహ్మబంధబ్ ఉపాధ్యాయ ప్రబృతులు మత విషయకంగా ఆచరణలో పెట్టవలసిన విధానాలలో నైతిక శిక్షణ యిచ్చే బోధనా మందిరాలు, వీటి ఏర్పాటు మొదలయినవి ఈ సమితుల ముఖ్య క్రియాత్మక కార్య కలాపాలు.

ఉద్యమం ఒక వినూత్న స్వరూపాన్ని సంతరించుకొంటున్న ఆ తరుణంలో శ్రీ అరబిందోఘోష్ మహాశయులు (అప్పుడాయన బరోడాలో ఉన్నారు) జాతీయ స్వాతంత్ర్యతాసిద్ధికై, ఈ నిరంతర కృషిని విప్లవాత్మక పంథాలో నడిపించటానికి, దానిని పునర్వ్యవస్థీకరించాలని సలహాలిస్తూ జితేంద్రనాథ బెనర్జీని రహస్యంగా రాయబారం పంపారు. ఆసలహాల పర్యవసానంగా, శరీర వ్యాయామ శిక్ష సంబంధంగాను, ఉద్యమకార్యశీల కలాపాల్లోను మార్పులను, విస్పష్టంగా గుర్తించి పునర్వ్యవస్థీకరణ చేయవలసిన ఆవశ్యకత ఏర్పడింది. అయిదుగురు కార్యకర్తలు ఉన్న కేంద్ర అధిష్ఠాన సమితి నొకదానిని నియమించి, నివేదితను దానిలో ఒక సభ్యురాలినిగా చేసి ఈ సమితులన్నింటిని ఒకే ఛత్రం క్రిందికి తీసుకొని రావటానికై శ్రీ అరబిందో ప్రయత్నించారు. కాని ఆయన బరోదాలో ఉండిపోవటం వల్ల ఆ ఉద్దేశం ఫలించలేదు. అనుశీలన సమితి మాత్రము అరబిందో సూచనల ప్రకారము సరిదిద్దుకొని వృద్ధి పొందింది. ఆ సమితి కృషిలో నివేదిత ఎక్కువగా పాల్గొంది.

స్వాతంత్ర్య సిద్ధికై విప్లవాత్మక విధానాల్ని అవలంబించ వలసిన ఆవశ్యకత ఎంతైనా ఉందని నివేదిత దృఢ విశ్వాసం. తాను కాళీ పూజా పరాయణి. లక్ష్య సిద్ధికై హింసాయుత మార్గాలు చేపట్టటం తనకి ఏవగింపు కాదు. అయితే ఏం, కార్యకలాపాల్ని ఇతర పంథాల్లో సాగిస్తున్న దేశంలోని వేర్వేరు రాజకీయ ఉద్యమాలతో నిరాఘాటంగా సన్నిహిత సంబంధాల్ని పెట్టుకొంటూనే ఉంది. అతివాద నాయకుడైన బిపిన్ చంద్రపాల్ ఆమె నమ్మిన స్నేహితుడు. ఆయన సంపాదకీయ పత్రిక ''న్యూ ఇండియా''కు రచనల్ని పంపించేది. అలాగే మితవాద నాయకుడయిన గోపాల కృష్ణ గోఖలే ఆమెకు ఆప్త స్నేహితుడు. అట్లాగే ఆర్. సి. దత్తు మహాశయుడు కూడా. భారత ప్రజల ఆర్థిక సమస్యలకి పరిష్కార

మార్గాల్ని అన్వేషించటంలో ఆర్. సి. దత్తు చాలాలోతుగా, ఆలోచించేవారు.

ఆమె ఇలా అంది ''భారతావని నలుదెసలా లోతుగా, లోతుగా, ఇంకా లోతుగా, వస్తువుల విషయాల వాటి అసలైన చేవని అన్వేషించటంలో, నేను ఏర్పరచుకొన్న పనిముట్ల ప్రయోగం ద్వారా, ఎంత బాహాటంగా పోగలిగితే అంత బాహాటంగా నా పంథాలో ఒంటరిగా శక్తియుతంగా నేను ప్రయాణించ గలుగుదును గాక! ఆ పనిముట్ల ప్రయోగ ప్రయోజనం ఫలితంగా, నా కార్యకలాపాల శక్తి, దాగి ఉన్న ఆవాసంలోంచి నిశ్శబ్ద ఆదేశాలయిన వార్ధ్వని రూపంలో ఉన్నా ఉండవచ్చు! లేక, నా వ్యక్తిత్వ అస్తిత్వాన్నించి, నా పృథక్త్వాన్నించి, పెద్ద నగరాల్లో సునాయాసంగా, తిరుగుతూ, ప్రసారం అయ్యే నాధీశక్తి కోపోద్రేక భావ రూపంలో ఉన్నా ఉండవచ్చు! ఎలా ఉన్నా, నేను ఏమాత్రం లక్ష్య పెట్టను. నాకుడి చేతికి తోడు నీడై కార్య దీక్షతతో బలోపేతంగా నన్ను కార్యోన్ముఖం చేయించే దైవశక్తి పై కుబుకుతున్న నా భావోద్రేక శక్తిని, పాశ్చాత్యశుష్క వస్తువుల పట్ల విషయాసక్తిని నాలో కలిగించి నన్ను నిరర్థకం చేయకుండును గాక! కాని అటులే సంభవించ నున్నట్టయితే నేను ఆత్మ హత్య చేసికొనే పూనిక నాలో కలుగు గాక! నాకు సంబంధించినంత వరకు నా ఆరంభ వస్తువు భారతావని, నా ధ్యేయ విషయం భారతావని, నేనాకాక్షించు నా భారతావని పశ్చిమం వైపు దృక్కులు సారించేటట్టయితే, అట్లే అగుగాక! అని ఘోషించింది.

నివేదిత బారత జాతీయోద్యమంలో తాదాత్మ్యం చెంది ఏ విధంగా క్రమ క్రమంగా పురోగమించిందో తెలిసికోవటం చాలా ఆసక్తి దాయకంగా ఉంటుంది. చాలా ఆదిలోనే 1905 ఫిబ్రవరి 21న వైస్‌రాయి కర్జన్ ప్రభువు కలకత్తా విశ్వ విద్యాలయం ప్రాంగణంలో స్నాతకోపన్యాసం యిస్తూ భారతీయ మనోబావాల్ని అవమాన పరిచే విధంగా ఒక అభిభాషణ చేశాడు. నిజాయితీతో మెలగటం విషయంలో ప్రాచ్య దేశస్థులు, పాశ్చాత్యుల కంటె, తక్కువ స్థాయీ ప్రమాణంలో ఉంటారని, అట్లా చేయటానికి ఏమాత్రం వెనకాడరనీ అన్నాడు. బారత ప్రజల వ్యక్తి శీలాన్ని శంకిస్తూ అసమర్థ నీయమయిన ఆ అపవాదు పట్ల ఆసభ నలంకరించిన నాయకులెవ్వరు అప్పటికప్పుడు అసమ్మతిని ప్రకటించటానికి ధైర్యం చేయలేక పోయారు. కాని ఆ ప్రజానాయకులందరూ ఆ తర్వాత ఆవిషయమయి బాగా చర్చించారు. ఆ చర్చల్లో నివేదిత పాల్గొంది.

కొరియా వెళ్ళిన తరుణంలో ఈ కర్జన్ ప్రభువే తాను చేసుకోబోయే వివాహం దృష్ట్యా ఇంగ్లండు రాణికి తనెంత దగ్గర బంధువు కాబోతున్నాడో కొరియన్ రాజ్యాంగ శాఖ అధ్యక్షుని సమక్షంలో వారికే విధంగా తప్పుడు

అభిప్రాయం కలిగించాడో ''ప్రాబ్లమ్స్ అఫ్ ది యీస్ట్'' గ్రంథ బాగాన్ని యథాతథంగా వెలికి తీసి ఆమరునాడు నివేదితపత్రికల్లో ప్రకటించింది. యదార్థానికి ఇటువంటి వివాహ విషయ ప్రసక్తి ఎప్పుడూ రానేలేదు. నిజాయితీ లేక పోవటం భారతీయుల నడవడిలో ఎప్పుడూ సర్వసాధారణమయిన ఒక విలక్షణం అని ధైర్యంగా ఒక అబద్ధ ప్రలాపన చేసిన వ్యక్తి నిజాయితీ గురించి అసలు విషయం ఈ ప్రకటన మూలంగా తెలిసి ప్రజల్లో గొప్ప సంచనలం కలిగింది.

ఈ ఉదంతం ఇంత బహిరంగం అవటానికి బాధ్యులెవ్వరో మాత్రం ప్రజలకు తెలియదు. అసలు నిజం తెలిసున్న వాళ్ళల్లో జగదేశ చంద్రబోసు ఒకరు. ఆయన నివేదితకు ఒక ఉత్తరం రాస్తూ ''కారు మబ్బుల వెనక పరోక్షంగా ఉన్న పిడుగు'' అని ఆమెని వర్ణించారు. ఆ ఉదంతం అంతటితో సమసి పోకుండా గుర్తింపు చేస్తూ, నివేదిత, స్టేట్స్ మన్ పత్రికా సంపాదకునికి ఒక బహిరంగ లేఖ పంపింది. ''భారత దేశం మనకేమినేర్పకలదో'' అన్న గ్రంథంలో, ''హిందూవుల నిజాయితీ పరమయిన శీలం'' అన్న శీర్షికతో రెండవ ప్రకరణలో మాక్స్‌మ్యూలర్ మహాశయుడు ఏమి రాశాడో నివేదిత ఆలేఖలో ఉటంకించింది. కాని కర్జన్ ప్రభువు చేసిన ఆ అవమానకర ప్రకటనకు వ్యతిరేకంగా తమ అసమ్మతిని తక్షణమే ఏదో విధంగా ప్రకటించకుండా విద్యార్థి శ్రోతలు ఎలా ఉపేక్షించారో ఆమె ఆలేఖలో ఎత్తి చూపించి వారిని గట్టిగా మందలించింది. ఆ తరువాత వెలువడిన ''ప్రాబ్లమ్స్ ఆఫ్ ది యీస్ట్'' గ్రంథంలో కర్జన్ కొరియా ప్రలాపం అంతా తీసిపారేసి ముద్రణలు చేశారు. కర్జన్ ప్రభువు నిందాత్మక అపవాదాన్ని ఖండిస్తూ కలకత్తా టౌన్ హాలులో 1905 మార్చిలో గొప్ప బహిరంగ సభ జరిగింది.

ఆ తర్వాత నివేదితకు మెదడు జ్వరం వచ్చింది. జబ్బు నుంచి కోలుకొన్న అనంతరం బోస్ దంపతులతో కలిసి మార్పు కోసరం ఆమె డార్జిలింగ్ వెళ్ళి జూలై 3న తిరిగి వచ్చింది.

భారతదేశ చరిత్ర పురోగతిలోనే పెద్ద మార్పు తీసుకొచ్చి, భారత జాతీయ స్వాతంత్ర్య ఉద్యమంలో భాగస్వామినిగా చేసి, ఉద్యమ కార్యకలాపాల్లో నివేదితను పూర్తిగా పాల్గొనేట్లు చేసిన ఒక సంఘటన ఆతర్వాత జరిగింది.

బెంగాల్ రాష్ట్రాన్ని విభజిస్తూ బ్రిటిష్ ప్రభుత్వం తీసుకొన్న నిర్ణయం ప్రకటించబడగానే ఉద్రిక్తమయిన సంచలనం కలిగింది. ఆగష్టు 7న కలకత్తా టౌన్ హాలులో జరిగిన గొప్ప అభిశంశన సభలో నివేదిత మాట్లాడింది. విభజనకు తమ సంపూర్ణ వ్యతిరేకతను తెలియజేసే సంకేత చిహ్నంగా, బెంగాల్ ఐక్యతను సూచిస్తూ ''ఫెడరేషన్ హాల్'' అన్న పేరుతో ఒక పెద్ద భవనాన్ని నిర్మాణం

చేయాలని, ఆ తర్వాత జరిగిన మహాసభలో, ఉద్యమంలో ప్రముఖ పాత్ర వహిస్తున్న సురేంద్రనాథ బెనర్జీ ప్రతిపాదించారు.

''ఎ నేషన్ ఇన్ ది మేకింగ్'' అనే పేరున తన స్వీయ చరిత్ర వ్రాసిన గ్రంథంలో సురేంద్ర నాథ బెనర్జీ ఈ ఉద్యమానికి నివేదిత ఆసరా యిచ్చి ఆశీర్వదించిందని రాశారు. ''భారత దేశ సేవకు అంకితమయి తన జీవిత సర్వస్వాన్ని ధారపోసిన పరోపకారిణి అయిన మహా మహిళ'' అని నివేదితను సురేంద్ర నాథ్ బెనర్జీ ఆ గ్రంథంలో వర్ణించారు.

స్వదేశీ ఉద్యమాన్ని విదేశ వస్తు బహిష్కరణని కూడ నివేదిత బలపరచి తన పూర్తి ఆసరా అందించేది. ఈ బహిష్కరణ ఉద్యమం గురించి ఆమె ఇలా వ్రాసింది. ''మొదటి నుంచి చివరి దాక అన్ని విధాల, ఈ స్వదేశీ ఉద్యమంలో పౌరుష ధైర్యసాహసాలు, స్వయం సహాయం అని ఈ రెంటిని బహిరంగంగా ప్రకటించి చాటి చెప్పే ధ్వని మారుమోగుతుది. ఈ ఉద్యమంలో నీచంగా వినయం ప్రదర్శిస్తూ రాయితీలు అర్థించే ప్రసక్తే లేదు. భారత దేశంలో గోహత్య చేసిన పాతకుడిని ఏవిధంగా పరిగణిస్తారో, విదేశీయుల వద్దనుంచి కొనుగోలు చేయటం అంత మహా పాతకంగాను భావించే రోజు ముమ్ముందు రానుంది. నిస్సంకోచంగా ఈ రెండు అపరాధాలు నైతికంగా సమతుల్యమైనవి. అభిన్న మైనవి. స్వదేశీ ప్రతిజ్ఞ తీసుకోవటం ద్వారా, భారతీయులకు తమ నిజసహజ స్థైర్యాన్ని ఘనతను వ్యక్త పరిచే సదవకాశం. ఇటువంటి విషయ సందర్భాల్లోనే వారికి దొరుకుతుంది.'' అని నివేదిత స్వదేశీ ఉద్యమం గురించి వివరించింది.

ఉద్యమం మీద తీవ్రమయిన దెబ్బ కొట్టే ఉద్దేశంతో ప్రభుత్వం ప్రతిక్రియలుగా కొన్ని ప్రకటనలు జారీ చేస్తూ, ''వందేమాతరం'' గీతం ఆలాపించటం నిషేధించి, ''వందేమాతరం'' అని నినాదం కూడ చేయకూడదని ఆంక్షలు విధించారు. అక్టోబరు 16వ తారీఖున బెంగాలీ విభజన అమలులోకి వచ్చింది. కాంగ్రెసు వాదులు ఆరోజుని జాతీయసంతాప దినంగా పాటించారు. ఆనాడు అనుభవజ్ఞులయిన వృద్ధనాయకులు ఆనంద మోహన బోస్ ''ఫెడరేషన్ హాల్'' ఆధార శిలవేసి శంఖుస్థాపన కార్యక్రమం జరిపారు. చాలా సుస్తీగా ఉండటం వల్ల ఆయన ప్రసంగాన్ని సురేంద్ర నాథ్ బెనర్జీ శ్రోతలకు చదివి వినిపించారు.

సిస్టర్ నివేదిత ఈ కార్యక్రమాలన్నింటిలోనూ దారాళంగా పాల్గొంది. గోఖలే అధ్యక్షతన ఆ సంవత్సరం జరిగిన కాంగ్రెసు మహాసభకు ప్రత్యేక ఆహ్వానం మీద బెనారెస్ వెళ్ళింది. కాంగ్రెసుని తమకి పూర్తిగా అనుకూల పరచుకొని, అతివాద బృందం బహిష్కరణ ప్రతిపాదన ఏకగ్రీవ ఆమోదన పొందేట్లు

చేసుకొన్నారు. నివేదిత ఈ సంఘటనను ఎంతో ఘనంగా మెచ్చుకొంది. కాంగ్రెసు సభలో గోఖలే మహాశయులు చాలా సామరస్య భావంతో కార్యక్రమాలు నిర్వర్తించారు. నివేదిత తన ధన్యవాద ప్రసంగంలో, భారత దేశం పట్ల ఇంగ్లాండు న్యాయ బుద్ధితో ప్రవర్తించాలని గోఖలే చేసిన ప్రయత్నాన్ని అభినందిస్తూ, ఆ విధంగా సలహా పూర్వకంగా మాట్లాడి ఆదేశానికి ఆయన దివ్యమయిన సేవలు అర్పితం చేసుకొన్నారని, చమత్కరించింది.

మరుసటి సంవత్సరం 1906లో కలకత్తాలో జరిగిన కాంగ్రెసు మహాసభకు కూడ నివేదిత హాజరు అయింది. కార్యకలాపాల దృష్ట్యా అతివాదులు మితవాదులు వీరిమధ్య చీలిక ఆనాటి కానాడు పెద్ద దవటం చూసి ఆమె బాధపడింది. భారత జాతీయతా భావం ఎంతగనో పెంపొందాలని ఆమె నిరంతర ఆకాంక్ష. కాని ఆ భావం భాగబాగాలుగా అవటం ఆమెకు ఎంతో సంవేదన కలిగించింది.

ఆవ్యాకులత పరిణామంగా ఒక జాతీయ చిహ్నాన్ని రూపొందించింది. చిహ్నం మీద వజ్రాయుధం రూపం అగపడుతూ ''వందేమాతరం'' అన్న నినాదం అక్షరాల్లో రాయబడి ఉన్న ఒక జాతీయ పతాకాన్ని వ్యవస్థీకరించింది. వజ్రాయుధం నిర్మాణం చేయటానికి తన ఎముకని బలిదానం చేసిన ధధీచి గాధ నివేదిత నెంతో ప్రబావితం చేసింది. అందువల్ల ఆ బలిదాన భావాన్ని జాతీయ చిహ్నంలో రూపొందించింది. ఇంకా మరికొన్ని చిహ్నాల్ని సూత్రీకరించింది కూడాను. ఈ చిహ్నం బహుజన ఆమోదం పొందింది. కాని జాతీయ పతాకం నిర్మాణ సందర్భం వచ్చిన తరుణానికి ఈ చిహ్నాన్ని ప్రతిపాదించటం తటస్థించ లేదు. అంత మాత్రాన ఈ విషయాల పట్ల ఆమెకున్న భావ ఔన్నత్యానికి ప్రాధాన్య లోపం జరిగినట్టు భావించనవసరం లేదు.

1906 ఏప్రిల్లో బారిసాల్‌లో జరిగన సభలో ప్రముఖ నాయకులందరూ పాల్గొన్నారు. విదేశీ పాలకులు పూర్తి దమన నీతినుపయోగించి ఆ సభను దౌర్జన్యంతో బెదరగొట్టి భగ్నం చేశారు. కాని ఈ సంఘటన ప్రతిఫలంగా రాజీకయ వ్యతిరేకత మరింత వృద్ధి చెందింది.

1907 సంవత్సరంలో సూరత్ సమావేశంలో జాతీయ వాదులు అని పేర్లు పొందిన అతివాదులు కాంగ్రెస్ ఆధిపత్యాన్ని స్వాధీనం చేసికొన్న కారణంగా, కాంగ్రెస్ రెండుగా చీలిక అయింది. జాతీయ వాదులకి అరబిందో నాయకులు. వీరు ఆ తరువాత బిపిన్ చంద్రపాల్‌తో కలిసి ''వందేమాతరం'' పత్రిక సంపాదకత్వం వహించారు.

ఉద్యమాన్ని ఉత్తేజ పరిచి గొప్ప ఆసరా ఇచ్చిన నాయకులు శ్రీ అరబిందో,

ఎన్నో రహస్య సమితులు ఏర్పాటు అవటం ద్వారా, ఈ విప్లవోద్యమం త్వరత్వరగా అభివృద్ధి చెందసాగింది.

ఈ రహస్య సమితులు బాంబుల్ని తయారు చేసేవి. ఈ సమితులతో నివేదితకు ఎక్కువ సన్నిహిత సంబంధాలు ఉండేవి. అట్టి సంబంధాలే కాక, కలకత్తా ప్రెసిడెన్సీ కాలేజీలో డాక్టరు జె.సి. బోసు, డాక్టరు పి.సి రే ఆధ్వర్యంలో ఉన్న ప్రయోగశాలల్లో, ఈ శాస్త్రజ్ఞుల సహాయకులుగా సమితి యువకులకు ప్రవేశం కలిగే ఏర్పాట్లు నివేదిత చేసిందనీ, ఆ అదను ఉపయోగించుకొని వారు బాంబులు తయారు చేసే వారనీ, ఉదహరిస్తూ, ప్రెంచి రచయిత్రి శ్రీమతి లిజెల్ రెమాండ్, నివేదిత జీవిత చరిత్రలో ఈ వివరాలను వెల్లడించింది. మురారి పుకూర్ ప్రయోగ శాలలో కూడా బాంబులు తయారు అవుతాయన్న కారణంగా కొందరు విప్లవవాదులపై ఆరోపణ జరిగి విచారణ సాగిందని, వివరించి, ఈ ఉదంతంలో కూడా నివేదితకు ప్రమేయం ఉన్నట్లు మేడమ్ రేమాండ్ రాసింది.

రహస్య ఉద్యమాలతో కూడా సంపర్కం పెట్టుకొని భాగస్వామినిగా ఆ కార్యక్రమాలకు సహాయ పడేంత సాహసం నివేదిత చేసిందా అన్న ప్రశ్న ఉదయించింది. కాని భారత స్వాతంత్ర్య సముపార్జనకై ఉత్సాహ పూరితంగా ప్రయత్నాలు చేసిన సాధకురాలామె. స్వాభావికంగా తాను నమ్మిన ఆశయానికి పూర్తిగా అంకితం అయిన కార్యకర్త ఆమె. స్వామిజీ తత్త్వ బోధల మూలంగా లక్ష్య సిద్ధికై బలప్రయోగం కూడ అవసరం అన్న సిద్ధాంతానికి కట్టుబడి ఉన్న కాళీ పూజాపరాయణి ఆమె. అటువంటి ఆమె విప్లవ వాదులకు సహకారం అందించటం సంభవమే అనిపిస్తుంది.

ప్రభుత్వం కూడా ఆమె రాకపోకల మీద గట్టి నిఘా ఉంచింది. ఆమె ఉత్తర ప్రత్యుత్తరాలు పరిశీలన చేయటం జరిగేది. ఈ పరిశీలనా తతంగం గురించి నివేదిత పోస్ట్ మాస్టర్ జనరల్‌కి ఉత్తరం కూడా రాసింది.

భారత ప్రజానీకాన్ని, వారి సహజ గుణ స్వభావ అంతః ప్రవృత్తులకు అనుగుణంగా, వారి పూర్వీకుల సంప్రదాయ వారసత్వ సంబంధంగా, వారి గతం వృత్తాంతాల ప్రతిబింబంగా, వారినొక ఉన్నత జాతిగా తీర్చిదిద్దాలని హృదయా వేశంతో ఆమె మనస్సు ఉగ్రూతలూగింది. శారీరక బలం, భౌతిక స్ఫురణం కల మొక్కవోని ఉక్కు వంటి దృఢగాత్రుల యువతరం కావాలని ఆమె గురు స్వామి వివేకానంద ఏనాడో ఎలుగెత్తి చాటి చెప్పారు. అట్టి మనుషుల్ని రూపు కల్పించాలని ఆయన తత్త్వ సిద్ధాంతం. ఆ తత్త్వ సిద్ధాంతాలే విప్లవ వాదుల్ని ఎంతగనో ప్రభావితుల్ని చేశాయి. ఆయన రాసిన పుస్తకాలు, గీత, చండి గ్రంథాలు ఎల్లపుడూ పఠనం చేసే వీరి నేస్తాలు. సహచరులయాయి. స్వామీజీతోను, వారు

రాసిన పుస్తకాలతోను, విప్లవ వాదుల కార్యకలాపాలకి సన్నిహిత సంబంధాలున్నాయని పరాయి ప్రభుత్వానికి తెలుసు.

దేశ ప్రజలని పరిపుష్టమయిన తీరుల్లో రూపు కల్పించి తీర్చి దిద్దడం ద్వారానే, ఆ జాతిని రూపు కల్పించి తీర్చి దిద్దడం అవుతుందని నివేదిత బావన. రామకృష్ణుల వివేకానందుల మతాభిమాన తత్త్వాల భావ సంయోజనం ద్వారా, భారతీయులు సంఘటిత ప్రేరితులయి, గాఢంగా సంపూర్ణంగా తమ జాత్యోన్నతిని సాక్షాత్కరించు కోవాలని కుమారి మెక్‌లియడ్‌కి 1904 ఏప్రిల్ 3న తన లేఖలో ఉల్లేఖించింది.

భారత జాతి నైతికంగా పతనం చెందిన స్థితిలో ఉందని నివేదితకు తెలుసు. స్వీయ దేశీయ సంప్రదాయాలకు కట్టుబడి ఉండటం ద్వారా కాని కేవలం విదేశీయ భావాలను అనుసరించటం ద్వారా కాని తనని తాను విమోచన చేసికొనే పరిస్థితిలో లేదని నివేదిత నమ్మకం. కాని తనని తాను పునరుజ్జీవింప చేసికోగల స్వతస్సిద్ధమయిన కార్య దక్షతా శక్తి భారత జాతికి ఉండనే ఉంది. ఆ దక్షతా శక్తి ప్రభావం రాజకీయ ఆర్థిక రంగాల వెలుపల కూడ జాతీయ జీవన స్రవంతిలో పలువిధాల గోచరిస్తోందని ఆమె విశ్వసించింది. బహుళమయిన దృక్పథాల్లో – సాంఘికంగా, రాజకీయంగా, సాంస్కృతికంగా, ఆర్థికంగా, మత సంబంధంగా, పునరుద్దీపింపబడిన భారత దేశ ప్రతిమ ఆమె మనో ఫలకం మీద గోచరం అవుతోంది– భారత జీవన స్రవంతిలోని యాదార్థ్యస్థాయీ శక్తులతో, అన్ని దృక్పథాల్లోను భారత దేశ పురోగనున రీతులు పరిపుష్టి చెందాలి. ఈపునరుద్దీపనం ప్రాప్తించుటకై తాను తన మాటలతోను, చేతలతోను, వ్రాతల తోను దేశ సేవానిరతిలో నిమగ్న అయి అహర్నిశలు గట్టి ప్రయత్నాలు చేపట్టింది. ఆ పర్యవసానంగా విస్తృత పరిధిలో సుస్థిరమైన భావ ప్రేరణను కలిగించ గలిగింది.

# 7

# జీవిత మార్గంలో

బెనారెస్‌లో సేవాసదనం అంతకు మూడేళ్ళ క్రితం కొద్ది పాటి స్థాయిలోనే ఏర్పాటయింది. నివేదిత 1905 కాంగ్రెసు సభకు హాజరయి బెనారెస్‌లో ఆ సదనం పనుల్లో నిమగ్న అయి ఉండిపోయింది. చాలా కాలం నుంచి వాయిదా పడుతున్న రాజస్థానీ విహార యాత్రకు ఆ తర్వాత వెళ్ళింది. ఆ ప్రాంతానికి చరిత్ర రీత్యా ఉన్న సంబంధ సంపర్కాలు ఆమె నెంతగనో ప్రభావితం చేశాయి.

ఒక అర్థ రాత్రిని పండు వెన్నెలలో నివేదిత బృందం చిత్తోర్ చేరుకొన్నారు. దుర్గం ఒక మైలు దూరం ఉందనగా అందరూ ఒక రాయి మీద ఆ సీనులయారు. నివేదిత పద్మాసనం వేసుకొని కూర్చొని, ఆ ప్రదేశ పురాతన విశేషాల్ని, పద్మిని చిత్తోర్ కీర్తి ప్రఖ్యాతుల్ని మననం చేసి కొంటూ ధ్యానముద్రలో పరవశం చెందింది. అనంతరం వారు తిరిగి బెనారెస్ చేరుకొన్నారు. దివ్యజ్ఞాన సమాజానికి చెందిన ప్రఖ్యాత మహిళ శ్రీమతి ఆనీబెసెంటును నివేదిత కలిసికొంది. ఆనీ బెసెంట్ తన వలెనే భారత దేశాన్ని మాతృదేశంగా ఎంపిక చేసుకొని పేరు పొందిన నాయకురాలయింది. బెనారెస్‌లో నివేదిత కొన్ని ప్రసంగాలుకూడ చేసింది. 1906 జనవరి 26న వారందరూ కలకత్తా చేరుకొన్నారు.

ఆమెకు పూజ్యాలై గౌరవమన్న నల నందుకొన్న పరిచయస్తులిద్దరూ ఆ సంవత్సరం మరణించారు. ప్రబుద్ధ బారతకు సంపాదకులుగా ఉండి, హిందూ మత సంబంధ విషయాలను ఆమెకు బోధన చేసిన స్వామి సంపూర్ణానంద ఒకరు. రెండవ వారు గొపాలర్‌మా, గోపాల మాత (వీరిని రామకృష్ణులు కూడా మాత అని సంబోధించేవారు) 1898 సంవత్సరంలో బేలూర్‌లో జరిగిన ఉత్సవ వేడుకల్లోను, కామార్ హట్టీలోను, శ్రీమతి బుల్, కుమారి మెక్‌లియడ్, ఆమెను పరిచయం చేసుకొన్నారు. ఆమె పవిత్రత వారినెంతో ముగ్ధుల్ని చేసింది. 1903 డిశంబరు పదోతారీఖు నుంచి రెండు సంవత్సరాల ఆరునెలల పాటు ఆమె నివేదిత దగ్గరనే ఉంది. తన తొంభై మూడవ ఏట 1906 జులై ఆరున ఆమె కాలధర్మం చెందింది. ఈ రెండు మరణాల వలన నివేదిత జీవనంలో ఒక శూన్యత ఏర్పడింది. ఆమె మనసుని కలచివేసిన మరొక విషాద సంఘటన తూర్పు బెంగాల్ కరువు

పరిస్థితులు. కరువు వరద బాధితులకి సహాయం అందింటానికి ఆ ప్రాంతం అంతా నివేదిత పర్యటించింది. 1906 బెంగాలు కరువు వరదల గురించి కొన్ని వివరాలు మాత్రం ఉటంకిస్తూ తన అనుభవాలను ఒక పుస్తక రూపంలో రాసింది.

కలకత్తా తిరిగి వచ్చిన తర్వాత తీవ్రంగా జబ్బు పడింది. సిస్టర్ క్రిస్టిన్, బేలూర్ మఠం నుంచి వచ్చిన స్వామి బ్రహ్మానంద, స్వామి పరిచర్యలు చేశారు. డమ్‌డమ్‌లో ఆనంద మోహన బోసు భవనంలో కోలుకొంటూ ఉన్నప్పుడు ''ప్రబుద్ధ భారత'' పత్రికకి కొన్ని సందర్భ విశేషాల గురించి (అకేషనల్ నోట్స్'') చిన్ని చిన్న వ్యాస సంగ్రహాలు రాసి పంపుతూ ఉండేది. ఆరోజుల్లోనే, ''దిమాస్టర్ యాజ్ ఐ సా హిమ్'', ''క్రేడిల్ టేల్స్ ఆఫ్ హిందూయిజమ్'', గ్రంథాలు రాయటం మొదలు పెట్టింది. డాక్టర్ బోసు మహాశయుని ''కంపారటీవ్ – ఎలెక్ట్రో సైకాలజీ'' గ్రంథ రచన పూర్తికి ఎంతో సహాయం చేసింది.

1907 శ్రీమతి సేవియర్స్ కలకత్తా వచ్చిడమ్ డమ్‌లో ఉంది. స్వామి స్వరూపానంద తల పెట్టిన భగవద్గీత అనువాదానికి ఇంగ్లీషు మొదటి ప్రతులను సరిదిద్ది సేవియర్స్ నివేదితకు సహాయపడింది. ఆ తర్వాత వీళ్ళిద్దరూ బోసు దంపతులతో కలిసి మాయావతి వెళ్ళారు. మాయావతి అద్వైత ఆశ్రమాన్ని స్వామి విరజానంద పర్యవేక్షిస్తూ ఉండేవారు. స్వామి వివేకానందుల రచనల్ని స్వామి స్వరూపానంద సంపూర్ణంగా సేకరించి, ఒకే గ్రంథంగా సిద్ధం చేశారు. స్వామి విరజానంద వాటి ముద్రణ వ్యవహారమంతా దక్షతతొ నిర్వహించారు. ఈ సంపూర్ణ గ్రంథానికి ''అవర్ మాస్టర్ అండ్ హిస్ మెసేజ్'' అన్న శీర్షికతో నివేదిత ఉపోద్ఘాతం రాసింది.

అప్పుడామె బాగా స్వస్తతగా లేకపోవటం వల్ల యూరప్ దేశాలకి వెళ్ళి అక్కడ కొన్నాళ్ళు ఉంటే మార్పు వల్ల ఆరోగ్యం కుదుట పడుతుందని శ్రీమతి బుల్ సలహా యిచ్చింది. అప్పుడు బారత దేశంలోని పరిస్థితులు అనుకూలంగా లేవు కూడాను. ప్రభుత్వం ఉద్యమాల్ని అణగ ద్రొక్కే విధానాన్ని ప్రచండంగా ప్రారంభించింది. లాలా లజపత్ రాయ్ ప్రభృత రాజకీయ నాయకుల్ని నిర్బంధంలోకి తీసుకొని ద్వీపాతంర వాసానికి తరలించటంతో నివేదిత హృదయం చాలా తల్లడిల్లిపోయింది. స్వామి వివేకానందుల సోదరుడు 'జాగంతర్' ఉప సంపాదకుడు అయిన భూపేంద్ర నాథ దత్త మహాశయుని నిర్బంధంలోకి తీసుకొన్నారు. అప్పుడు ఆయన్ని నివేదిత జామీను మీద విడిపించింది. కాని ఆయన్ని ప్రభుత్వం మళ్ళీ అరెస్టు చేసి ఒక సంవత్సరం కారాగార శిక్ష విధించింది. (జైలు శిక్ష పూర్తి అయిన తర్వాత ఆయన అమెరికాకు తరలి వెళ్ళారు.)

ఈలోపల బోస్ మహాశయుని గ్రంథాలు ''ప్లాంట్ రెస్పాన్స్'', ''కంపారటివ్ ఎలెక్ట్రో - సైకాలజీ'' యూరప్ దేశాల్లో గొప్ప సంచలనం కలుగ చేశాయి. ఆయన్ని ఆయా దేశాలకు రమ్మని ఆహ్వానాలు చాలా వచ్చాయి. ఆయన నివేదితను కూడా తనతో రమ్మని అభ్యర్థించాడు. ఆమె ఒప్పుకొని ''మోడర్న్ రెవ్యూ'', ''ప్రబుద్ధ భారత'' పత్రికలకి పంపే వ్యాసాల్ని ముందుగానే ముగించి సిద్ధం చేసింది. శారదామణి మాత వద్దనుంచి సెలవు తీసుకొంది. బేలూర్‌మఠ్, దక్షిణేశ్వర్ సందర్శించి యూరప్ పయనమయి బయలు దేరింది ఓడ ప్రయాణంలో కూడా మరి కొన్ని రచనల్ని చేసింది. బాలికా పాఠశాల తిరిగి ప్రారంభం అయి తుష్టి పుష్టిగా పనిచేస్తోందని క్రిస్టిన్ ఉత్తరం చదువుకొని చాలా ఆనందించింది.

అయిదేళ్ళ తర్వాత అన్నని చెల్లెల్ని తల్లిని కలుసుకుంది. 1907 సెప్టెంబర్ 7 నుంచి కొన్ని వారాలు వాళ్ళ దగ్గరనే ఉండిపోయింది. హిందూమత సంప్రదాయాలకు అను కూలంగా జీవితాన్ని దిద్దుకొని స్వీయ మతంగా ఎంపిక చేసికొని ఆమె మసలటం తల్లి మేరీకి సంతోషం కలిగించింది. తల్లి సంతోషం నివేదితకు ఎంతో ఊరట కలిగించింది. నవంబర్‌లో యూరప్ వెళ్ళి బోసు దంపతుల్ని జర్మనీలో కలిసికొంది. ఆ తర్వాత కుమారి మెక్‌లియడ్ శ్రీమతి లెగ్గట్‌ని పారిస్‌లో కలుసుకొంది. ''క్రెడిల్ టేల్స్ అఫ్ హిందూయిజమ్'' ఈ లోగా ముద్రణ పూర్తి అయి చాలా పుస్తకాలు బాగాఅమ్ముడు పోయాయి. భారత దేశానికి సంబంధంచిన విషయాలమీద ప్రసంగాలు చేస్తూ వ్రాతలు వ్రాస్తూ ఇగ్లండులోనే ఉండిపోయింది.

1908లో క్రాప్టాకిన్ యువరాజుని మళ్ళీ కలుసుకొంది. అప్పుడు రష్యా భారత దేశాల్లో ఉన్న పరిస్థితుల సారూప్యతల్ని ఆయన గుర్తించి, దాన్ని బట్టి ఈ రెండు దేశాల్లోను సాంఘిక చైతన్యం కలిగి విప్లవం తప్పక రానున్న ఛాయలు గోచరిస్తున్నాయని ఆమెకు తన గాఢ విశ్వాసాన్ని ప్రకటించారు.

ప్రఖ్యాత భారత నాయకులు గోఖలే, బి.సి. పోల్, ఆర్.సి. దత్త్. ఆనంద కుమారస్వామి మహాశయులు కలకత్తాలోని ప్రభుత్వ లలిత కళల పాఠశాల ప్రిన్స్ పాల్ హావెల్, రాట్‌క్లిఫ్ దొరలు కూడ ఆరోజు ల్లో ఇంగ్లండులోనే ఉన్నారు. వీరినందర్ని కలుసుకొంటూ, భారత దేశ సేవాకార్యకలాపాల్ని కొనసాగిస్తూనే ఉండేది. భారతదేశం అంటే ఎక్కువ సానుభూతికల ఇంగ్లండు పార్లమెంటు సభ్యుల్ని పాత్రి కేయుల్ని నివేదిత ముఖాముఖి కలుసుకొంది. వీరిలో సర్‌హెన్రీ కాటన్, డాక్టరు విహెచ్ రూదర్ ఫోర్డు, శ్రీమతి కియిర్ హార్డీ, విలియమ్ రెడ్ మాండ్, ''రెవ్యూ అఫ్ రెవ్యూస్'' కి చెందిన విలియమ్ స్టెడ్ ప్రభృతులు ఉన్నారు.

భారత దేశాభ్యున్నతి నిమిత్తం అలుపు సొలుపు లేకుండా నిర్విరామ కృషిచేస్తూనే ఉండేది.

ఈలోగా రాజకీయ ఉద్రిక్తత పెరిగి పోయి దేశం తీవ్రమయిన ఒత్తిడులకి గురి అయింది. అతి వాదులకి మిత వాదులకి మధ్య పూర్తి చీలికలు ఏర్పడ్డాయి. విప్లవాత్మకమయిన దౌర్జన్య కలాపాలు తత్ఫలితంగా కల్లోలాలను అణచి వేయటానికి ప్రభుత్వ దమన విధానాలు ఉధృతం అయాయి. ముజఫర్ పూర్‌లో కలకత్తా నగర మాండలిక అధికారి కింగ్స్‌ఫర్డ్ మీద ఖుధిరాం బోస్ చేసిన హత్యా ప్రయత్నం విఫలం అయింది. కాని ఆ ప్రయత్నంలో ఇద్దరు యూరోపియన్ మహిళలు యాదృచ్ఛికంగా మరణానికి గురి అయారు. బెంగాల్ లెఫ్టినెంట్ గవర్నరు సర్ ఆండ్రూ ఫ్రేజర్ మీద కూడ హత్యా ప్రత్నం జరిగింది. ద్రోహ బుద్ధితో ప్రభుత్వం వైపు తిరిగి పోయి సాక్ష్యం ఇచ్చిన నరేన్ గోస్వామిని ఆలిపూర్‌జైలులో ఉండగానే ఖూనీ చేశారు.

శ్రీ అరబిందో, బిపిన్ చంద్రపాల్, మహాశయులు అరెస్టు అయారు. అశ్వినీ కుమార దత్త్, మరి ఎనిమిది మందికి ద్వీపాంతర వాస శిక్ష పడింది. నివేదితను ఈ సంఘటనలన్ని కలత పరచి ఎంతో ఉద్రేక పరిచాయి. కానీ భారత దేశానికి వెలపలి దేశాల్లోనే తాను ఉండి నెరవేర్చవలసిన తీవ్రకృషి ఇంకా ఎంతో ఉంది. అందువల్ల ఆమె భారత దేశానికి తిరిగి రాలేదు. బోస్ మహాశయులతో కలిసి ఒక నెలరోజుల పాటు ఉండటానికి ఐర్లండు వెళ్ళింది.

ఆ తర్వాత అమెరికా వెళ్ళి శ్రీమతి ఓల్‌బుల్‌తో బోస్టన్ నగరంలో ఉంది. లోగడ స్వామి వివేకానందులు, కుమారి సారాఫార్మర్ ఆహ్వానం మీద మైన్ నగర సామీప్యంలో శిష్య బృందంతో సామూహికంగా గడిపిన ఆనాడు, శిష్యులతో అప్పుడప్పుడు అభిభాషిస్తూ ధ్యాన ముద్రలో నిమగ్నులయి ఉండటం వల్ల, ఆ పరిసరాల పవిత్రతను అవగతం చేసుకొని స్వామీజీని తాను ఈనాడు ప్రత్యక్షం చేసికొన్నట్టు మనోభావం చెంది నివేదిత పులకించి పోయింది.

ఇంకా కొందరు స్నేహితుల్ని, కుమారి మెక్‌వియడ్ శ్రీమతి లెగ్గెట్‌ను కలుసుకొని 1907 నవంబరు, డిశంబరు మాసాల్లో విస్తృతంగా ప్రసంగాలు చేస్తూ పర్యటనలు సాగించింది. తను స్థాపించిన పాఠశాలకు గాను చాలా విరాళాలను సేకరించింది. న్యూయార్కు నగరంలో ఎమ్మా తర్స్‌బీ అను ప్రఖ్యాతగా యనితో కొన్నాళ్ళు గడిపింది. అప్పటి రోజుల్లో విశేష కీర్తిని గడించిన పత్రికా రచయిత యస్. ఐ అలెగ్జాండర్‌ని కలుసుకొంది. ఆయన నివేదిత తన్పై అపారమయిన ప్రభావం కలిగించిందని ఆ తర్వాత ఒక వ్యాసం కూడ వ్రాశాడు.

హిందూ మతం, హిందూ సంస్కృతి గురించి వివరించి చెబుతూ నివేదిత, మేధావుల బుద్ధి వికాసానికి యివి ఎలా తోడ్పడ్డాయో తన ప్రసంగాల్లో ఉదహరించేది. అమెరికాలీగ్ అధ్యక్షుడయిన జె. టి. సండర్ లాండ్ మహాశయుని కలుసుకొని భారతదేశ విషయాలు ఆయనకు ఆకళింపు చేసినందువల్ల భారతావని స్వాతంత్ర్య సముపార్జన నిమిత్తం తీవ్ర కృషి జరగాలని ఆయన ఉద్బోధించటం ప్రారంభించారు.

ఒక్క అమెరికనులనే కాక, భారత దేశ విప్లవ వాదులయిన డాక్టరు తారకానాథ్, డాక్టర్ భూపేంద్రనాథ్ దత్ మహాశయులను కూడ ఆమె కలుసుకుంది. అమెరికాలో తన ఉన్నత విద్య నిమిత్తం నివేదిత ధనం సమకూర్చిందని థత్ ఆమెను అభినందించారు. స్వామి వివేకానందులు ఇతరులకి రాసిన ఉత్తరాల్ని శ్రమ పడి సేకరించటంలో కృతకృత్యురాలయింది. ఈలోగా డాక్టర్ జగదీశ చంద్రబోసు అమెరికన్ విశ్వవిద్యాలయాల్లో ప్రసంగించటం అంతిమ ఘట్టం చేరుకోవటం వల్ల ఆయనతో కూడ తిరిగి భారతదేశానికి వెళ్ళటానికి సిద్ధపడింది.

ఇంగ్లండులో తల్లి కాన్సరు వ్యాధితో బాధపడుతోందని తెలిసింది. కానీ అంత త్వరలో అమెరికానుంచి బయలు దేరలేక, రామకృష్ణ వివేకానందుల దైవాంశ జీవితం బాధ నివారణ చేసే తోడు నీడ కాగలదని ప్రార్థిస్తూ తల్లికి ఓదార్పు లేఖ రాసింది. 1909 జనవరిలో అమెరికా నుంచి బయలు దేరి తల్లి సాన్నిధ్యాన్ని చేరుకొంది.

ఆఖరి ఘడియల్లో కూతురు తన దగ్గరకు రాగలిగిందని సంతోషించి జనవరి 26వ తారీఖున ప్రశాంతంగా తల్లి కన్నుమూసింది. నివేదిత ఆ తర్వాత సోదరీసోదరుల దగ్గర మరికొన్నాళ్ళు వుండి తండ్రిగారు అభిభాషించిన మత ప్రసంగాల్ని సరిదిద్ది క్రమబద్ధం చేసి తిరగరాసే ప్రయత్నాన్ని చేపట్టి తల్లికి చేసిన వాగ్దానాన్ని నెరవేర్చింది. వివేకానందులు స్టర్డీ మహాశయునికి రాసిన లేఖల్ని శ్రమ పడి సేకరించింది.

అన్నా చెల్లిలితో కలిసి తల్లి చితాభస్మాన్ని తీసుకుపోయి ఐర్లండులోని గ్రేట్ టారింగ్‌టన్ నగరంలోని తండ్రి సమాధి ప్రక్కనే భూస్థాపితం చేసింది. తండ్రి అంత్యక్రియల సమయంలో దగ్గర ఉన్న స్నేహితులే. ఇప్పుడు ఈ లాంఛన పూర్వక కార్యక్రమాన్ని కూడ తిలకించారు. ఈ కలాపం అంతా పూర్తిచేసి, తమ పూర్వీకుల ఆవాస స్థలంలోనే ప్రశాంతంగా, స్వాభావికమయిన పరిసరాల్లో తల్లిదండ్రులకు ఒకరికొకరి ప్రక్క ప్రక్కనే శాశ్వత శయనం ఏర్పాటు జరగటం తనకెంతో మానసిక తృప్తిని కలిగించిందని నివేదిత శ్రీమతి బుల్‌కి లేఖ రాసింది.

అలాగ పనులన్నీ పూర్తి చేసుకొని భారతదేశానికి తిరుగు ప్రయాణానికి నివేదిత సిద్ధమయింది. బోసు దంపతులు అమెరికా నుంచి మార్చిలోనే ఇంగ్లండుకి తిరిగి వచ్చారు. కుమారి మేక్‌లియడ్, శ్రీమతి బుల్, సిస్టర్ నివేదిత వీరందరూ కలిసి యూరప్ దేశాలు పర్యటించి 1909 జూలై 2నాడు నౌకలో ఇండియాకు బయలు దేరారు. ఇంగ్లండులోని ఇండియా ఆఫీసుకి చెందిన ఒక అధికారి సర్ కర్జన్ వైలిని ఆరోజుననే భారతీయుడొకడు హత్యచేశాడు. ఈ వృత్తాంతం విని నివేదిత మానసికంగా ఎంతో వికలం చెందింది. చివరికి 1909 జూలై 18వ తారీఖున కలకత్తా చేరుకొంది.

బ్రిటిష్ పోలీసు నిఘాదళాలు నివేదిత విషయమయి అనుమానాలు పెంచుకొని ఆమె నడవడిని శంకించు చుండటం వల్ల, తన వైనం ఎరుక పడకుండా ఆరోజుల్లో ఆమె ప్రచ్ఛన్నంగా చరించేదని ఆమె జీవిత చరిత్రను రాసిన చాలమంది రచయితలు అభిప్రాయ పడ్డారు. అందువల్ల మామూలు కార్యకలాపాల్ని తిరిగి చేపట్టే ముందు అతి జాగ్రత్తగా మెలుగుతూ, తానెన్నుకొన్న మార్గం ఎప్పుడు సుగమం అవుతుందా ని ఆసక్తితో నిరీక్షించింది. కానీ త్వరలోనే రాజకీయంగా ఎక్కువ బాహాటంగా ముఖ్య పాత్ర వహించ వలసి రావటం పూర్వమే నిర్దిష్టమయిన విధి నిర్ణయం కాబోలు!

# 8

# స్వాతంత్ర్య సమరంలో నాయకత్వం

ఆలిపూర్ కుట్రకేసు విచారణ జరుగుతున్న రోజులవి. ప్రభుత్వం అణచివేత విధానాన్ని తీవ్రంగా ప్రయోగిస్తోంది. అకస్మాత్తుగా వచ్చి ఇళ్ళను పరిశోధించటం అరెస్టులు చేయటం ప్రతిచోట జరుగుతన్నాయి. ఈ ప్రభుత్వ చర్యలకు ప్రతి చర్యలుగా విప్లవ వాదులు తాము తయారు చేసిన బాంబుల్ని విసరి వెయ్యటం ప్రారంభించారు.

మురారి పుకూర్ కుట్ర కేసు అని పిలవబడే దావా ఉదంతాల కూపీ అంతా బయటకు లాగటం 1908 మే నెలకు పూర్తి అయింది. ఈ కేసు సంవత్సరం ఆరునెలలు సాగింది. శ్రీ అరబిందో తమ్ముడు బరీంద్ర కుమార్ ఘోష్ అన్న వద్దనుంచి రాజకీయ శుశ్రూష పొందాడు. తన పదిహేనవ ఏటనే వివేకానందుల దర్శనం చేసుకొని దేశయువకుల్ని సంఘటిత పరిచే కార్యక్రమంలో నివేదిత సహాయం పొందుతూ ఉండేవాడు. ఇతనికి, ఉల్లాసకర దత్తుకి మరణ శిక్ష పడింది. కాని పై న్యాయస్థానం వారు అది రద్దు చేసి యావజ్జీవ కారాగార శిక్షగా మార్చు చేశారు. మరో పదముగ్గురికి కఠిన కారాగార శిక్షలు పడ్డాయి. ఈ కేసులో నేరం చేయనే లేదని బలంగా రుజావు చేస్తూ చిత్తరంజన్ దాసు మహాశయులు చేసిన వాదం ఆధారంగా కోర్టువారు శ్రీ అరబిందో నిర్దోషి అని నమ్మి ఆయనను వదిలివేశారు.

నివేదిత భారతదేశం రాగానే తన స్నేహితుల్లో చాలామంది నిర్బంధంలో గాని, జైల్లోగాని ద్వీపాంతర వాసంలో గాని శిక్ష అనుభవిస్తూ ఉండటం గమనించింది. తిలక్ మహాశయుడు ఆరు సంవత్సరాల శిక్ష మీద మాండలే జైల్లో ఉన్నారు. కృష్ణకుమార మిత్ర మరికొందరు బెంగాలు నుంచి తరలింపబడి ద్వీపాంతర వాస శిక్షలో ఉన్నారు. ప్రతి ఘటనోద్యమం అక్కడనుంచి సాగించే ఉద్దేశంతో ఇంకా కొందరు రహస్యస్థానాలకు గుట్టుగా చేరుకొన్నారు. సరి అయిన పంథాలో నడిపించగల నాయకత్వలోపం వల్ల ఉద్యమమే కుంటు పడినట్లు కనిపించింది. నేరారోపణ రద్దవటం వల్ల దేవవ్రత, సచీన్ ఈ ఇద్దరు విప్లవ వాదులు బేలూర్ మఠంలో ఆశ్రమ వాసులుగా ప్రవేశం పొందారు. దాంతో మఠ మందిరం

మీద పోలీసు నిఘా తీవ్రమయింది. పర్యవసానంగా, ఇతరులెవ్వరికి మఠంలో ప్రవేశం లేకుండా మఠ అధ్యక్షుడు స్వామి బ్రహ్మానంద నిషేదాజ్ఞల్ని జారీ చేశారు. అంతేకాక నివేదితతో బేలూర్ మఠానికి ఎట్టి సన్నిహిత సంబంధాలు లేననీ ఆమె కార్యకలాపాలకి తమ సంస్థ ఏవిధమయిన బాధ్యత వహించదని ఆయన రెండవ సారికూడ ప్రకటన చేశారు.

శ్రీ అరబిందో జైలు నుంచి విముక్తి చెందారని సంతోషంతో నివేదిత బృందం తమ పాఠశాల ఆవరణలో వేడుకలు జరుపుకొన్నారు.

సరిగా ఈ అవధి దశలో, ఇంతకు పూర్వం కంటే, స్వీయ ధ్యాన తపోబలంతో పారమార్థికంగా శ్రీ అరవిందో శక్తిమంతులై తన్ను తాను బలవత్తరం చేసుకొనే ప్రక్రియలో ఉన్నట్టు కనపడుతుంది. అట్టి మార్పుకి హేతుభూతంగా, గీతా పారాయణ, ఉపనిషత్పఠన వల్ల ఉన్నత శ్రేణికి చేరుకొని యోగపరమయిన ఏకాగ్రతను తానెంత అపారంగా విస్తరించుకో గలిగారో శ్రీ అరబిందో వివరించాడు. వివేకానంద స్వామి వాణిని జైల్లో ఉండగా వింటూన్నట్టు మనోవికాసం పొందామనీ, వివేకానందులు తమ సమక్షంలోనే ఒక పక్షం రోజులు గడిపినట్లు గాఢమయిన భావన కలిగేదనీ, ఇవి నమ్మకమయిన తమ వాస్తవ అనుభూతులని శ్రీ అరవిందో ప్రకటించారు.

ఇంగ్లీషులో ''కర్మయోగి'' బెంగాలీలో ''ధర్మ'' అనే రెండు పక్ష పత్రికల్ని శ్రీ అరబిందో ప్రచురించేవారు. ఈ పత్రికలు మత విషయంగాను రాజకీయ విషయకంగాను ఒక గొప్ప మిశ్రణమనీ ఈ సమ్మేళనం ద్వారా క్రమక్రమంగా దేశం జాతీయతా భావ దీక్షత దక్షత పొంది సౌష్టవం చెందాలని అదే వాటి ధ్యేయమనీ శ్రీ అరబిందో ఒక నియమావళిని సూత్రీకరించారు. ఈ పత్రికలకు నివేదిత నిర్విరామంగా వ్యాసాలు పంపించేది.

సాహిత్య విజ్ఞాన సంస్కారం అంతగా లేని శ్రీరామ కృష్ణ నుంచేతాను భావ పరిజ్ఞానం సంపాదించుకొంటూ, తన్ను తాను పునరర్థించుకొంటున్న సత్యాన్ని కృతజ్ఞతా పూర్వకంగా అంగీకరించి, ఆ దక్షిణేశ్వర దైవాంశ సంభూతునికి భారతావని నివాళులు అర్పిస్తోందని శ్రీ అరబిందో ఉద్ఘాటించారు. ఆ మహోత్కృష్ట కార్యకలాపాన్ని భారతావని ఇంకా ఆదిలోనే ఉంచింది. వివేకానందులు చాటిచెప్పిన సందేశాన్ని దక్షతతో నిత్యమూ అభ్యాసంలో పెట్టటానికి భారతదేశం యింకా పూనుకోలేదు. ప్రాచీన ఉపనిషదృషులు అందించిన ఆధ్యాత్మిక సంప్రదాయాల్ని మునుముందు తాను అనుసరించి ఆ మహాత్ముల అడుగు జాడల్లో కార్యదక్షతకు కావలసిన బలశక్తుల్ని మొదట తాను కూడ తీసుకొని ఆత్మబలం పుంజుకుంటూన్న ఆ సమయంలో, శ్రీ

అరవిందో తాను కార్యరంగంలోకి ఇంకా దిగకుండా ధ్యాన బలశక్తుల్ని తనలోకే మళ్ళించు కొంటున్నట్లు కనపడుతోందని నివేదిత సంభావించింది.

అప్పటికి ''కర్మయోగి'' ముప్పది తొమ్మిది ప్రచురణలు వెలువడ్డాయి. ఆ సమయంలో శ్రీ అరబిందో అనుయాయులయిన కార్యకర్తల సమావేశాల్లో తరుచుగా నివేదిత పాల్గొంటూ ఉండేది. అరబిందోని ద్వీపాంతర ప్రవాసానికి ప్రభుత్వం పంపుతారని వదంతి చెలరేగ్గానే, అసలు భారతదేశం వదలి వెళ్ళిపొమ్మని ఆయనకు నివేదిత సలహా యిచ్చింది. కానీ పవిత్ర పూరిత గాఢ ఉద్దేశ పూర్వకంగా, జాతిని ఆదేశిస్తూ, ఒక శాసనంగా తన విజ్ఞానపన ప్రకటనను కర్మయోగి పత్రికలో శ్రీ అరబిందో ప్రచురించటంతో తాత్కాలికంగా ఆయన్ని ప్రవాసానికి పంపే ఏర్పాటు నిలిపి వేయటం జరిగింది.

కాని మరి కొన్ని రోజుల తర్వాత ''కర్మయోగి'' పత్రికలో పని చేస్తూన్న ఒక ఉద్యోగి శ్రీరామచంద్ర మజుందార్ శ్రీ అరబిందోని ప్రభుత్వం అరెస్టు చేయనున్నారని వార్త తీసుకొని వచ్చాడు. ఇంక ఏమాత్రం కాలయాపన చేయవీల్లేని పరిస్థితి ఏర్పడింది. దాంతో 1910 ఫిబ్రవరి నెలలో ఫ్రెంచి ప్రభుత్వ స్థావర మయిన చంద్ర నాగోర్‌కి ఆయన తరలి వెళ్ళారు. తాను లేని సమయంలో పత్రికల సంపాదకీయ బాధ్యతల్ని వహించమని కోరుతూ శ్రీ అరబిందో నివేదిత కొక సందేశం పంపారు. సరస్వతీ పూజ రోజున ఫిబ్రవరి పదునాల్గవ తారీఖున చంద్ర నాగూర్‌లో నివేదిత ఆయన్ని కలుసుకుంది. 27వ తారీఖున ఆయన్ని మళ్ళీ కలుసుకొంది. నివేదిత 1910 ఏప్రిల్ మాసం వరకూ పత్రిక ప్రచురణ బాధ్యతను వహించింది. ఆ తర్వాత వాటి ముద్రణను నిలిపి వేయటం జరిగింది. అప్పటికి శ్రీ అరబిందో పాండిచ్చేరి నగరం చేరుకొన్నారు.

ఆ సమయంలో తప్పక ఆచరించవలసిన విధాయక వాక్యాలుగా పరగణింపబడిని విజ్ఞాపన ప్రకటనల్ని పత్రిక ఒక ప్రతిలో నివేదిత ప్రచురించింది. ఆ ప్రచురణ పాఠం యిలా ఉంది.

''భారతావని ఏకైక అస్తిత్వం కల ఒకే దేశమనీ, అఖండత్వాన్ని సంతరించుకొన్న ఒకే దేశమనీ, అది అజేయమయినదనీ నా నమ్మకం.''

''భారతీయులందరకు సమాన హక్కు భుక్తాలున్న మాతృమందిరంగా, సమాన భాగస్వామిత్వం కల ప్రయోజనాల నందించే భూమాతగా, సమతుల్యంగా సదా ప్రేమవాత్సల్యాల్నిచ్చే మాతృభూమిగా జాతీయ సమైక్యతా నిర్మాణం దృఢంగా జరిగింది.''

''మతాల్ని సామ్రాజ్యాల్ని రూపనిర్మాణం చేయకల తేజోబల శక్తి, అధ్యయనా పరిజ్ఞానంతో నిష్ణాతులైన విద్వాంసులలో ఉన్న ధీశక్తి, దైవాంశ

సంభూతులైన వారు సంతరించుకొన్న తపోబలశక్తి, వేద ఉపనిషద్ వాఙ్మయంలో ఉచ్చరింపబడిన ఈ త్రిశక్తి, మరల మాలో మాఅందరిలో ప్రాదుర్భావం చెందిందనీ, దాన్ని జాతీయతా భావమన్న పేరుతో ఇప్పుడు పిలుస్తున్నామనీ నా నమ్మకం.''

భారతావని వర్తమాన సమయం భారతావని గతకాలంలోకి లోతుగా నాటుకు పోయిందనీ, ఎట్ట ఎదుట కళ్ళకు కట్టినట్టు మహిమాన్వితమయిన బారతావని సమగ్ర స్వరూపం ప్రకాశవంతంగా గోచరిస్తోందని నా మ్మకం.''

''ఓ జాతీయతా భావమా!
రా నాలోనికి రా
ఉల్లాస రూపంలో కాని
విచారరూపంలో కాని
గౌరవ ప్రదంగా కాని
అవమాన ప్రదంగా కాని రా!
నన్ను నీ వానినిగా చేసుకో!''

పోలీసుదళాలు చాలా రోజుల నుంచీ నివేదిత మీద నిఘా ఉంచుతూ వచ్చాయి. ఆమెకు వచ్చే ఉత్తరాల్ని తనిఖీ చేయటం వల్ల పోస్ట్ మాస్టర్ జనరల్‌కి నివేదిత తన అసమ్మతిని తెలియ జేయటం కూడ జరిగింది.

తనెవ్వరో తెలియనీయకండా వైస్‌రాయ్ పత్ని లేడీమింటో పాఠశాలకు వచ్చి నివేదితను రహస్యంగా కలిసికొంది, కానీ వెళ్ళి పోతూ తనెవ్వరో తెలియజేసింది. హఠాత్తుగా జరిగిన ఈ సంఘటన నివేదితకు సంతోషాన్ని ఆశ్చర్యాన్ని కలుగజేసింది. మానసికంగా తననెంతగానో నివేదిత ప్రభావితం చేసిందని ఆ తర్వాత లేడీమింటో రాసింది. అనంతరం లేడీమింటో బేలూర్ మఠం దర్శించి నివేదిత క్రిస్టిన్‌లతో కలిసి దక్షిణేశ్వర్ వెళ్ళింది. నివేదితను ప్రభుత్వ భవనంలో తేనేటి విందునకు ఆహ్వానించింది. పోలీసు వారు నివేదిత మీద ఉంచిన నిఘా తననెంతో వ్యాకుల పరచినదని చెప్పింది. ఆ సందర్భంగా పోలీసు కమీషనర్‌ని కూడా కలిసికోమని సలహా ఇచ్చింది. నివేదిత పోలీసు కమీషనర్ని ఆ తర్వాత చూసింది కూడాను.

ఆ సంఘటనకు ముందే 1909 నవంబర్‌లో రామ్సె మాక్డొనాల్డ్ కలకత్తా వచ్చినప్పుడు నివేదితను కలిసికోవటం జరిగింది. ఆతర్వాత రామ్సే మాక్డొనాల్డ్ లేబరు పార్టీ నాయకుడయి ఇంగ్లండు దేశ ప్రధాని అయారు. హిందూ మతం గురించి, హిందూ తత్త్వ శాస్త్రాల గురించి నివేదితతో సంభాషించి మానసికంగా మాక్డొనాల్డు కూడా ఎంతగానో ప్రభావితమయ్యాడు.

''కర్మయోగి'' ప్రచురణ ఆగిపోవటంతో నివేదిత శాంతంగా ఏకాంతంగా కాలం గడిపేది. భారతావని జీవన వాహినుల్లో ఆత్మ సంలీనమైన ప్రతి ఫలంగా, సహజ ప్రతిరూపంలో, ఎప్పటినుంచో మనసా వాచా కర్మణా దేశ స్వాతంత్ర్య సము పార్జన కృషికై క్రియాత్మకంగా తాను కట్టుబడే ఉంది. పరమ పదించిన గురు ఆజ్ఞలు ఆదేశాల కనుగుణంగా ఆ జీవన వాహినీ తరంగిణుల్లోకి గాఢంగా అంతర్గామిగా మళ్ళీ యిప్పుడు సంలీనమై పోతోంది. కానీ ఏం చేసినా ఏం చేయబోయినా పాఠశాల తన ప్రప్రథమ కర్తవ్య విషయం. కనుక ఆ సంస్థమీద, విద్యావిధానాల మీద ప్రేమ పూర్వకంగా శ్రద్ధ వహించటం తన ప్రథమ బాధ్యత.

నివేదిత పశ్చిమ దేశ పర్యటన సమయంలో పాఠశాల వ్యవహారాల్ని క్రిస్టిన్ చూస్తూ ఉండేది. క్రిస్టిన్ కొన్నాళ్ళు విరామం కావాలని కోరుకొన్నందు వల్ల నివేదితే మళ్ళి బాధ్యతల్ని వహించింది. పుష్పావతి అనే ఉపాధ్యాయిని పాఠశాల కార్యకలాపాలని కొద్ది రోజులు చేపట్టింది. ఆమె కాక సిస్టర్ సుధీర్ కూడ బాధ్యతలు తీసుకొంది. తీవ్ర విప్లవవాదిగా ఉంటూ మనసు మారిపోయి, బేలూర్‌మఠంలో శిష్యత్వం సంపాదించిన దేవ బ్రతకు సిస్టర్ సుధీర చెల్లెలు ఆమె పాఠశాలకు పూర్తిగా అంకితమయి బాధ్యతలు నిర్వహించేది. పాఠశాల నిర్వహణలో నివేదితను వ్యాకుల పరిచిన కష్టాలు ఆర్థిక పరమయినవి. శ్రీమతి బుల్ కుమార్తె బలియా చేసిన ధనసహాయం అంతగా చాలేదికాదు. పాఠశాల శాఖలు మరి రెండు ప్రారంభించారు. కాని కావలసిన ధనం లేకపోవటం వల్ల వాటిని మూసి వేయటం జరిగింది.

అప్పటికి పాఠశాలలో డెబ్బది మంది విద్యార్థినులు ఉండేవారు. నివేదిత వారికి భూగోళ శాస్త్రం, చరిత్ర, కుట్టుపని, చిత్రలేఖనం నేర్పేది. ప్రతి విద్యార్థిని విషమై ప్రత్యేకంగా పూర్తి బాధ్యత వహించి వారి వారి బాగోగులు చూస్తూ తగిన చర్యలు తీసుకొంటూ ఉండేది. అందువల్ల వారందరు ఆమె క్రమశిక్షణకు బద్ధులై సద్వర్తన బోధనల్ని విని శ్రద్ధా సక్తులతో ఉండేవారు. వారు చిత్రించిన చిత్రాల్ని ప్రదర్శనల్లో ఆడంబరంగా, పెట్టేది. ఒక విద్యార్థిని నమూనాగా గీచిన ''అల్పన'' అనే రేఖా చిత్రాన్ని, ప్రఖ్యాత కళాపారగుడు రసజ్ఞుడు అయిన ఆనంద కుమారస్వామి చూసి చాలా మెచ్చుకొవటంతో నివేదిత ఉప్పొంగి పోయింది.

పాఠశాల నిర్ణీత పాఠ్యక్రమంలో వేద ఉపనిషద్ భాష అయిన సంస్కృతాన్ని ప్రవేశ పెట్టటం అన్న ఆలోచన తన విద్యార్థినులు సంస్కృతాన్ని తాళపత్రాల మీద వ్రాస్తారన్న విషయం ఆనందంతోను ఉత్సాహంతోను ముంచివేసింది. హిందూ మత సంబంధంగాను, దేశ చారిత్రాత్మకం గాను ఉన్న ప్రదేశాలకి విహారయాత్ర తీసికెళ్ళాలన్న తన కోరిక తీరకపోయినా, బదులుగా,

వారిని పురావస్తు ప్రదర్శనశాలకి జంతు ప్రదర్శనశాలకి, దక్షిణేశ్వర్‌కి విలాస యాత్రలు తీసికొని వెళ్ళేది. ఆ ప్రదేశాల పూర్వాపరాలు వాటి ప్రాముఖ్యత గురించి ఆమె ఇచ్చే వివరణల మూలంగా ఆ ప్రయాణాలు విద్యార్థినులకి ఎంతో ఆసక్తిదాయకంగా ఉండేవి. ఇటువంటి వైవిధ్యమయిన కార్యక్రమాలు చేపట్టి, స్వీయదేశమయిన బారత వర్షం మీద విద్యార్థినులకి అభిమానం భక్తి పెంపొంద జేసే ప్రయత్నాల్లో నివేదిత ఎల్లప్పుడు నిమగ్న అయి ఉండేది.

వారిని బ్రహ్మో పాఠశాలకు కూడ తీసికొని వెళ్ళేది. అక్కడకి ప్రక్కనే ఉన్న గ్రీన్ పార్క్ ప్రదేశంలోకి తీసుకెళ్ళి దేశభక్తిని పెంపొంద చేసే ప్రసంగాల్ని వినిపించేది. స్వదేశీ వస్తుప్రదర్శన శాలల్లో వారి చేతి పని వస్తువుల్ని ఆడంబరంగా ప్రదర్శింప జేసేది. విద్యార్థినులకి నూలు వడికే అభ్యాస తరగుతుల్ని కూడ ప్రారంభించింది. ''వందేమాతరం'' పాట ప్రభుత్వం నిషేధించింది. దానిని ఉల్లంఘిస్తూ ప్రతిరోజా వారి చేత ఆగీతం ఆలాపన చేయించేది. స్వామి వివేకానందుల జీవిత విశేషాల్ని వారిచేత చదివిస్తూ ఉండేది. కొన్ని భాగాల్ని తనే చదివి విని పించేది. ప్రత్యేక సమయాల్లో వారిని బేలూర్ మఠానికి పావనిమాత దర్శనానికి తీసుకొని వెళ్ళేది. విద్యార్థి నుల్లో బాల వితంతువుల విషయమై ఎక్కువ శ్రద్ధ వహించేది.

మొత్తం మీద పాఠ్య విషయాలపై బోధనల నిచ్చే ఒక సంస్థగా మాత్రమే కాక, విద్యార్థినులకు రక్షణనిచ్చే మానసిక ఆశ్రమంగా, వారి జీవిత యోగక్షేమాల్ని వహించే భద్రతా భవనంగా, పాఠశాలను తీర్చిదిద్ది రూపొందించింది.

ఆర్థికంగా ఎన్నో యిబ్బందులకీ కష్టాలకీ గురి అయింది. అయినా భగవంతుని దీవనలు దయ, తన యందుండటం వల్లనే పాఠశాల విషయంలో శాయశక్తుల కృషి చేయగలిగి కృతకృత్యురాలయినానని నివేదిత సంతృప్తి చెందింది.

గ్రామంలో ఉన్న తమ ఇంటి నుంచి కలకత్తా వచ్చినప్పుడల్లా శారదా మణి మాత పాఠశాల చూడ్డానికి వచ్చేది. తాను కలకత్తా వదిలి బయటి ఊళ్ళు తిరగటానికి వెళ్ళేముందు పావని మాతను దర్శించి ఆమె దీవనలు పొందేది. శారదామణి మాత అంటే తనకెంతో పవిత్రమైన భక్తి. ప్రేమ పూర్వకంగా లాంఛనాలన్నింటిని పాటిస్తూ ఆమెనాహ్వానించి అతిథి సత్కారాలన్నీ చేసేది. పావని మాతకు కూడ నివేదిత మీద ఉన్న ప్రేమ వాత్సల్యాలకి పరిధులుండవు. తనకు డబ్బు ఎక్కువగా లేనందువల్ల తననుకొన్నంత ఘనంగా సేవచెయ్యలేకపోయానే అని నివేదిత ఎప్పుడూ ఖేదపడుతూ ఉండేది. నివేదితకు మాత తనని కన్నతల్లి. మాతకు నివేదిత తాను కన్న కూతరు.

వారు ఒకరికొకరు రాసుకున్న ఉత్తరాల్లో ఆమాతృ పుత్రీ వాత్సల్యం ప్రస్ఫుటంగా కనపడేది. బంగాలీ భాషలోనే నివేదిత మాతతో సంభాషించేది. తన విద్యార్థినులకి బంగాలీ భాషలోనే పాఠాలు బోధించేది. ఆనాడు వివేకానంద స్వామి మార్గరేట్ నోబెల్‌ని హైందవ మహిళల సేవ కోసరమే భారతదేశం రమ్మని అహ్వానించారు. సిస్టర్ నివేదిత దృష్టిలో శారదామణి మాత మూర్తీభవించిన ఆదర్శ హైందవ మహిళ. తనెప్పుడు కలత చెందినా, మాత సమక్షం చేరుకొనిచింతల్ని మరిచి మనస్సుని తేలికపరచుకొనేది.

భగవంతుని పిలుపు అందుకోవలసిన ఆఖరి సమయం సమీపిస్తున్న సూచనని గ్రహించి, తానెన్నుకొన్న మాతృభూమి భారతదేశ జీవన సరళిలో అతర్భాగమై, అతర్లీనమై నివేదిత మెలగుతూ, తన జీవితం లోనే ఒక ప్రత్యేక దశను చేరుకొంది.

# 9

# అంతిమ గమ్యానికి ప్రస్థానం

భారతావని ప్రాచీన కాలం నుంచీ, పరంపరగా ఒక సుస్థిరమైన జీవశక్తిని సంతరించుకొంది. నివేదిత ఆ శక్తిని తనలోకి కూడతీసుకొని ఈ దేశంతో తాదాత్మ్యం చెంది, నిండు హృదయంతో దేశ పురోగమన మార్గాల్లో పయనిస్తోంది. ఆ ప్రయాణ భాగంగా బోసు దంపతులతోను వారి సోదరుని కుమారుడు ఆనంద మోహన్‌బోసుతోను కలిసి కేదారనాథ్, బదరీ నారాయణ్ యాత్రాస్థలాల్ని దర్శించటానికి బయలు దేరింది. హరిద్వార్ మీదుగా ఆరెండు పుణ్యక్షేత్రాలకి వెళ్ళి శ్రీనగర్ మీదుగా తిరిగి వచ్చారు.

పారమార్థికంగా, ఈశ్వరేచ్ఛా ప్రేరితంగా, ఎంతో ఉత్సాహం తనలో పెల్లుబుకుతోంది. బారత జాతీయ జన సామాన్యంలో ఒక భాగస్వామినిగా ఆమె నిండైన అనుభూతిని పొందుతోంది. ''కేదారనాథ్, బదరీనారాయణ్, ఎ పిల్‌గ్రిమ్స్ డయిరీ'' అన్న పేరుతో ఆయాత్రా స్థలాల్లో తన అనుభవాల్ని ఆనందాల్ని పొందు పరుస్తూ ఒక పుస్తకం రాసింది. వాటినే ఒక వ్యాసంగా ''మాడర్న్ రివ్యూ'' ప్రచురించింది.

కలకత్తా తిరిగి వచ్చిన తర్వాత శ్రీమతి బుల్‌కి సుస్తీగా ఉందని సమాచారం అందింది. స్వామి వివేకానంద శ్రీమతి బుల్‌ని ధీరమాత అని పిలిచేవారు. ఆధీర మాత నివేదిత పాఠశాల నిర్వహణకి, తన రచనల్ని, బోసురచనల్ని ప్రచురించటానికి వలసిన ధన సహాయం చేసింది. తక్షణమే శ్రీమతి బుల్ సన్నిధిని చేరుకోగల శక్తితో లేదు తాను. తన అశక్తతను తెలియ జేస్తూ నిజంగా తనకే మృత్యువు ఆసన్నమయి తలపెట్టిన క్రియా కలాపాలన్నీ అసంపూర్తిగా నిలిచి పోతాయన్న తన భావనను భయ ఆందోళనను వ్యక్త పరుస్తూ శ్రీమతి బుల్‌కి ఉత్తరం రాసింది.

ఈలోగా పూజా సెలవు దినాల్లో డార్జిలింగ్ వెళ్ళింది. అక్కడుండగా, శ్రీమతి బుల్‌కి చాలా సుస్తీగా ఉందనీ, తననొక సారి చూడడానికి చాలా ఆదుర్దా పడుతోందనీ టెలిగ్రామ్ వచ్చింది. దాంతో నివేదిత త్వరత్వరగా ప్రయాణమై శ్రీమతి బుల్‌ని చేరుకొంది. ఆమె పడక దగ్గరనే నివేదిత కూర్చొని వివేకానందుల

రచల్ని చదివి వినిపించేది. మరికొన్ని వేళల్లో తనూ శ్రీమతి బుల్ భారతదేశంలో ఒకరి నకొరు విడవకుండా ఎలా కాలం గడిపే వారో ఆమధుర స్మృతుల్ని జ్ఞాపకం చేసుకొంటూ శ్రీమతి బుల్ మనస్సుని ఉత్సాహ పరిచేది.

''మహిళల ప్రస్తుత పరిస్థితి'' అనే ఒక వ్యాసాన్ని రాసి, ఆ రచనని ''యూనివర్సల్ రేస్ కాంగ్రేస్ సమావేశంలో శ్రోతలకి వినిపించటానికి పంపించింది.

ఎక్కడున్నా శ్రీమతి బుల్‌తో తన సాహచర్యం మీదే ఆమె మనస్సు కేంద్రీకృతమయి ఉండేది. అదే ధ్యాసతో శ్రీమతి బుల్ ఆరోగ్యం నిమిత్తం స్థానిక చర్చి మందిరంలో ప్రార్థనలు చేస్తూ ఉండగా, పావని మాత జీవం ఉట్టి పడుతున్న కళాఖండంగా మేరీ మాతగా నివేదిత మనో నేత్రానికి గోచరించింది. అలాంటి దృశ్యం కనపడే భాగ్యం తనకచ్చిందని అబ్బుర పడుతూ పావని మాతకు, ఉత్తరం రాసింది.

పారమార్థికంగా మరో స్థాయిలో ఉన్నా, మానసికంగా నివేదిత కవి గడ్డు రోజాలు, చాల ఆందోళనతో గడిచాయి. శ్రీమతి బుల్ సోదరుడు శ్రీ తార్ప్ కూతురు ఒలియా ఆఖరి ఘడియల్లో తల్లి పడక దగ్గరనే ఉన్నారు. కాని ఒలియాకు నివేదిత పట్ల ఎందుకో చాలా అసహ్యం కలగటం ప్రారంభించింది. తన తల్లి ఆఖరి క్షణాల్లో ఆమె దగ్గరకు చేరి ఆమె ధనాన్నంతా కబళిద్దామని నివేదిత ఊహ అని ఒలియాకు అనుమానం కలిగింది. ఆఖరికి 1911 జనవరి 18న శ్రీమతి బుల్ కన్ను మూసింది.

ఇంక ఎంత త్వరగా భారత దేశం చేరితే తనకంత మంచిదని నివేదిత తలపోసింది. కాని శ్రీమతి బుల్ మరణ శాసనంలో ఏం రాసిందో తన కెంత డబ్బు సంక్రమించాలని ఉటంకించిందో తెలుసుకోవాలని అక్కడనే ఉండిపోయింది. అయితే స్నేహితురాలయిన కుమారి ఏలిస్ లాంగ్‌ఫెలో భవనానికి తన నివాసం మార్చుకొంది. తల్లి మరణ శాసనం లోపాలతో ఉందనీ అది చెల్లదనీ ఒలియా తగాదా లేవదీసింది. అందువల్ల అసలు నిజానిజాలు తేల్చే ప్రసక్తి శ్రీ తార్ప్ మహాశయునికే వదలి వేసి నివేదిత అమెరికా నుంచి బయలు దేరింది.

స్వామి వివేకానంద పరమపదించిన సమయాన్నుంచి తనకు సహచరుడు స్నేహితుడు అయిన స్వామి సదానంద మరణించారన్న దుర్వార్త నివేదిత చెవుల పడింది. అమెరికాకు, ప్రయాణం అయ్యే ముందు రోజుల్లో స్వామి సదానందకి సుస్తీగా ఉండటం వల్లనే ఆయన పడక దగ్గరే ఉండి అన్ని సదుపాయాలు నివేదిత చూస్తూ ఉండేది.

అమెరికా నుంచి బయలు దేరి లండన్‌లో రాట్‌క్లిఫ్ మహాశయుడ్ని ఇతర స్నేహితుల్ని కలుసుకొంది. కుమారి మెక్‌లియడ్‌ని శ్రీమతి లెగ్గెట్‌ని పారిస్‌లో కలుసుకుంది. ఆ స్నేహితుల్ని అలాగ అప్పుడు కలుసు కోవడం ఆఖరిసారిగా పరిణ మించింది.

మార్సెయిల్స్ నుంచి 1911 మార్చి 23న భారతదేశానికి బయలు దేరి ఏప్రిల్ 7న బొంబాయి వచ్చింది. ఆతర్వాత కలకత్తా చేరుకొంది. ఆ సమయానికి దక్షిణ దేశయాత్ర ముగించుకొని శారదామణిమాత కలకత్తా వచ్చింది. నివేదిత శారదామణిమాతను కూడ కలుసుకొంది.

మరణం ఆసన్నమవుతోందన్న భావన ఆమెలో రోజా రోజుకీ బలపడుతోంది. స్వామిజీ ఆదేశించిన సేవానిరతి కార్యక్రమాల్లో తాను వైఫల్యం చెందటం జరిగిందేమోనని నివేదితకి భయాందోళనలు పెచ్చుపెరిగి పోతున్నాయి.

బోసు దంపతులతోను, అరబిందోఘోష్‌తోను కలిసి నివేదిత మాయావతి ఆశ్రమానికి వెళ్ళింది. డాక్టరు బోసు మరో పుస్తకం రాయటం ప్రారంభించారు. (నివేదిత ఆరచనలో ఆయనకు ఎంతో సాయ పడింది.) అక్కడ అద్వైతాశ్రమంలో బోసుమహాశయులు మాట్లాడారు. నివేదిత కూడ ఆశ్రమ వాసులనుద్దేశించి, ''మేధా సంబంధమయిన సంస్కృతి'' గురించి ప్రసంగించింది. జులై మూడవ తారీఖున వారందరు కలకత్తా తిరిగి వచ్చారు.

ఆరోజుల్లో పాఠశాల భవిష్యత్తు నివేదితను తగని చికాకు పెడుతూ ఉండేది. శ్రీమతి బుల్ వీలు నామా ద్వారా చెందుతుందన్న పైకం వచ్చే ధోరణి కనపడటం లేదు. నివేదిత నోరు తెరిచి అడగాలే కాని ప్రభత్వం ఎంత ధనం అన్నా సమకూరుస్తుంది. ఆ విషయంలో తన తరపున ఒక్క మాట చెప్పటానికి లేడీమింటో ఉండనేఉంది. అయితే విదేశీ ప్రభుత్వం దగ్గర నుంచి ధనసహాయం అర్థించటం నివేదిత నియమావళికి వ్యతిరేకం. నిజానికి సిస్టర్ నివేదిత పాఠశాల సమితి వారు ఏనాడు ప్రభుత్వ సహాయాన్ని అర్థించనేలేదు. స్వాతంత్ర్యం సిద్ధించిన తర్వాత జాతీయ ప్రభుత్వం ఏర్పడ్డాక మాత్రమే వారి సహాయం తీసుకోవటానికి పాఠశాల సమితి వారు ఒప్పుకొన్నారు.

శ్రీమతి బుల్ వీలునామా ప్రకారం పాఠశాలకు కొంత ధనం ఏర్పాటు చేయబడిందని శ్రీతార్ప్ తెలియజేశాడు. దాంతో నివేదితకు గొప్ప ఊరట కలిగింది.

పాఠశాల విషయమై ఆమె దిగుళ్ళు తొలగినా, మరణ వియోగాల వల్ల ఆరోజుల్లో ఆమె దుఃఖానికి గురి అవటం జరిగింది. స్వామి వివేకానంద తల్లి

భువనేశ్వరీ దేవి మరణం చెందింది. ఆఖరి ఘడియల్లో నివేదిత ఆమె దగ్గరనే ఉంది. శ్రీమతి బుల్ కూతురు ఒలియా మరిణించిందన్న వార్త వచ్చింది. తనంటే ఏదో శతృత్వం పెట్టుకొన్నా ఒలియా మరణం నివేదితను దిగ్భ్రాంతి పరిచింది. నివేదిత హృదయాన్ని తల్లడిల్ల చేసిన మరో వార్త స్వామి రామకృష్ణానంద మరణం. ఆయన స్వామి వివేకానంద నమ్మిన సహచరుడు. మద్రాసు ప్రయాణాల్లో నివేదిత ఆయన్ని కలిసికొంది. స్వామి రామకృష్ణానందుని ఆధ్యాత్మిక శక్తి సామర్థ్యాలు తన్నెంతో ముగ్ధురాల్ని చేశాయి.

మరొక దురదృష్ట కరమైన సంఘటన వేరే విధంగా తటస్థించింది. అమెరికా నుంచి తిరిగి వచ్చిన తర్వాత సిస్టర్ క్రిస్టిన్ నివేదిత ఉన్న మాయావటి ఆశ్రమానికి వచ్చింది. నివేదితతో కలిసి ఉండబోనని బ్రహ్మోబాలికా పాఠశాలలో ఉపాధ్యాయినిగా చేరబోతున్నాని క్రిస్టిన్ చెప్పింది. అలా వారిద్దరు విడిపోవటం నివేదితకు మానసికంగా ఎంతో నిరుత్సాహం కలిగించింది. ఆవిధంగా జరగడానికి నివేదితకు కారణాలేవీ కనిపించలేదు.

క్రిస్టిన్ లేనందు వల్ల పాఠశాల విషయంలో నివేదిత యింకా ఎక్కువగా కష్టపడటం ప్రారంభించింది. శరీర ప్రయాస ఎక్కువ అవుతున్నా బోసు మహాశయునికి తోడ్పడుతూనే ఉంది. మానసికంగా నివేదితపై మరొక దెబ్బ తగిలింది. సుధీర కూడ నివేదిత పాఠశాల విడిచి బ్రహ్మో పాఠశాలలో, బహుశా క్రిస్టినీ ప్రోత్సాహంతో చేరటం జరిగింది. ఆ తర్వాత నివేదితను కలుసుకోవటానికి వారిద్దరు రాలేదు. అనంతరం కొన్నాళ్ళకి నివేదితకుసుస్తీగా ఉందనీ, ఆమె డార్జిలింగ్‌లో ఉందనీ, వారిద్దరికి తెలియ వచ్చింది. అప్పుడు నివేదితను చూడడానికి వారిద్దరూ డార్జిలింగ్ వెళుదామనుకొన్నారు. కానీ, అప్పటికే అంతా అయిపోయింది.

డార్జిలింగ్ వెళ్ళేముందు నివేదిత చాలామందిని కలుసుకొని శలవు తీసుకుంది. ప్రఖ్యాత నాటకరచయిత గిరీష్ చంద్ర ఘోష్ చాలా అస్వస్తతగా ఉండటం వల్ల ఆయన్ని చూడ్డానికి వెళ్ళింది. చాలా సుస్తీగా ఉంటూన్న కూడ, ''తపోబల్'' పవర్ అఫ్ ఆస్టియర్ మెడిటేషన్'' అనే నాటకాన్ని ఆయన రాయటం పూర్తి చేస్తున్నారు. ఆసంగతి తెలిసి డార్జిలింగ్ నుంచి వచ్చిన తర్వాత ఆ పుస్తకాన్ని చదువుదామ్న ఉద్దేశం నివేదిత తెలియ పరచింది. నివేదిత డార్జిలింగ్ వెళ్ళి కొన్నాళ్ళకు అక్కడే మరణించిందని తెలిసి గిరీష చంద్ర నాటకాన్ని నివేదితకు కృతి సమర్పణ చేశారు. ప్రయాణం ముందు నివేదిత స్వామి శారదానందను గొపాల్‌మాను శారదామణి మాత సదనంలో కలిసికొంది. అటుపిమ్మట బోసు దంపతులతో కలిసి డార్జిలింగ్ వెళ్ళింది.

డార్జిలింగ్‌లో మొదటి కొద్దిరోజులు మాత్రం ప్రశాంతంగా వెళ్ళి పోయాయి. శాండక్ ఫ్యూ శిఖరానికి యాత్ర వెళదామని ఆలోచించారు కూడాను. తీరా ఆ ప్రయాణం రోజు నివేదితకు రక్త విరోచనాలు ప్రారంభమయాయి. అప్పటిరోజుల్లో ప్రఖ్యాత అల్లోపతి వైద్యుడు డాక్టర నీలరతన సర్కార్ డార్జిలింగ్‌లోనే ఉండటం తటస్థించింది. నివేదిత వైద్యం డాక్టరు సర్కార్ చేపట్టారు. అయితే ఏం ఆ మందులేవీ ఉపయోగించలేదు. మృత్యువు వేగంగా ముంచుకు వస్తోందని మాత్రం నివేదితకు తెలుసు. ధైర్యంగా మృత్యువుని ఎదుర్కోవటానికి ప్రయత్నాలు చేస్తూనే ఉంది. ఏనాడో మృత్యువు గురించి రాసిన ఉదంతం తాను ఆనాడు అక్షరాలా అనుభవిస్తున్నాని ఆమె గ్రహించింది.

''ఈ పదార్థాల భౌతిక అస్తిత్వంలోకి చొచ్చుకొని దూసుకుపోయి, మిళితమై ఏకమై పోయే అవ్యక్తమయిన మరి ఒక అస్తిత్వం ఉందనీ, – దాన్ని ధ్యానం అని పిలవండి – ఆ మరో అస్తిత్వం అంతరార్థం మృత్యువు, అని నిన్న రాత్రి నా ఆలోచనా పరంపర సాగిపోయింది.''

''కాని అది ఒక ఉనికి స్థానం నుంచి మరొక ఉనికి స్థానంలోకి చేరుకోనే ఒక మార్పు వంటిది కాదు. – అది ఒక భౌతిక అస్తిత్వంకల ఒక పదార్థం కాదు గనక, దాని ఉనికికి ఒక స్థానం ఉండాలన్న నిర్ణయం అనవసరం – కాక ఈ శరీరం అనే ఉనికి స్థానంలో జీవియొక్క భౌతిక అస్తిత్వం ఉంది అన్న భావనను వదలి పెట్టాలి. వదలి పెట్టి ధ్యాన శక్తితో మనోబలంతో ఈ భౌతిక అస్తిత్వ స్థితి లోంచి – ఆ మరో అస్తిత్వ స్థితిలోకి పూర్తిగా లోతుగా మునిగి జీవి మనస్సు నిమజ్జనం అయిపోవాలి.

ఈ మరో అస్తిత్వం ఉంది అన్న బావనను గట్టిగా నమ్మితే– ఆ భావన మీద నమ్మకం గనక మనకి సంతృప్తిని కలుగ చేసేటట్టయితే – మరణించిన మన ఆప్తులు భౌతికంగా మన దరిదాపుల్లోనే ఉన్నారని అనుకొని తృప్తి పడవచ్చు. అయినప్పటికి ఈ విశాల విశ్వంలో, అఖండ స్వేచ్ఛా వాయువుల్లో ధన్యాత్ములయిన వారి భౌతిక సామీప్యం స్వతంత్రంగా మాత్రం ఉంటుంది.

ఈ విశాల విశ్వంలోని అన్ని పదార్థాల సముదాయం హద్దులు పరిమితులు ఉన్న పదార్థ సముదాయంతో మిళితమయి కలిసి పోయినప్పుడు, ఆరెండు సముదాయాల కలయిక అంచుల్లో మనం నిలబడి, అపరిమితత్వంలోని పరిమిత త్వాన్ని సమ్మేళనం ద్వారా, కలిగే ఆ దివ్య ఆనంద స్థితిని మనపరమయేలాగ మనని మనమే శాసించుకోవాలి.

మృత్యువు అంటే అంతరార్థం – స్వీయ అస్తిత్వం అనే నూయిలోకి శరీరం అనే రాయి పడి మునిగి పోయినట్టు – బహిరస్తిత్వాన్నించి జీవి ధ్యాన

ముద్రలో అంతరస్తిత్వంలోకి పోయి మిళితం అయిపోవటమే అన్న భావన నాలోచాలా బలపడుతోంది. మరణస్థితి జీవి శరీరంలో నిశ్శబ్దంగా, దీర్ఘంగా ఆరంభమయింది. ఆ స్థితిలో తన చర్యల్ని అనుభవాల్ని కలగలిపి స్వాభావికమయిన ఆలోచనలతో వాటిని నెమరు వేసుకొంటూ, ఆ జీవి మనస్సు జీవన్మరణాల మధ్య వ్రేలాడుతూ, స్తబ్దంగా ఉండిపోతుంది. జీవాత్మ క్రమంగా ఆ ఆఖరి ఘడియల్లో శరీర బంధం నుంచి విడిపోతుంది. ఆ విడిపోవటంతో మరొక నవజీవనం ఏర్పడటం ఆరంభం అయిందన్న మాట.

మనస్సులో ఏ ఒక్కరిమీద ప్రతికూలత పెట్టుకోకుండా, అందరి మీద ప్రేమ వాత్సల్యాలతో అందరి శుభం అకాంక్షిస్తూ, విశ్లేషించు కొన్న ఒక భావనతో తనపూర్తి జీవితాన్ని మలచుకోవటం వ్యక్తికి సాధ్యమా? అని నాలో నేను అనుకొంటూ ఉంటాను. అట్లా పూర్తి జీవితాన్ని మలచుకోవటం వ్యక్తికి సాధ్యమయితే, మరణం ఆసన్నం అవుతున్న ఆఖరి ఘడియల్లో మహోన్నత మయిన ఆ ఏకైక బావనతో ఆ జీవి మనస్సు నిండిపోతుంది. అలా నిండిపోయిన మనస్సుతో, స్వార్థ పూరిత మయిన ఏ ఇతర ఆలోచనలు లేకుండా, భవిష్యత్తులో ఆ జీవి మనస్సు విముక్తి చెందుతుంది. ఇతర వ్యక్తుల కోరికలు తీర్చి, వారిని కష్టాలనుంచి గట్టెక్కించి తన ఉనికి శక్తితో శాంతిని శుభాశీస్సులని ఎల్లప్పుడు ఆకాంక్షించే భావనకల వ్యక్తిగా మాత్రమే తనవి తాను తెలిసికోవటం జరుగుతుంది'' అని మృత్యువు గురించి నివేదిత వ్రాసింది.

డార్జిలింగ్‌కి వెళ్ళేముందు నివేదిత ఒక బౌద్ధ ప్రార్థనను ఇంగ్లీషులోకి అనువాదం చేయించి అచ్చుకొట్టించి, చాలమందికి అందజేసింది. ఆ ప్రార్థనా పాఠాన్ని ఆమెకు చదివి వినిపించారు.

''శ్వాసించే ప్రతిప్రాణీ... శత్రు రహితంగా... అవరోధ రహితంగా దుఃఖాన్ని అధిగమించే విధంగా, సంతోషాన్ని పొంది వారు వారు ఎన్నుకొన్న మార్గాల్లో స్వేచ్ఛగా ముందుకు సాగిపోవాలి.''

''ప్రాక్పశ్చిమాల్లోను, ఉత్తర దక్షిణాల్లోను, జీవించే అన్ని ప్రాణులు శత్రు రహితంగా అవరోధ రహితంగా దుఃఖాన్ని అధిగమించే విధంగా, సంతోషాన్ని పొంది వారు వారు ఎన్నుకొన్న మార్గాల్లో స్వేచ్ఛగా ముందుకు సాగిపోవాలి!'

మెల్లని గొంతుతో తన అభిమాన ప్రార్థనను మననం చేసుకొంది. ''అసతోమా సద్గమయ; తమసోమాజ్యోతిర్గ మయ; మృత్యోర్మా అమృ తంగమయ;''

''భగవన్నస్మాసు సాకల్యం ప్రవిశ ప్రవిశ! సర్వదా సర్వథా చ!
హే! భయానక భగవన్, రక్షస్వా ఉ నవిద్యయా:

ధర్మయా ఉ స్మభ్యం భవదీయా ఉ ఉననం మధురం దయార్ద్రంచ॥''
ఓ ఘోరమయిన స్వరూపమా! మాలోంచి దూసుకపోయి చొచ్చుకుపోయి మమ్మలను చేరుకో! మా భవిష్యత్తు నీ చేతుల్లో ఉంది. అజ్ఞానంనుంచి మమ్మ రక్షించు. నీ మధుర కరుణామయ వదనంతో మమ్మ వీక్షించు!

1911 అక్టోబరు 13వ తారీఖు తెల్లవారింది. ఆరోజు సూర్యోదయం చూడగలుగుతాననే నివేదిత అందరికి చెప్పింది. ఏ సరిహద్దు దాటిన తర్వాత ఏ బాటసారి తిరిగి రావటం తటస్థించదో అక్కడికి నివేదిత చేరిన సమయంలో ఆదిత్యుని దివ్య కిరణాలతో ఆమె గది తేజోవంతమయింది.

ఆసమయానికి డార్జిలింగ్‌లో ఉన్న కలకత్తా పౌరులు, ఆ ఊరి అశేషజనం ఆమె అంతిమయాత్ర ఊరేగింపులో పాల్గొన్నారు. నివేదిత సహచరుడు రామకృష్ణ మిషన్‌కి చెందిన గనేనీ మహారాజ్ అంత్యక్రియలు జరిపాడు. ఆ సాయంత్రం 4.15 నిముషాలకి చితికి నిప్పు అంటించటం జరిగింది. రాత్రి ఎనిమిది గంటల కల్లా అంతా అయిపోయింది. దహన సంస్కారాలు జరిగిన ఆ ప్రదేశంలో డార్జిలింగ్ పౌరులు ఆమె సంస్మరణార్థం ఒక సమాధిని కట్టించారు. ఆ నిశ్శబ్ద వాతావరణంలో ఆమె దీర్ఘనిద్ర సాగించింది. ఆ సమాధిపైన ''తన సర్వస్వం భారతావనికి అర్పించిన సిస్టర్ నివేదిత ఇక్కడ విశ్రాంతి తీసుకొంటోంది'' అని అక్షరాలతో చెక్కారు.

ఐర్లండులో జన్మించి, భారతదేశాన్ని మాతృభూమిగా భావించి, హైందవ ఆధ్యాత్మిక, పారమార్థిక తత్త్వాల్ని అనుభవైక వేద్యం చేసుకొంటూ, దేశసేవా నిరతిలో చివరి శ్వాస దాక నిమగ్న అయి గురువాదేశించిన ధర్మ సూత్రాల్ని ఆఖరి క్షణం వరకు నెరవేర్చగలిగానన్న గాఢ విశ్వాసంతో నివేదిత ఈ ప్రపంచాన్ని విడిచి వెళ్ళిపోయింది.

# 10

# సమకాలికులపై నివేదిత ప్రభావం

పగలు రాత్రి అన్న విచక్షణ లేకుండా అన్ని వేళల్లోను, పురుషులు స్త్రీలు, బాలురు బాలికలు నివేదిత క్రిస్టిన్ నివాసమయిన ''సోదరీ మణుల సదనం'' లోకి ధారాళంగా వచ్చి సమావేశమయేవారు. అల్లా అని భారతదేశ చరిత్రకారుడు అయిన జదునాథ సర్కార్ రాశాడు. ఆదివారం ప్రాతః సమయాల్లో తేజోశాలులయిన నాయకులు సమావేశమయేవారు. ప్రభుత్వ ఉన్నతోద్యోగులు, పురప్రముఖులు, కళాకారులు, రచయితలు కలిసి అందరికి సంబంధించిన విషయాలపై చర్చలు జరిపే వారు. ఆ చర్చల పర్యవసానంగా సమాజానికి సాంఘిక సాంస్కృతిక ప్రయోజనాలు సమకూరేలాగ కొన్ని కార్యాచరణ పథకాల్ని ఆ సమావేశాల్లో సూచించేవారు. కొందరు స్వార్థ పరులు తమ పబ్బంగడుపుకోవటానికి అక్కడికి హాజరు అవుతూన్నా, చాలమంది సామాన్య ప్రజలు ఆమె చెప్పేవి విని ఆనందించటానికి అక్కడికి వెళ్ళేవారు. ఆమె ప్రతిభా విశేషాలు చాలా రంగాల్లో నిలకడైన ఫలితాల్నిచ్చాయి. ప్రజల్ని ప్రభావితుల్ని చేశాయి.

నివేదిత డబ్బు విషయంలో ఏమాత్రం వెనుదీయకుండా జగదీశ చంద్రబోసుకి ఎంతో ధన సహాయం చేసింది. బోసు రాసిన వైజ్ఞానిక విశేషాల్ని శాస్త్రీయ వివరాల్ని ప్రచురణ అవకుడా, బ్రిటిష్ శాస్త్రవేత్తలు ఎన్నో పన్నాగాలు పన్నారు. ఆయన రచనల్ని తొక్కి పెట్టారు. వాటిని దొంగతనం చేయటానికి కూడ ప్రయత్నాలు చేశారు. వారి దుష్ప్రయత్నాల్ని తెలుసుకొని బోసు మానసికంగా చాలా బాధ పడ్డారు. బ్రిటీష్ శాస్త్రవేత్తల చర్యల్ని నివేదిత అసహ్యించుకొని వారి దురుద్దేశాల్ని బహిరంగ పరిచింది. జగదేశ చంద్రబోసుకి సమయానికి డబ్బు అందేట్టు చూడడమే కాక, ఆయన గ్రంథరచనల్లో కూడ ఎంతో సహాయపడింది. ఆయన వ్యాసాలు ''ఫిలసాఫికల్ ట్రాన్సాక్షన్'' అనే పత్రికలో పడేట్టు కృషి చేసింది. శ్రీమతి బుల్‌ని ఒప్పించి ఆయన గ్రంథాలు ప్రచురించటానికి వలసిన ధనం నివేదిత బోసుకి అందజేసింది.

శాస్త్ర పరిశోధన శాలకు ఒక భవనాన్ని పెద్ద ఎత్తున నిర్మాణం చేయటానికి నివేదిత చాలా కృషిచేసింది. కానీ ఆమె జీవించి ఉన్నకాలంలో ఆ భవన నిర్మాణం జరగలేదు. ఆ తర్వాత ''బోస్ ఇన్‌స్టిట్యూట్'' అన్న పేరుతో బ్రహ్మాండమయిన ప్రయోగ శాల రూపొందింది. ఆ భవనం ఒక శాస్త్రీయ పరిశోధనశాలే కాక అది ఒక దేవాలయంగా ప్రభవిల్లుతోందని అందరూ వేనోళ్ళ పొగిడారు. ప్రారంభోత్సవం నాడు మాట్లాడుతూ, భవన నిర్మాణానికి తోడ్పడ్డ కొందరు ''నిశ్శబ్దపురంలో నివాసులై ఉన్నార''ని వారిని సంస్మరించుకొన్నారు. ''ఆలయ దీపారాధనకై జ్యోతిని తోడ్కొని పోతున్న లతాంగి'' అన్న శీర్షికను చెక్కించిన విగ్రహాన్ని సంస్థ భవనం లోపల నిర్మించిన జలధార కట్టడం మీద నివేదిత సంస్మరణార్థం అలంకరించారు. తక్కువ ఎత్తులోనే ఉన్న ఆ ప్రతిమ మూర్తి చూడగానే, నివేదిత ఆత్మ సంస్థను పరిరక్షిస్తూ ఆ పరిసరాల మీదుగా పరిభ్రమణం చేస్తోందా అన్న భావన కలుగుతుంది.

వయస్సులో చిన్నదయినా ఎల్లపుడు తన సంరక్షణ బాధ్యతను వహించిన దేవీమూర్తి, నివేదిత అని బోసు భావించేవారు. బోసు దంపతులు శలవు దినాల్లో పర్వత విశ్రాంతి స్థావరాలకి వెళ్ళినపుడల్లా నివేదిత వారి విహార యాత్రలో పాల్గొనేది. కలకత్తాలోనే ఉన్న రోజుల్లో బుద్ధివికాసం కలిగించే చర్చల్లో పాల్గొని, మనోరంజకమయిన పద్యాల్ని చదివి వినిపించేది.

పూర్వాచారాలని పాటించే హైందవ స్త్రీల విద్యావిషయంలో నివేదిత కున్న కార్య దీక్షత చూసి శ్రీమతి బోసు ముగ్ధురాలయింది. బ్రహ్మ సమాజానికి చెందిన మహిళలను ఉద్దేశించి వారికి ప్రయోజన కరమయిన విషయాలమీద మాట్లాడ్డానికి శ్రీమతి బోసు నివేదితను తీసుకొని వెళ్ళింది. శ్రీమతి బోసు, బోసు చెల్లెలు లావణ్య ప్రోవబోసు, నివేదిత పాఠశాలలో కొంత కాలం చదువు నేర్పేరు. నివేదిత అకాలమరణంతో డాక్టరు బోసు చాలా ఖిన్నుడయారు. ఆమె సంస్మరణార్థము ఒక లక్షరూపాయలు ఖర్చు చేయాలని తన వీలునామాలో ఆయన ఉటంకించారు. విద్యాసాగర్ వాణీభవనం అని పిలవబడుతున్న సంస్థలో, నివేదిత పేరున ఒక భవంతిని నిర్మాణము చేయటానికి ఆ తర్వాత శ్రీమతి బోసు లక్షరూపాయలు వినియోగించింది.

1937లో డాక్టరు బోసు మరణించారు. ఆయన సంస్మరణార్థం జరిగిన మహా సభలో మాట్లాడుతూ, కవీంద్రుడు రవీంద్రనాథ్ టాగోర్, నివేదిత బోసుకి ఎలా సహాయం చేసిందో చెప్పారు. టాగోర్ మహాశయులు కూడ నివేదితకు అ్యంత ఆప్త మిత్రులే. వీరు ఇద్దరు మొదటిసారి కలుసుకున్నప్పుడు తన కుమార్తె విద్యాబోధన ఆమె చెపట్టాలని టాగోర్ నివేదితను కోరారు. కానీ హైందవ

సంప్రదాయాల అనుసారంగా ఆ బిడ్డ చదువు కోవాలని సలహానిస్తూ ఆయన కోరికను నివేదిత నిరాకరించింది. ఆ విధంగా చెప్పటం టాగోర్‌కి ఆశ్చర్యం కలిగించింది. కానీ ఆమె జవాబు ఆయన్ని ముగ్ధుల్ని చేసింది. అందు వల్ల ఆమె ఇష్ట ప్రకారమే సంప్రదాయాలకి, ఆదర్శాలకి అనుగుణంగా విద్యనేర్ప వచ్చుననీ, ఒప్పుకొని ఆమె ఉపయోగార్థం తన గృహాన్ని పూర్తిగా వదిలి వేసినట్లు టాగోర్ ఆమెకు చెప్పారు. కాని ఇతర కార్యాల్లో నిమగ్న అయిఉండటం వల్ల తనకు వ్యవధి చిక్కదనీ, నివేదిత టాగోర్‌కి తెలియజేసింది.

స్వామి సదానంద పర్యవేక్షణ క్రింద హిమాలయా ప్రాంతాలలో విహార యాత్రకు నివేదిత కొందరు విద్యార్థుల్ని పంపింది. ఆ సందర్భంలో టాగోర్ తన కుమారుడు రతీన్‌ని కూడ ఆ బృందంతో పంపారు. టాగోర్ నివేదితను చాలాసార్లు కలుసుకున్నారు. ఆమెతో కూడ బోధ్‌గయ యాత్రల్లో పాల్గొన్నారు. టాగోర్ మహాశయుని ''కాబూలీవాలా'' కథని నివేదిత అంగ్లంలోకి అనువదించింది.

తూర్పు బెంగాల్ (ఇప్పటి బంగ్లాదేశ్) లో ఉన్న సైల్‌డాహ్ గ్రామంలోని తమ స్వగృహంలో ఉండటానికి టాగోర్ ఒకసారి వెళ్ళినప్పుడు డాక్టరు బోసుతో కలిసి నివేదిత అక్కడకు వెళ్ళి ఆయన ఆతిథ్యం పొందింది. నివేదిత గ్రామ సీమల్లోని పల్లె ప్రజలతో కలిసి పోయి వారితో కన్నతల్లిగా మెలగుతూ ఉండటం చూసి టాగోర్ ఎంతో ముగ్ధులయారు. పేద ప్రజలకు ఆమె చేసే సహాయం చూసి టాగోర్ ఆమెను ''లోకమాత'' అనిపిలిచేవారు. ఆమెతో అత్యంత మైత్రీ భావంతో మెలగుతున్నా కార్యరంగంలో ఆమెకు చేదోడు వాదోడుగా కలిసి పని చెయ్యటం టాగోర్‌కి సాధ్యంగా కనపడలేదు. వారు ఇద్దరు నమ్మిన పంథాలు వేర్వేరు అవటమే దానికి కారణని ఒకసారి టాగోర్ వివరించారు.

ఏది ఎలా ఉన్నా, నివేదిత తనని చాలా గొప్పగా ప్రభావితం చేసిందని అంగీకరిస్తూ, ఆమె సహచర్యం వల్ల ఎన్నో ప్రయోజనాలు తనకు సమకూరాయనీ, ఆమెను స్మరించుకొని తనెంతో మనోబలం పుంజుకోగలిగామనీ నివేదిత సంస్మరణ సభలో టాగోర్ ఆమెను చాలా కొనియాడారు. టాగోర్ తండ్రి మహర్షి దేవేంద్రనాథ్‌ని కూడ నివేదిత కలసికొంది. మహర్షి కోరిక మీద స్వామి వివేకానందతో కూడ వచ్చి నివేదిత ఆయన్ని మరొక సారి కలుసుకొంది. గొప్ప దేశభక్తురాలు, సాహితీ వేత్త టాగోర్ కవీంద్రుని మేనకోడలు అయిన సరళా గోసాల్‌తో కూడ నివేదిత చాలా సన్నిహితంగా ఉండేది.

భారతీయ లలిత కళారంగంలో ప్రాచీన సంప్రదాయ వారసత్వాన్ని పునరుద్ధరణ చేసి, ఆ సంప్రదాయాలను అనుసరించి పునర్యవ్వనం సంతరించు

కొన్ని కళాఖండాలను తీర్చిదిద్దగల కళా స్రష్టలకు ప్రోత్సాహం కలుగచేయటంలో నివేదిత కృషి ప్రత్యేకంగా ఫలించిందని చెప్పక తప్పదు. జపాన్ దేశానికి చెందిన కౌంటకొకసు ఒకకూర ఆరోజుల్లో నివేదితను కలిసికొన్నారు. ఆయన నిష్ణాతులైన విద్వాంసులు. కళాకారుడు. భారతదేశంలో చాలాకాలం ఉన్నారు. కళాఖండాలను మదింపుచేసి అంచనా వేయగల యుక్తాయుక్త పరిజ్ఞానాన్నీ, సమగ్రంగా తీర్మానం చేయకల శక్తి నైపుణ్యాన్ని నివేదిత సంతరించుకొనేట్టు ఆమెకు నేర్పి కౌంట్ ఒకకూర కృతకృత్యులయారు.

ఆ సమయంలో ఇ. చి. హావెల్ ప్రిన్సిపాల్‌గా ఉన్న కలకత్తా కళా పాఠశాల విద్యార్థులు తయారు చేస్తున్న కళాఖండాలను చూసి ఏవి నిర్జీవంగా ఉన్నాయో నివేదిత నైపుణ్యంతో మదింపు చేసింది. వారి కళాధోరణులు నివేదితకు ఏ మాత్రం నచ్చలేదు. ఒక దేశపు కళానైపుణ్యం, కళాకృషి, ఆ దేశపు సంప్రదాయాల్లోకి గాఢంగా చొచ్చుకొని పోవాలి. కాని, విదేశ కళాస్వరూపాల్ని చూసి, మోజుపడి, వాటి మాదిరిగా అనుకరించి కళను ప్రతికల్పనం చేసే పద్ధతుల్ని గర్హించాలి. ఆ అనుకరణ విడనాడి మార్పులు రావాలి అని నివేదిత నిర్ణయించింది.

స్వీయ దేశమంటే అపారమైన ప్రేమ వాత్సల్యాలే కాక సంతుష్టితో కూడిన గర్వం, దేశ భవిష్యత్తుపై అమోఘమయిన విశ్వాసం, తన ఉదాత్త ఉన్నత భావాల్ని వ్యక్తం చేయాలనే ప్రగాఢమయిన కోరిక ఇవన్నీ కలిసి జలధారగా పైకి పెల్లుబికి కళాకారుని నైపుణ్యం ద్వారా కళాఖండం సృష్టింపబడాలి. ఈ వాత్సల్యం, ఈ గర్వం, ఈ విశ్వాసం, ఈ కోరిక భారత వర్షంలో అపారంగా ఉన్నాయి. మన జానపద గేయాల్లోను, జానపద కళల్లోను, జానపద నృత్యాల్లోను, మనవారి చేతి పనుల్లోను, అవన్నీ ఉట్టిపడుతూ రూపకల్పన పొంది, భారతీయ కళాసృష్టి నైపుణ్యాన్ని పలురీతుల నిరూపించాయి.

గతకాలంలోని, వర్తమాన సమయంలోని, రాబోయే భవిష్యత్తులోని దేశ జీవన స్రవంతి ధోరణుల్ని పోకడల్ని లక్షణంగా అవగాహన చేసుకోవాలి అని ప్రఖ్యాతి చెందిన అవీంద్రనాథ్ టాగోర్‌కి కూడ నివేదిత తెలియ జెప్పింది. (ఈయన్ని ఇ. చి. హావెల్ నివేదితకు పరిచయం చేశారు.) ఆ కళా స్ఫూర్తి ఎట్లా కలగ చేయాలో నివేదిత ఆయనకు వివరించి నేర్పింది. ఉన్నత స్థాయికి చెందిన పాశ్చాత్య కళాఖండాల్ని పునర్ముద్రణం చేయించి ప్రచురించింది. వీటిలో రోమన్ కావ్యాల ప్రభావ ఫలితంగా ఏర్పడిన, 14, 15, 16 శతాబ్ద కాలము నాటివి కళాఖండాలు కూడ ఉన్నాయి. ఆ అన్ని కళాఖండాల ప్రాధాన్యాన్ని వాటిలో

గమనార్హమయిన విశేషాంశాల్ని సంగ్రహంగా వివరిస్తూ నివేదిత కొన్ని వ్యాసాలు రాసింది.

అజంతా, ఎల్లోరా కుడ్య చిత్రాల నమూనాలు తీసుకోవటానికి ఇంగ్లండు నుంచి కుమారి హిరింగ్ హామీ మనదేశం వచ్చింది. అబనీంద్రనాథ్ టాగోర్ ముఖ్య శిష్యులయిన నందలాల్ బోస్, అసిత్ కుమార హల్దార్, వీరు ఇద్దరు కూడ అజంతా ఎల్లోరాలకు వెళ్ళి శిలల మీద చెక్కిన వర్ణ చిత్రాలను చూసి నేర్చుకోవలసిన విషయాలన్నీ సేకరించాలని, నివేదిత వారికి గట్టి సలహా నిచ్చింది. ఆమె సలహా పర్యవసానంగా, కొన్ని పోకడల్ని వదలి పెట్టి, ముఖ్యమయిన మలుపు తిరిగి, భారతీయ లలిత కళాలహరి సంప్రదాయ సిద్ధమయిన మార్గంలో అడుగులు పెట్టి పునర్యవ్వనం సంతరించుకొందని చెప్పవచ్చు.

నివేదిత కనపరచిన కళా పరిజ్ఞానంతో ఉత్తేజం పొంది. ఇ.చి హావెల్ ''ఇండియన్ స్కల్ప్చర్ అండ్ పెయింటింగ్'' (భారతీయ చిత్రకళ, వర్ణచిత్ర కళ) అనే గ్రంథం రాసి ప్రచురించారు. గ్రీకు దేశీయుల ప్రాబల్య ప్రభావం వల్లనే భారతీయ చిత్రకళ ఉన్నత స్థాయిని చేరుకొందన్న వాదాన్ని ఆ గ్రంథంలో ఇ. హావెల్ పూర్వ పక్షం చేసి, ఖండించారు. అట్లా, ఆయన చేయటం యూరప్ దేశీయులకు నచ్చక, హావెల్ మహాశయుణ్ణి దుయ్యబట్టి మందలించారు. ప్రఖ్యాత కళాకోవిదుడు కళా విమర్శకుడు, ఆనంద కుమారస్వామి, నివేదితతో సహకరించి, భారతీయ లలిత కళావాహిని సుసంపన్నం చేశారు. హావెల్, నివేదిత, ఆనంద కుమార స్వామి త్రయం, కౌంట్ ఓకకూర కలిసి, ప్రస్ఫుటంగా గోచరించే ప్రత్యేక విలక్షణాలని ప్రతిభని పాశ్చాత్య విద్యాంసులకి ఎరుక పరిచి, భారతీయ కళా సంపద యొక్క ఉదాత్త ఉన్నత వైశిష్ట్యాన్ని వారికి నిరూపించారు.

అబనీంద్రనాథ్ శిష్యులు చాలామంది గురుపాద సన్నిధిని చేరి ''బెంగాల్ అనుయాయి లలిత కళావర్గం'', ''బెంగాల్ స్కూల్ ఆఫ్ ఆర్ట్'' గా సమకూడారు. వారు 1907లో ''ప్రాచ్య లలిత కళా భారతీయ సమితి'' అనే సంస్థని స్థాపించారు. ఈ ప్రాదుర్భావంతో భారతీయ లలిత కళ కొత్త కొత్త పంథాలను ఏర్పరచుకొని ముందంజలు వేయ నారంభించింది. యువ కళాకారులకు కళా బోధ చేయటంలో నివేదిత అమోఘమయిన పాత్ర వహించింది. ''నాకు కళామార్గాల్ని నిర్దేశించి ప్రధాన సూత్రాన్ని నేర్పిన దేవతా స్వరూపిణి''అని నందలాల్ బోస్ నివేదితను వర్ణించారు.

భారతీయుల లలిత కళల పునరుద్ధరణ కృషి భారతీయుల్ని నిద్రావస్థ నుంచి మేల్కొలిపి జాగ్రత్త పరిచే ఫలసిద్ధికి అపారంగా తోడ్పడుతుందనే విషయాన్ని నివేదిత వద్దనే తాను నేర్చుకోవటం జరిగిందని అసిత్ కుమార్ హల్దార్

చాటి చెప్పారు. యువకళాకారు లేర్పాటు చేసిన ప్రదర్శనలన్నింటినీ నివేదిత దర్శించింది. వారిని ప్రోత్సాహించింది. 1907 ఫిబ్రవరిలో నివేదిత ఒక చిత్రకళా ప్రదర్శనాన్ని తిలకించి పర్యావలోకనం చేస్తూ, అన్ని రంగాల్లోను భారతీయ చిత్రకళ సుసంపన్న మయిన అభివృద్ధిని పొందుతుందని అభిభాషించింది.

భారతీయ లలిత కళలమీద నివేదిత వ్రాసిన వ్యాసాలు చాలా మట్టుకు ''మోడర్న్ రెవ్యూ'' పత్రికలో ప్రచురిత మయాయి. మోడర్న్ రెవ్యూ పత్రిక ప్రతిభను డాక్టర్ బోసు నివేదితకు ఎరుక పరిచారు. ఆ తర్వాత నివేదిత పత్రిక ప్రముఖ సంపాదకుడయిన రామానంద చటర్జీతో పరిచయం అభివృద్ధి చేసుకుంది. పత్రిక నిర్వహణ విషయంలో రామానంద చటర్జీకి నివేదిత చాలా సహాయం చేసింది. సకాలానికి రచనల్ని పంపటమే కాక ఆయన తరఫున కొన్నాళ్ళు సంపాదకీయ బాధ్యతలను కూడ వహించింది. ఆ పత్రిక సాహిత్య వేదిక ద్వారా ఆమె చేసిన అపార కృషి, దేశ సాంస్కృతిక జీవన స్రవంతిని సుసంపన్నం చేసింది.

ప్రఖ్యాత జాతీయ నాయకుడు బిపిన్ చంద్రపాల్ నివేదితల మధ్య అన్యోన్య పరిచయము సహాయము అభివృద్ధి చెందింది. అది భారత దేశంలోనూ అమెరికాలోనూ కూడ సత్ఫలితాలనే కలుగజేసింది. కొన్ని కొన్ని విషయాల్లో వారిద్దరిలోనూ తీవ్రంగా బేధాభిప్రాయాలు ఉండేవి. బోస్టన్ నగరంలో జరిగిన మత విషయాల కాంగ్రేస్ సంవత్సర సమావేశంలో బిపిన్ చంద్రపాల్ చేసిన ఉపన్యాసం ఆమెను ఎంతగానో ఆకర్షించింది (నివేదిత కూడ ఆ సమావేశానికి హాజరయింది) ఇద్దరు ఎక్కువ మిత్ర భావంతో మెలగుతూ ఉండేవారు. బిపిన్ చంద్రపాల్ ప్రచురించే ''న్యూ ఇండియా'' పత్రికకు నివేదిత నియమబద్ధంగా కొన్ని రచనల్ని పంపించేది. చిరస్థాయిగా నిలిచి పోయేట్లు ''బెంగాలీ సాహితీ చరిత్ర'' అను ఉద్గ్రంధాన్ని పూర్తి చేయటానికి డాక్టర్ దినేష్ చంద్ర సేన్‌కి సిస్టర్ నివేదిత చాలా సహాయ పడింది.

ఆర్. సి. దత్తు మహాశయుల వద్ద బెంగాలీ సంస్కృత భాషలు నేర్చుకొంది. ''ది వెబ్ అఫ్ ఇండియన్ లైఫ్'' గ్రంథ రచన పూర్తికి దత్ వద్దనుంచి చాలా సహాయం, సలహాలను పొందింది. ''ఎకనామిక్ హిస్టరీ అఫ్ ఇండియా'' అనుగ్రంథాన్ని ఆయన రాయటానికి నివేదిత సహాయం చేసింది. జి. ఎ. నటేశన్, శ్రీనివాస అయ్యంగార్. తమిళ కవి శ్రీ సుబ్రహ్మణ్య భారతి ఆమెకు స్నేహితులు.

ప్రఖ్యాత చరిత్రకారుడు జదునాథ సర్కార్‌కి నివేదిత అంటే అపూర్వ మయిన, గౌరవ అభిమానాలుండేవి. ఏ విదేశీ వ్యక్తిగత అభిప్రాయాలకి లొంగిపోకుండా చారిత్రాత్మక సత్యాలనే ఉటంకిస్తూ చరిత్ర గ్రంథాల్లో రాయమని

సర్కార్‌ని నివేదిత ప్రోత్సాహించింది. చరిత్ర కారుడు డాక్టర్ రాధాకుముద్ ముఖర్జీ కూడ ఆమె దగ్గర నుంచి ప్రోత్సాహము పొందామని అంగీకరించి ఆమెకు ధన్యవాదాలు తెలుపుకున్నారు.

దేశ సేవకు అంకితమయిన ఉత్సాహ వంతులయిన యువకులకు ఆమె గురువు. గొప్ప విప్లవ వాది అయిన తారకానాథ్ తాను వ్రాసిన ''జపాన్, ఆసియా'' గ్రంథాన్ని నివేదితకు కృతి సమర్పణ చేశారు. ఇంకా ఎంతో మంది ఆమె వద్దనుంచి సహాయాన్ని, ప్రోత్సాహాన్ని పొందారు. తేజోమూర్తులయిన నాయకులు, స్త్రీలు పురుషులు ఆమెతో సమకాలికంగా ఉన్న చాలా మంది ఆమె స్నేహ బృందంలో, ఆమె అభిమాన వర్గంలో ఉన్నారు.

భారతీయుల వ్యక్తి గత జీవన విధానాలను, వారి ఆలోచనా పరంపరలను, పక్షపాత బుద్ధి లేకుండా గ్రహిద్దామని అభిలషించే యూరప్ దేశీయులకు నిజానిజాలు తెలియజెప్పి బావైక్యాన్ని పెంపొంద చేద్దామని నివేదిత ఎల్లప్పుడూ కృషి చేసింది. భారత దేశ సేవలో తన జీవితాన్ని పూర్తిగా అంకితం చేసి కృత కృత్యురాలయిది. పూర్తిగా భారతదేశానికి అంకితమయిన ఆమె జీవితము, లార్డ్‌మింటో, లేడి మింటో, రాట్‌క్లిఫ్ (స్టేట్స్‌మన్ పత్రిక సంపాదకుడు) ప్రభృతులను గాఢంగా ప్రభావితం చేసింది. ఆలాగ ప్రభావితులయిన వారు ఇంకా చాలామంది ఉన్నారు. నివేదిత రాసిన రచనలు, ఆమె స్వయంగా తనకిచ్చిన మార్గదర్శ పూరిత సలహాలు, భారతీయుల ఆలోచనా పరంపరలను పూర్తిగా అవగాహన చేసుకోవటానికి తనకెంతో సహాయ పడ్డాయని ఉటంకిస్తూ, ఆక్స్‌ఫర్డ్ విద్వాంసుడు, డాక్టర్ టి. కెషెయిన్ వివరంగా వ్రాశాడు.

ఒక్కమాటలో చెప్పాలంటే, మాతృభూమిగా ఎంపిక చేసుకొన్న దేశ సేవానిరతిలో ఏ ఒక్క అవకాశాన్ని నివేదిత వ్యర్థం చేయలేదు.

ఎక్కువ కాలం జీవించక పోయినా ఆఖరి నిముషం వరకు, ఆమె జీవితం దేశసేవకే అంకితం అయింది. తన సమస్తము ఒడ్డి, దేశ జీవన స్రవంతిలో తాదాత్మ్యం చెంది, దేశ సేవా నిరతిలో క్రియాత్మకంగా ఆత్మ సాక్షాత్కారం చేసుకొన్న మహావ్యక్తిగా ముందు తరాలవారికి ఉత్తేజం కలిగించే మార్గదర్శకురాలిగా, ఆమె జీవితం చిరస్థాయిగా నిలిచిపోతుంది. సంస్కారం ఉట్టిపడే ఆమె దుస్తుల తీరు, గంభీరమైన శీలంతో కూడి ఉన్న ఆమె నడవడి. సభాసదుల్ని ముగ్ధుల్ని చేసి, ప్రబావిత మొనర్చేవని ఆమె సమకాలికులు పేర్కొనే వారు.

అంతేకాక ఆలోచనా సరళిలోను, ప్రవర్తనలోను ఒక కొంత దూకుడు స్వబావము ఆమెలో ఉండటం వల్ల, కొందరికి కొన్ని సందర్భాల్లో ఆమె ధోరణి

ఇబ్బంది కరంగా ఉండేదని కూడ వారు అనేవారు. ఆమె కున్న ప్రగాఢ విశ్వాసం వల్లను, దృఢ సంకల్ప బలంతో కూడి ఉన్న కార్య శీలత్వం వల్లను, ఆ విషయ సందర్భం బట్టి ఆమెలో ఆ దూకుడు స్వభావం చెలరేగేదని, మరొకటి కాదని వారు ఒప్పుకొనేవారు. ఏది ఎలా ఉన్నా అప్పటి సంఘటనల దృష్ట్యా ఆమె కున్న ప్రగాఢ విశ్వాసం, దృఢ సంకల్ప బలం, కార్య శీలత్వం ఆనాటి స్త్రీ పురుషుల్లో చెరగని ముద్ర వేశాయని చెప్పక తప్పదు.

# 11

# నివేదిత సాహితీ సిరి సంపద

నివేదిత భారతీయ ఆలోచనా పరంపరల్ని పూర్తిగా అవగాహన చేసుకొంది. ఆ నిశిత దృష్టి ఫలితంగా ఆమె వ్రాసిన ఎన్నో గ్రంథాలు వ్యాసాలు ఆమె మనకందించిన సాహిత్య సిరిసంపదలని భావించవచ్చు. ఈ గ్రంథాలు, ఈ వ్యాసాలు, దేశంలో జరిగిన జరగబోయే సంఘటనల దృష్ట్యా, పాశ్చాత్య ఆలోచనా పరంపరలతో బేరీజు చేసి పోల్చి, సమకాలికి రాజకీయ, సామాజిక కార్యకలాపాలు ఉద్యమాల పోకడలు, ఏ తీరు తెన్నుల్లో సాగుతున్నాయో మనకు నిశితమయిన అంతర్దృష్టిని కలుగ జేస్తాయనడానికి సందేహం లేదు.

ఆమె రాసిన మొదటి ప్రచురిత గ్రంథం ''కాళి ది మదర్'' (కాళీమాత) ఆ పుస్తకంలో మనోవ్యథలతో తపించిపోతున్న నరునికి కాళిమాత ఉగ్రరూపమయిన శక్తిగా కనపడుతుంది. ఆ ప్రతిమా మూర్తి నరునితో హేలగా ఆడుతూ గోచరిస్తుంది. అందుకని ఆ కాళీమాతని, చిన్న బిడ్డతో వినోదంగా ఆడుతూ ప్రేమ వాత్సల్యాల్ని ముప్పిరిగొంటూ నీడనిచ్చి రక్షిస్తున్న ప్రేమ స్వరూపిణిగా మనం అర్థం చేసుకోవాలి. దేవీ స్వరూపం గురించి క్లిష్టమయిన ఈ భావనను వివిధ దృక్పథాల నుంచి తృప్తికరంగా తగ్గట్టు వివరించి నివేదిత కొన్ని వ్యాసాలు రాసింది.

''ది మాస్టర్ యాజ్ ఐ సా హిమ్'' గ్రంథంలో నివేదిత స్వామి వివేకానంద తన జీవన సరళిని ఎట్లా ప్రభావితం చేశారో వివరంగా తెలియ జేస్తుంది. ''కన్‌ఫెషన్స్ అఫ్ సెయింట్ ఆగస్టీన్'' గ్రంథంతో ఈ గ్రంథం అన్ని విధాల తులతూగుతుందని సమర్థులైన విమర్శకులు పొగిడారు. వైభవోపేతమై సమున్నతమైన ధీశక్తితో స్వామి వివేకానంద స్వామి చేసిన తత్త్వ బోధలు, ఉపదేశాలు, వీటిలోని అతి సూక్ష్మ వ్యత్యాసాలని, నిగూఢ రహస్యాలని బాగా తెలిసికొని మనలో ఆలోచనా పరంపర రేకెత్తేలా నివేదిత విశదీకరిస్తుంది.

''నోట్స్ ఆన్ సమ్ వాండరింగ్స్'', ''ది మాస్టర్ యాజ్ ఐ సాహిమ్'' గ్రంథానికి జతగా అనుసరించే పుస్తకం అని చెప్పవచ్చు. వివేకానంద స్వామితో కలిసి హిమాలయాల్లోను, మత సంబంధంగా శ్రద్ధాసక్తులు కలుగజేసే ఇతర

ప్రదేశాలు ప్రాంతాలు ఆమె పర్యటన చేసినప్పుడు తన దృష్టిని ఆకట్టుకొని మనస్సులో ముద్రవేసిన దృశ్యాలను అనుభూతులను కళ్ళకు కట్టినట్టు ఆ పుస్తకంలో సువ్యక్తం చేస్తుంది.

వివేకానంద స్వామి గురించి తాను రాసిన వ్యాసాలు చేసిన ఉపన్యాసాలు సేకరించి పుస్తక రూపంలో ప్రచురించిన గ్రంథం ''కేదారనాద్ బదరీనారాయణ్ - ఎ పిల్ గ్రిమ్స్ డయరీ'' ఆమె దర్శించిన పవిత్ర ప్రదేశాలకి కట్టడాలకి ఉన్న అన్యోన్య సంబంధ ప్రాముఖ్యాన్ని, సన్నిహిత సంబంధాల్ని ఉత్కంఠ కలిగేట్టు వివరించింది. ఆ స్థలాల స్వాభావిక పుట్టు పూర్వోత్తరాలు, ఆ దేవాలయాల వాస్తుశిల్ప ప్రాధాన్యం గురించి ఆహ్లాదం కలిగించే వర్ణనలతో ఈ పుస్తకం నిండి ఉంటుంది.

నివేదిత రచించిన ''ది వెబ్ అఫ్ ఇండియన్ లైఫ్'' పుస్తకం ప్రామాణికమయిన ప్రాచీన రచనల కోవకు చెందిన ప్రథమ శ్రేణి గ్రంథంగా ఉన్నత స్థానాన్ని అలంకరించుకొందని చెప్పవచ్చు. అప్పటి సామాజిక వ్యవస్థీకృత పరిస్థితులు హైందవ కుటుంబాల్లో వ్యక్తుల శీలం, వారి నైతిక స్వభావాలు ఈ రెండు ఎంత అవినాభావ సంబంధంగా అన్యోన్యంగా సమాజంలో నెలకొని ఉన్నాయో సమ దృష్టితో నిశిత పరిజ్ఞానంతో పోల్చి సూక్ష్మ వ్యత్యాసాలను, ఆ పుస్తకంలో వివరించి నివేదిత మనల్ని ఆశ్చర్య చకితుల్ని చేస్తుంది. హైందవ సమాజంలోని కులవ్యవస్థ తీరు తెన్నులను ఆనాడు నెలకొన్న పూర్వాపర పరిస్థితుల దృష్ట్యా, నిర్దిష్టరీతిని, ఆమె మనకు స్పష్టం చేస్తుందని మనం జ్ఞాపకం పెట్టుకోవాలి. ఈనాడు చెలరేగుతున్న కులతత్వ అభిమానాలు, వైషమ్యాలు వాటివల్ల ఉత్పన్నమయిన అవినీతి చర్యలు అన్యాయాలు ఆనాటి సమాజంలో లేనేలేవు. కాగా కులవ్యవస్థ స్వతస్సిద్ధంగాను తరతరాల సంప్రదాయ సిద్ధంగాను, స్థిరీకరించిన ప్రయోజనాలను సమాజానికి లభ్య పరిచింది. లభ్యపరిచి తద్వారా జీవనోపాధి అనే హామీని వ్యక్తులకు అందించి ఇచ్చేది కనుక వేర్వేరు కులాల వారు సమాజంలో వారి వారి బాధ్యతల మేరకు తమ దైనందిన జీవితాలను గౌరవ ప్రదంగా వెళ్ళబుచ్చుకొనే వారని అవగాహనతో ఆనాటి చరిత్ర సత్యాలను నివేదిత ఆ పుస్తకంలో నిరూపించింది.

హిందూ నారి తన కోరికలను సుఖాలను వదులుకొని కుటుంబాన్ని తీర్చి దిద్దటానికి స్వలాభా పేక్ష లేకుండా ఎలా నిర్ణయాలు తీసుకొంటుందో, భర్తను కోల్పోయిన హిందూ విధవరాలు తన ప్రారబ్ధ కర్మ అని తన మనస్సుని సరిపెట్టుకొని, ఉదార బుద్ధితో కుటుంబానికి అంకితమయి శేష జీవితాన్ని ఎలా సాగిస్తుందో నివేదిత మనకు చెపుతుంది. వీరి యిద్దరి మనః ప్రవత్తులు తనని

ముగ్ధురాల్ని చేసినట్టు ఆ గ్రంథంలో ఆమె పేర్కొంటుంది. కాని హిందూనారి హిందూ విధవరాలు విషయంలో, జీవిత అంకితం జీవిత ఆత్మార్పణ అనే పెద్ద పెద్ద మాటలు ఉపయోగించి వారిని వర్ణించటం, వారు పడే అసలు బాధల్ని అవమానాల్ని నిర్లక్ష్యం చేసే నిర్దయనే సూచిస్తుందని అధునికులు భావించవచ్చు, వారిపై సమాజం లోటుపాట్లతో చిన్న చూపు చూడటంవల్లనే, హైందవ స్త్రీ తన విద్యా విషయంలో పై స్థాయిలను అందుకోలేక పోయిన కారణంగా, జీవితాన్ని సార్థకం చేసుకోలేక, అసంపూర్తిగానే జీవితాన్ని వెళ్ళబుచ్చుతోందని నివేదిత హెచ్చరించింది. సామాజిక స్థాయీ దృష్ట్యా తనకున్న కోరికల్ని తీర్చుకొని, అపేక్షల్ని నెరవేర్చగల నేర్పరితనం ఆమెలో లోటు అవటం మొదటిది, వ్యక్తి జీవిత అస్తిత్వం దృష్ట్యా ఆమెలో అంతర్నిహితమయిన శక్తి సామర్థ్యాలు పైకి ఉత్తేజితం చెందక లోలోనే ఇగిరి పోవటం రెండవది - ఈరెండూ, హిందూనారి విద్యావంతురాలు కాకపోవటం వల్లనే, సమాజంలో జరుగుతు న్నాయని నివేదిత తెలియజేస్తుంది.

ఒక సాహిత్య వ్యాసంలో ఆమె రచించిన కొన్ని వాక్యాలు అసాధారణమయిన ఆమె దూరదృష్టిని నిరూపిస్తాయి.

''వారిలో విప్లవాత్మకమయిన ఉద్యమం ఆరంభమయి సమగ్రంగా అపారంగా విస్తృతమవుతుంది. ఒక గొప్ప మార్పు వస్తుంది. ఆ మార్పు విప్లవ ఫలితంగా వస్తుంది. కాని విప్లవ కారణంగా కాదు. ఆ మార్పు వచ్చి ప్రజానీకం మీద ప్రభవిస్తుంది. ఆ జాతి జాతి, అద్భుతమయిన విజయ దర్పంతో చివరకు ఆవిష్కరింప బడుతుంది. తన బిడ్డలపై, పరంపరగా ముందు తరాల వారి బిడ్డలపై కూడ చెరగని ముద్ర వేస్తుంది. ఆ మహా విప్లవం ఏ మహాంకురం నుంచి మొలకలెత్తుతుంది? ఎప్పుడు మోసులు వేస్తుంది? ఎప్పుడు ఏపుగా పెరుగుతుంది? ఆ మహాంకురాన్ని ఎక్కడెక్కడ వెతకాలి?''

ఈ ప్రశ్నలకు జవాబులుగా సత్యాంశాల మీద మనలో మనకి నమ్మిక చేకూర్చుకోవాలి. అంటే ఒకానొక యుగారంభానికే కారణ భూతం అయ్యే ఒకానొక విశిష్ట భావం ఉత్పన్న మవటానికి ఒక పరిమిత ప్రాంతం పరిణతి చెందితే - భారత వర్షం - ఆ పరిమిత ప్రాంతంగా పరిణతి చెందిందని చెప్పవచ్చు- ఆ విశిష్ట భావం కుంభవృష్టి అయి, భావ స్పందన కోసరం ఎదురు చూస్తూ వేచి ఉన్న ప్రాంత ప్రజానీకంపై అన్ని వైపుల నుంచి కుప్పతెప్పలుగా కురిసి, కురిసి పోతుంది.

ఆ ప్రజానీకమే కాక వారి ఆవాసాలయిన కట్టడాల గోడల రాతి ముక్కలు కూడ ఆ విశిష్ట భావ ప్రశ్న వచనాల్నే పలుకుతాయి. ఆకట్టడాల గోడల

కొయ్యముక్కలే గొంతెత్తి జవాబుల పలుకుల్ని మారు మ్రోగిస్తాయి.

అందిరికి సమానంగా పంచియిచ్చే ఒక మంచిని కలుగ జేయటానికి అపారంగా తీవ్రమయిన పోరాటం అదంతటదే పెల్లుబికి చెలరేగుతుంది.

విశిష్ట మయిన భావం, తీవ్రమయిన పోరాటం ఈ రెండు చర్య ప్రతి చర్యగా, వాటి వాటి నిజస్వరూపం ప్రస్ఫుటంగా కచ్చితంగా బహిర్గతం అయ్యేలాగ, ఒకదానినొకటి, ఎత్తి విసరి పారవేసుకొంటూ, కలబడుతూ, రెండు, తమ తమ గమ్యాలని లక్ష్యాలని సిద్ధించుకునే ఆఖరి క్షణం దాక, చర్య ప్రతిచర్యలు జరుపుతూనే ఉంటాయి.

టెలిగ్రాములు, ఉత్తర ప్రత్యుత్తర సౌకర్యాలు, అందరికీ అర్థమయ్యే ఒక భాష, స్ఫూర్తితో భావాల్ని పుస్తక రూపంలో పెట్టటానికి ముద్రణ పరికరాలు - ఇవి తేలికగా దొరికే ఈ రోజుల్లో లక్ష్యం సిద్ధించే వరకు చర్య ప్రతిచర్య కొనసాగించటం సులభసాధ్యం అవుతుంది. కాని అశోకుని కాలంనాటి భారత వర్షంలో ఈ కార్యకలాపాలే సిద్ధించటానికి రెండు వందల సంవత్సరాలు పట్టవచ్చు. కాని అదే జరగటానికి ఈనాడు ఒక దశాబ్దం చాలు.

ఇంగ్లీషు భాషా పద పరిజ్ఞానం వల్ల భావైక్యం పరిగణన చెంది, జాతీయతా భావము మహోన్నత సిద్ధాంతమై, తత్సంబంధమయిన కృషికి, క్రియాకలాపానికి, ఆ మహోన్నత సిద్ధాంత ప్రచారానికి, జాతి జాతి ఆయత్తమై సంఘటిత పరచుకోవలసిన ఆవశ్యకతను - తనకు తానే నిరూపించుకొంటుంది.''

నిజానికి, గాంధీ మహాత్ముని నేతృత్వం క్రింద భారత వర్షం నిద్రాణం నుంచి మేల్కొని విజయోన్ముఖంగా జాతీయతా భావ ప్రేరణను ఎలా పొందిందో చూస్తే, నివేదిత దూరదృష్టి పరిజ్ఞానంతో, పై వాక్యాల్లో వ్రాసినట్లు, ఒక దశాబ్దం తర్వాతనే అది జరగటం మనల్ని ఆశ్చర్య చకితుల్ని చేస్తుంది.

అదేకాక స్వభావ సిద్ధ ఫలితంగా పర్యవ సానంగా మరొక ఉదంతం కూడ అనివార్యంగా జరగక తప్పదని నివేదిత జోస్యం చెపుతుంది.

దృఢ సంకల్పంతో భారతనారి తన ప్రయోజనాల్ని సంపూర్ణంగా నెరవేర్చుకొని తన హక్కుల్ని సమగ్రంగా అమలు జరుపుకోకుండా, వాటిని జార విడుచుకుంటూ ఇంక ఎంతోకాలం వేచి ఉండదు! తల్లిగా తన ప్రయోజనాలన్నీ భవిష్యత్తులోనే ముడిపడి ఉన్నాయని ఆమెకి బాగా తెలుసు. ఒక తరం వారు భంగపాటు చెంది పూర్తి ఓటమి పొంది తేచాలు; ఆ తెగ తెగ సంతతి వారందరికీ తమ పిత్రీయం రద్దయిపోయి, వారసత్వమంతా కోల్పోయే ప్రమాదానికి వారు గురి అవుతారని కూడా భారతనారి నిస్సంకోచంగా అర్థం చేసికోగలుకతోంది. కనుక తన బిడ్డల అదృష్ట భాగ్యం విజయం అవ్వాలి కాని,

వారు లొంగిపోవటం జరగ కూడదని, కార్యకారణ సిద్ధాంత రీత్యా, సమర్థవంతంగా ఆమె నిర్ణయిస్తుంది.

ఇంక ఆరీతి భారతనారి చక్రం పట్టి, నౌకా ప్రయాణం పోకడని నిర్ణయించి, యావద్దేశ సమస్యల్ని పరిష్కరించే బాధ్యతల్ని ఒక్కసారి చేజిక్కించుకొంటే, తన బాధల్ని, ఇబ్బందుల్ని చక్కదిద్దమని ప్రాధేయపడుతూ విజ్ఞాపనా పూర్వకంగా అర్థించాలని ఏ స్త్రీ కయ్యా, మీరుసలహా లివ్వ అవసరం కలిగేది?'' అని నివేదిత నొక్కి అడుగుతుంది.

నివేదిత తన దృష్టికి తగిలిన పూర్తి విశేషాల్ని అనుభూతుల్ని ఆ గ్రంథంలో సమగ్రంగా వచన చిత్రణ చేసి, భారత భవిష్యత్తులో స్పష్టంగా తనకు గోచరమయ్యే మానసిక దృశ్యాల్ని ప్రత్యక్షీకరించుకొంటుంది.

ఆమె రాసిన చిన్న చిన్న వచన రచనలు పద్యాలు సంకలనం చేసి కూర్చిన పుస్తకం ''ఏన్ ఇండియన్ స్టడీ అఫ్ లవ్ అండ్ డెత్'' ప్రేమ మరణం, ఈ రెండిటి విషయమై భారతీయుల కున్న అభిప్రాయాలను, భావాలను, తాను అవగాహన చేసుకొన్న విధంగా నివేదిత వివరిస్తుంది.

హైందవ కుటుంబ సభ్యులు వారి వారి జీవన సరళి విధానాల్లో సూక్ష్మ మయిన బేధాలు ఎట్లా చోటు చేసుకొన్నాయో ఉటంకిస్తూ వ్రాసింది, ''స్టడీస్ ఫ్రమ్ యాన్ యీస్టర్న్ హోమ్''లో నివేదిత.

ఆమె శత జయంత్యుత్సవ సందర్భంలో నివేదిత రాసిన ఉపన్యాసాలు, వ్యాసాలు సంకలనం చేసి రెండు సంపుటులుగా ప్రచురించి విడుదల చేశారు. అవి వివిధ విషయాల మీద మంచి పరిజ్ఞానం కలుగ జేసి, ఆ విషయాల అన్యోన్య సంబంధా లన్నింటిని మనం మరల గుర్తించి విషద పరచి కోనేట్టు మనలో స్ఫూర్తి కలుగ జేస్తాయి. ఆ సంకలనం – హైందవ ఆధ్యాత్మిక సందేశం, హైందవ తత్త్వ శాస్త్రాల పురోగతి, సామాజిక సంబంధంగా యుక్తాయుక్త పరిజ్ఞాన విశేషాలు ఇస్లామ్ మతము, ఆసియాలో ఇస్లామ్, ఆమత బోధల్లోని ఆకర్షణీయమయిన సిద్ధాంతాలు, వాటి వైశిష్టం, గురించి విశదంగా ఆమె వివరించిన ఉపన్యాసాలు వ్యాసాల సంపుటి.

ఇస్లామ్ మత విషయమై, భారతదేశ పరిస్థితుల దృష్ట్యా ఆమె ఒక అవలోకనం చేసింది. భారతీయ ముస్లిమ్‌ల మూల స్థానాలు ఈ దేశపు గడ్డలోనే నాటుకుపోయి ఉన్నాయనీ, మనుగడకై ఈ గడ్డమీదనే వారు నిలద్రొక్కుకోవాలనీ గ్రహించి, ఆ విధంగా వారు చరించాలని ఆమె ఉద్దేశ పడింది.

''హౌ అండ్ వై ఐ ఎడాప్టెడ్ ది హిందూ రెలిజియన్'' అన్న పుస్తకం ఆమె వ్రాసిన ఆత్మకథా కథన రేఖాచిత్రం. అది ప్రత్యేకంగాను, ఆసక్తి దాయకంగాను ఉంటుంది.

భారతీయ లలిత కళల గురించి, అప్పటి కళా కారుల కళా ఖండాల గురించి, కొన్ని రచనల్లోను కొన్ని వ్యాసాల్లోను ఆకర్షకంగా ప్రతిపాదించి నివేదిత మనకు రమణీయమైన కనుల విందు వీనుల విందు కలుగజేస్తుంది. 14, 15, 16 శతాబ్దాలలో రోమన్ కావ్యాల ప్రభావ ఫలితంగా యూరప్ దేశ లలిత కళ ఎలా పునరుజ్జీవనం పొందిందో, మన కవగాహన చేసి విశద పరుస్తుంది.

హైందవ జీవన విధానాల్ని నిజంగా ఏకోణాల దృష్ట్యా చూసి మనం అర్థం చేసికోవాలో తెలియ జేస్తుంది. ఆ విధానాల్ని సోదాహరణంగా నిరూపించే కథల సరిత్సాగరం ''క్రేడిల్ టేల్స్ అఫ్ హిందూఇజమ్.''

''రెలిజియన్ అండ్ ధర్మ'' అన్న గ్రంథం - హిందూ మంత సంప్రదాయాలపై శ్రద్ధను ఇనుమడింప చేసి, వ్యక్తులను చైతన్య వంతులుగా శీలవంతులుగా రూపొందించి తద్వారా జాతీయ శీలాన్ని పెంపొంద జేయవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉందని నివేదిత నిరూపించే వ్యాస సంపుటి.

''ఫుట్‌ఫాల్స్ అఫ్ ఇండియన్ హిస్టరీ'' శీర్షిక గల నివేదిత రచన మరపురాని ఈ క్రింది గేయంతో ప్రారంభమవుతుంది.

''ఓ మాతా నీ చరణ కింకిణులు మేము వింటాం
తరతరాలుగా అవి మెత్తగా సుతిమెత్తగా
ఈ ధరిత్రిని అక్కడక్కడ స్పృశిస్తున్నాయి.
నీ పదముద్రికల్లో గోచరించే కమలాలే
చారిత్రక నగరాలు, ప్రాచీన వేదసంచయాలు
కవితలు... ఆలయాలు... ఉదాత్త జీవితాలు
హక్కుల కోసరం కఠోరమైన సంఘర్షణలు
''ఓ మాతా! ఎక్కడికి తీసుక పోతున్నాయి?
నీ పాద ముద్రలు ఎటు దారి చూపుతున్నాయి?''
ఆ సందేశ పరమార్థాలను ఆస్వాదించేందుకు అనుమతించు,
మానవుడు మహోన్నతుడనే గ్రుడ్డి నమ్మకాన్ని పోగొట్టి
విశాలమైన జ్ఞాన దృష్టిని ప్రసాదించు.''
''ఓ మాతా! ఎక్కడికి తీసుకు పోతున్నాయి?
నీ పాదముద్రలు ఎటు దారి చూపుతున్నాయి?
మమ్మల్ని దరిచేర్చుకో, మాతా! ముక్తి దాయినీ!
మేము నీ బిడ్డలం, పసి పాపలం చిరు మొలకలం
మా హృదయ సోపానాలు నీ చరణాలధివసించే వేదికలు కావాలి
మేమంతా నీవారం... నీ స్వంతం... ఓ భూమ్యాదేవీ!

''ఓ మాతా! ఎక్కడికి తీసుకు పోతున్నాయి?
నీ పాదముద్రికలు ఎటు దారి చూపుతున్నాయి.''

మానవులు వ్యక్తిగతంగా ఏ కాలంలో ఏ ఉనికి స్థానంలో వసించినా, ఆ కాలం, ఆ ఉనికి స్థానం యొక్క పరిణామం, వారి వారి శీలంపై స్వభావంపై ప్రతి బింబిస్తుందని ఘంటాపదంగా సవివరంగా నివేదిత చిత్రించిన తీరు, మొండి వైఖరి అవలంబించే మార్క్సిస్టు వారిని సహితం ఆహ్లాద పరుస్తుంది. కాగా అరేబియాలో తెగ తెగలుగా ఉండే వర్గ వ్యవస్థలను ఏకమొత్తంగా ఐక్య పరచి, ఒకే జాతిగా సంఘటిత పరచవలసిన మహత్ కార్యాన్ని మీద వేసుకొని, వారి నందరినీ శక్తి మంతమయిన జాతిగా అరేబియా ప్రవక్త తీర్చిదిద్దిన తీరు, కాలం స్థానం, ఈరెండిటి అన్యోన్య ప్రాబల్యం పరిణామం వల్లనే అని నివేదిత సూక్ష్మ బుద్ధితో అవగాహన చేసుకొని మనకి సూచించింది.

''సివిక్ ఐడియల్ అండ్ ఇండియన్ నేషనాలిటీ'' అనే గ్రంథం ''దేశాభిమాని మహా ప్రాణంగా నిత్యం ఉచ్చరించ వలసిన భాషితములు'' అని ఈ విధంగా ప్రారంభం అవుతుంది.

''భారతావని ఏకైక అస్తిత్వం కల ఒకే దేశమనీ అఖండత్వాన్ని సంతరించుకొన్న ఒకే దేశమనీ, అది అజేయ మయినదనీ నా నమ్మకం:''

''భారతీయులందరకు సమాన హక్కు భుక్తాలున్న మాతృ మందిరంగా, సమాన బాగస్వామిత్వం కల ప్రయోజనాల నందించే భూమాతగా, సమ తుల్యంగా ప్రేమ వాత్సల్యాల్నిచ్చే మాతృభూమిగా జాతీయ సమైక్యత నిర్మాణం దృఢంగా జరిగి పోయింది.''

మతాల్ని సామ్రాజ్యాల్ని రూప నిర్మాణం చేయుకల తేజోబలశక్తి, అధ్యయనా పరిజ్ఞానం కల నిష్ణాతులైన విద్వాంసులలో ఉన్నధీ శక్తి. దైవాంశ సంభూతులయినవారు ధ్యానముద్రలో సంతరించుకొన్న తపోబలశక్తి. వేద ఉపనిషద్ వాఙ్మయంలో ఉచ్చరించబడిన ఈ త్రిశక్తి మాలో, మా అందరిలో ప్రాదుర్భావం చెందిందనీ, దాన్నే జాతీయతా భావము అన్న పేరుతో ఇప్పుడూ మేము పిలుస్తున్నామనీ నా నమ్మకం''

భారతావని వర్తమాన సమయం భారతావని గత కాలంలోకి లోతుగా నాటుకుపోయిందనీ, ఎట్ట ఎదుట కళ్ళకు కట్టినట్లు మహిమాన్వితమయిన భారతావని సమగ్ర స్వరూపం ప్రకాశవంతంగా గోచరిస్తోందనీ నా నమ్మకం:''

ఓ జాతీయతా భావమా
రా నాలోనికి రా!
ఉల్లాస రూపంలో కాని

విచార రూపంలో కాని
గౌరవ ప్రదంగా కాని
అవమాన ప్రదంగా కాని! రా!!
నన్ను నీ దానినిగా చేసుకో!

అది ఈ నాటి భారత జాతీయుతా వాదానికి నిశ్చయంగా న్యాయ సమ్మతంగా, చట్ట సమ్మతంగా గోచరిస్తుందో - ఆనాటి జాతీయ వాదికి అంత న్యాయ సమ్మతంగాను గోచరించింది. ప్రజలలో బలమైన దృఢమైన సామాజిక స్పృహ అవగాహన సాంఘిక బాధ్యత లేకపోతే జాతీయతా భావానికి అసలు మనుగడే లేదనే ముఖ్యాంశాన్ని సిస్టర్ నివేదిత నొక్కి వక్కాణించింది. ఈ పరిస్థితి యొక్క విస్తరణా రూపం శాఖోప శాఖలుగా ప్రభవిస్తే ఎలా ఉంటుందో ఆ గ్రంథంలో నివేదిత సంపూర్ణంగా స్పష్టంగా పొందుపరిచింది.

నిజమయిన జాతీయ విద్యా విధానానికి కావలసిన మౌలిక అవసరాలను గూర్చి ప్రతిభాన్విత మయిన చర్చ... ''హింట్స్ ఆన్ నేషనల్ ఎడ్యుకేషన్ ఇన్ ఇండియా.''

ప్రాథమిక విద్యావ్యాప్తి యొక్క ఆవశ్యకతను విద్యాధికులుగా ఎలా గుర్తించాలి, బాల బాలికల సేవ నిర్బంధంగా ఎంతకాలం జరగాలి. అనే విషయాలను నివేదిత ఈ గ్రంథం ప్రవేశికలో రాసింది. విద్యావిధానం మీద నివేదిత వ్రాసిన ప్రసంగ వ్యాసాలు ఈ గ్రంథంలో కొన్ని ముఖ్యాంశాల్ని నొక్కి చెపుతాయి :

(1) భారతీయ జీవన విధానాల్ని అవగాహన పరచుకునేందుకు కావలసిన విధంగా వ్యవస్థీకరించ బడిన పద్ధతి నిర్నిబంధంగా విద్యావశ్యకతలో ప్రతి ఫలించటం. (2) కొత్త విషయాలను తెలుసుకోవాలనే ఉత్సుకత మానసిక అవగాహన, సంసిద్ధత - సామాన్య సాంఘిక బావనలను గ్రహించి పరిపూర్ణ మానవాతభి వృద్ధికి తోడ్పడటం (3) ఆలోచనతో పాటు ఆవేశ పూరితమయిన శిక్షణా విధానంపై ప్రత్యేకమయిన ప్రాధాన్యం. (4) జాతి నిర్మాణంలో విధి నిర్వహణకున్న ప్రాముఖ్యతను గుర్తించే నియమావళికల విద్యా విదాన దృక్పథం (5) మన దేశ చరిత్రకు భౌగోళిక నైసర్గిక పరిస్థితులకు అనుగుణంగా రూపొందిన జాతీయతా భావాలు ఆదర్శాలను పెంపొందించే ప్రేరణాత్మక విద్యా విధానం.

ఇవీ నివేదిత చెప్పిన ప్రధానాంశాలు. విదేశాల పై మోజు, విదేశీయ మయిన సంస్కృతులపై అపోహతో కూడిన వ్యామోహం గూర్చి కూడా నివేదిత వ్రాసింది.

భారత మహిళలకు కావలసిన సరైన విద్యా విధానం అనే అంశంపైన ఒక వ్యాసం ఈ సంకలనంలో కూడ ఉంది. స్త్రీ విద్యపై వ్యాసాలు రాయటం

ఆమెకు ఎంతో అభిమానమైన అంశం. స్త్రీ విద్య పై రచనలు చేయటం నివేదిత ఎప్పుడు శ్రమగా భావించలేదు. స్త్రీ విద్య గురించి వ్రాసిన వ్యాసానికి అనుబంధంగా ''ది ప్రాజెక్ట్ అఫ్ ది రామకృష్ణ స్కూల్ ఫర్ గర్ల్స్'' అన్న అంశాన్ని చేర్చింది.

యువతరానికి సాంఘిక సేవలో శిక్షణ నివ్వటంలో గల లక్ష్యాలు, శిక్షణ నిచ్చే పద్ధతులను గూర్చి చర్చించినవ్యాసం ''సజెషన్స్ ఫర్ ది ఇండియన్ వివేకానంద సొసైటీస్.''

చరిత్రను అధ్యయనం చేసే విద్యార్థులకు పరిశోధకులకు అవసరమయిన ముఖ్య సూత్రాలను ''నోట్స్ ఆన్ హిస్టారికల్ రిసెర్చ్'' అన్న వ్యాసంలో నివేదిత విశదీకరించింది.

''ఏ నోట్ ఆన్‌కో ఆపరేషన్'' అనే వ్యాసంలో నివేదిత రచనా శైలి మనస్సుకి హత్తుకుపోయే విధంగా ఉంది.

''ది ప్లేస్ అఫ్ కిండర్ గార్డెన్ ఇన్ ఇండియన్ స్కూల్స్'' అనే వ్యాసంలో శిశు విద్య గురించి చాలా విస్తృతంగా ఆసక్తి దాయకంగా విశదీకరించింది. భారతదేశంలో విద్యా విధానంలో ప్రత్యేక శిక్షణ ఒక అంతర్భాగం కావాలని నొక్కి చెప్పుతూ రెండూ వ్యాసాలు వ్రాసి ఆ పుస్తకం పూర్తిచేసింది. నిజానికి ఆ గ్రంథం. జాతీయ విద్యావిధానంపై ఒక సంగ్రహ విజ్ఞాన కోశం వంటిది.

''గ్లింప్సెస్ అఫ్ ఫామిన్ అండ్ ఫ్లడ్ ఇన్ యీస్ట్ బెంగాల్'' తూర్పు బెంగాల్ (1906) కరువుల వరదలు పై ఒక దర్శనంగా నివేదిత రచన ఇలా ప్రారంభం అవుతుంది.

''సువిశాలంగా విస్తరించిన తూర్పు బెంగాల్ డెల్టా భూములంత వైశాల్యత కల ఫలవంతమైన మాగాణి మరెక్కడా, ఆఖరికి భారత దేశంలో కూడా మరొకటి లేదు. గంగ బ్రహ్మ పుత్ర నదుల ముఖద్వారాలలో ఉన్న ఆ సారవంతమైన భూమి భారతదేశంలో కల్లా అతి విశాలమయిన ముక్కోణపు మాగాణి. పశ్చిమాన కలకత్తా నుంచి తూర్పున చిట్టగాంగ్ దాక మళ్ళీ ఉత్తర దిశగా ఢక్కా, మైమేన్ సింగులు మధ్య వున్న త్రిభాజాకారపు భూ ప్రదేశమంతా సారవంతమయినదే. సుమారుగా చెప్పాలంటే రెండు వందల మైళ్ళుంటుంది. ఆకుపచ్చ నీలం ప్రకృతిలో చాలా ఆకర్షణీయమయిన రంగులు కదా. అక్కడి పంట పొలాలు, అడవులు కొబ్బరి చెట్లు, పళ్ల తోటలు ధాన్యపు రాసులు అన్ని పచ్చగా ఆకు పచ్చగా కనుపిస్తాయి. మిగిలిన భాగమంతా... అంటే పైన అందమయిన ఆకాశం... క్రింద నిర్మలమయిన నదీ జలాలు... నీలంగా ముదురు నీలంగా ఉంటాయి.

హాలెండ్‌ను గురించి గాని, వెనీస్ గురించి గాని తెలిసిన వారికి ఈ స్వర్ణ భూమి బెంగాల్ సుదూరమయిన సున్నితమయిన జ్ఞాపకాలను గుర్తుకు తెస్తాయి. ఎందుకంటే ఇవికూడా జలమయమయిన భూ ప్రాంతం అవటం వల్ల కాబోలు. అయితే మానవ హస్తంచే కబళించబడినది కాదు. ఈ బెంగాల్ ప్రాంతం కూడా, నిర్లిప్తంగా, ఏదో జరగ బోతున్న సంఘటన కోసరం ఎదురు చూస్తున్నట్లు ఆ ఆకాశ స్వర్గ గోపురం క్రింద నిరీక్షిస్తూ ఉంటుంది. దూరంగా ఉన్న పచ్చిక బయళ్ళ మీదుగా చూస్తే ఏ క్షణంలోనైనా, ఒక తెల్లని తెర చాపకల పడవ దూరంగా నీటిపై తేలుతూ కనిపించవచ్చు. అణచుకోలేనంత నిశ్శబ్దతతో కూడిన పవిత్రమయిన దీవెన వంటి ఆశీర్వచనం ఇక్కడ ప్రసాదింప బడుతుంది. ఆ భావనఒక విశాలమైన అనంతం నుంచి ఒక సూక్ష్మ మయిన అనంతం ఆవిర్భవించినట్లుంటుంది.

ఈ గ్రంథం తూర్పు బెంగాలులో నివేదిత సాంఘిక సేవకు అనుభవాలకు అద్దం పట్టినట్లుండే కథా కథనం. ఆమె పరిశీలనలు తూర్పు బెంగాల్ సమస్యలకు ప్రత్యక్ష నిరూపణలు. నేడు బంగ్లాదేశ్‌గా వ్యవహరింప బడుతున్న ఆ ప్రాంతం ఈ రోజుకీ అట్లాంటి సమస్యల్నే ఎదుర్కొంటోందేమో!

నివేదిత రచించిన ''తోడేళ్ళ మధ్య గొర్రె పిల్లలు'' (లాంబ్స్ ఎమాంగ్ వుల్వ్స్) హైందవ సమాజంపై ఐరోపా దేశపు క్రైస్తవ మిషనరీల అపోహలకు వక్ర బుద్ధితో చేసెడి ప్రచారాలపై చాలా ఘాటైన విమర్శ.

మొత్తం మీద నివేదిత వ్రాసిన సృజనాత్మక సాహిత్యంలో మనకు భారతీయ జీవన విధానాల యవనికపై మహత్తర దృశ్యంలా గోచరిస్తాయి. అవి హైందవ సమాజంలోని లోతు పాతులను గూర్చి సునిశితంగా పరిశీలించే విధానంలో ఉంటాయి. భారతీయ వాతావరణానికి, పరిస్థితులకి, సంస్కృతులకి సమస్యలకి, మధ్యన నిలిచి ఉన్నట్లుగా పాఠకుడికి ఒక పరిపూర్ణ అనుభూతిని కలిగించగల రచనా శిల్పం ఆమె రచనల్లో నిక్షిప్తం అయింది.

Lasertypeset at Sai Graphics, Hyderabad and printed at
JJ Offset Printers, Delhi - 110035